1932




## క్షీరసమస్య

ఒకజాతియొక్క బలారోగ్యములు ఆజాతికిలభించు క్షీరమునుబట్టియుండునని చెప్పబడుచున్నది. పాలు ద్రవపదార్థమగుటచే దానిని పలువురు పానీయముగపరిగణించుచున్నారు. పాలను పోషణవిషయమున ఘనపదార్థముగ నెన్నవలసియుండును. పాలు ఆహారముకాని పానీయముగాదు. చింతగించవైచిన మునుగని చిక్కనిపాలలోనున్న పోషకపదార్థము ప్రపంచమున మఱియేపదార్థమునలేకుండుట డాక్టరుల విశేషపరిశ్రమచే కనుగొనబడినవిషయము.

శుచియైనవి, రుచియైనవియగుపాలు సమృద్ధిగనుండిననే జనులు ఆరోగ్యవంతులుగ నుండగలరు. హిందూదేశమునందలిపాలకు శుచి, రుచి, సమృద్ధిఅను ఈమూడుగుణములలో నొక్కటికూడనుండుట అరుదు. కావుననే మనపట్టణములందు ఏడాదిలోపుశిశువులు వెయ్యింటికి 666 వఱకు చనిపోవుచున్నారు. ఎదిగెడుశిశువులకు పాలే సరియైనఆహారము. రోగగ్రస్తులకు, ముసలివారలకు పాలకుమించినపథ్యములేదు. పాలు ఆహారముగనీయనిచో పిల్లలుఎదుగుట ఆగిపోవునని అమెరికా, ఐరోపాలయందు పరిశోధనలమూలమున కనుగొనబడినది. ఆయుర్వేదమున బలవర్ధకములగు ఔషధములలో పాలు నేయి, ప్రధానద్రవ్యములు.

పాలు మంచివిలభించుటకు పశుసంపద అభివృద్ధినొందవలయును. గోవునుపూజించుట మతధర్మముగనెంచబడు హిందూదేశమున పశుసంపదవిషయమై ఏమాత్రముశ్రద్ధయు గనబఱుపబడుటలేదు. పశుసంపదను అభివృద్ధిపఱచుకొనుటలో పాశ్చాత్యదేశములుచూపుచున్నశ్రద్ధలో సహస్రాంశమైన హిందుదేశమున చూపబడుటలేదు. మనపల్లెటూళ్లలో పశువులకు బీళ్లులేవు. మాగాణిపంటగలగ్రామములందు అవి అన్నిసమయములందును కట్టురాళ్లనేయుండును. తిరిగి మేతమేయుటకు నోచనిపశువులుతగినన్ని పాలుఈయజాలవు, ఇచ్చిన కొద్దిపాటిపాలలో పోషకపదార్థముఉండజాలదు. కాబట్టి కాలికొద్దితిరిగి పశువు మేతమేయుటకుతగిన పచ్చికబయళ్లు మనదేశమున ముఖ్యావసరములగుచున్నవి. తగినన్ని పచ్చిక

బయల్లుండుటచో పాలు సమృద్ధిగపొందవచ్చును. క్షీరవిషయక సమస్యలలో సమృద్ధిగపొందుట ఒకటేయేగాక వానిని శుచిగనుంచుటయు నొకప్రధానసమస్యయే.

హిందూదేశమున శిశువులయందు క్షయవ్యాధి ప్రాయికముగా వ్యాపించియుండుటకు కారణము అశుచిక్షీరములేయని నిరూపింపబడినది. పశువులు క్షయవ్యాధిపీడితములై యున్నను అది గుర్తుపట్టుట మంచిఅనుభవశాలురకే మిక్కిలికష్టము. అమెరికాయందు ఒకమండలమున పశువులనన్నిటిని ఒకసారి పరీక్షింపగా ప్రతిపశువునందు కొద్దియో గొప్పయో క్షయరోగక్రిములు, వానిలక్షణములు కనిపించినవి. అరోగలక్షణములు తీవ్రముగ గలపశువులను విడనాడి అచ్చటివారు తమఆరోగ్యమును కాపాడుకొనిరి. హిందూదేశమున ఇట్టి విశాలదీర్ఘపరిశోధనము కలలోనిమాట. కావున ఇతరమెలుకవలచే ఈక్రిములను మనము రాకుండ చేసికొనవలయును. ఉపయోగించుటకు పూర్వము పాలు బాగుగ కాచుట ఇట్టి మెలుకువలలో ముఖ్యమైనది. పశువులలో క్షయవ్యాధిక్రిములు సర్వసాధారణ మనినంతమాత్రమున విశేషముగ భయపడవలసిన పనిలేదు. అరోగవ్యాపనము మిక్కిలి నెమ్మదిగజరుగును. పౌష్టికాహారముచే పరిపోషింపబడుచున్న శరీరమున ప్రవేశించియు ఈ క్రిములు ఎట్టిహానిని చేయజాలవు. కాని పేదహిందూదేశమున పౌష్టికాహారము పలువురకు అందనిమ్రానిపండు. దానికితోడు ఇచ్చటిస్త్రీలు బాల్యముననే తఱచుగర్భములను ధరించి అతిపేదపిల్లలనుగని తాము రోగనిరోధకశక్తినిగోల్పోయి పిల్లలకుగూడ ఆశక్తిలేకుండ చేయజాలుచున్నారు. ఈకారణములచే ఇచ్చటి పాలవలన పూర్తినష్టమును మనమనుభవించుచున్నాము. నేడుప్రపంచమున ప్రతివత్సరము క్షయరోగమువలన చనిపోవుచున్న అయిదు మిలియన్లజనులలో విశేషభాగము హిందూదేశమువారే యగుట నిశ్చయము. ఈవ్యాధి ఇచ్చట పాలవలననేకలిగి పాలవలననే అభివృద్ధినొందుచున్నదని డాక్టరు మూరుగారు చెప్పుచున్నారు. కావున ప్రతిగృహిణియు క్షీరముల శుచివిషయమున ప్రత్యేకశ్రద్ధ వహింపవలసిన అవసరమెంతేని హిందూదేశమునగలదు.

కాని ఈసమస్య ఒక్క గృహిణులశ్రద్ధవలన పూర్తిపరిష్కారమునొందదని మాత్రము జ్ఞప్తియందుంచుకొనవలయును. పశువులలో ఈక్షయరోగక్రిములు పూర్తిగనాశనము చేయబడవలయును. ఇది మిక్కిలివ్యయముూలకమైనది. అయినను సాధ్యమైనంతత్వరలోనే రాజకీయవేత్తల ఆలోచనకెక్కవలసియున్నది. ఆలస్యముచేసినకొలదియు తెల్లపేగుఅనబడు ఈ క్షయవ్యాధికి నిర్నిరోధప్రచార మిచ్చుటయేయగును. హిందూదేశమున క్షీరసమస్య ఇన్నివిధముల అధ్వాన్నస్థితియందున్నది. ఈదుస్థితి ఎన్నడుతొలగిపోవునో; ఎన్నడు ఈదేశము రుచి, శుచిగలపాలు సమృద్ధిగగలిగి తనబిడ్డలను పోషించుకొనగలుగునో? ఆశ్చర్యమేమన పరిశ్రమలకు పేరుమోసిన ఇంగ్లాండు మొదలగుదేశములందు పశుసంపద బాగుగనుండుటయు, వ్యవసాయమే ప్రధానవృత్తిగగల హిందూదేశమున అది కావలసినంత బాగుగనుండుటయు,

* * *

# ప్రాతఫక్కి పాటలు

రచయిత్రి
శ్రీమతి
యస్. వి. సరళాదేవిగారు

* * *

౧

ఏమిటిగంగమ్మ వెఱ్ఱిగంగమ్మ
సిగ్గుకొంచంలేక మగనిశిరసెక్కె.
జాలారిగంగమ్మ జాణయైయాను
చెట్టపట్టినమగని గుట్టుదోచింది.

౨

పార్వతి దేవైతే పతివ్రతేసుమ్మ
మగనిదేహములోన సగముపంచుకొనె
మగనికంటెనేను వేరుకాదంచు
పార్వతీ మాతల్లి భర్తనిమిడింది.

౩

సరస్వతీదేవికి సరసమేమిటో
మగనిమొగమునుంచి క్రిందకేదిగదు
చదువులసానైతే జగజంతసుమ్మ
మగనిమోవితోడ నెపుడుముచ్చట్లు.

౪

అదృష్టవతియాను అలచ్చిమమ్మ
ఆమెకాపురమెన్న మగవానిఱొమ్ము
లక్ష్మిమాదేవైతే రాగయేసుమ్మ
మగనిచంకలోన నెపుడుకులికేని.

౫

అడవులె స్వర్గమ్ము దుంప లమృతమ్ము
పతినిఎడబాయని పతివ్రతామణికి
మగనితోడనేసౌఖ్యం మగనితోస్వర్గం
మగనితోడిదిబ్రదుకు మగువలకునెపుడు.

౬

జాబిల్లితోడుత వెన్నెలాపోవు
పతిజీవములతోడ పతివ్రతాపోవు
జీవబంధం తెగిన జీవితేశ్వరుని
వెన్నాడె సావిత్రి అదియేమివలపో?

# భావపక్షులు

శ్రీమతి యస్. శారదా దేవిగారు

అసాధ్యమా! నీనివాసస్థానమెద్ది?

—సాధ్యమా! నపుంసకుని యూహాప్రపంచములో.

ప్రేమించిపువ్వగుపత్రము, పూజించిపండగు పుష్పము.

గరికిపోచయు నీయనంతభూమి కొకదివ్యాభరణమేయగు.

నీవునిన్ను చూడవు. చూడనులేవు. నీనీడనుమాత్రము చూడగలుగుదువు.

పొగడ్తలతో నీమిత్రునిపరిహసింపకుముసుమా!

ఓసంద్రమా! నీయారాటమేమి?

—ప్రాపంచికప్రశ్నాపరిష్కారము.

ఓయాకసమా! నీయాశయమేమి?

—నిరాడంబరమగు నిశ్శబ్దత్వము.

కల—భార్యవోలె వదరునట్టిది.

నిద్ర—భర్తవోలె భరించునట్టిది.

కొమ్మలు ఫలభరితములగునట్లు చేయుటలో వ్రేళ్లు ఎట్టిప్రతిఫలమును గోరవుగదా!

ఫలమా! నీవెందుండివచ్చితివి?

—పుష్పమా! నీహృదయమధ్యమునుండి.

పుష్పమునందలి మధువునెల్లగుడిచి విశ్వాససూచకముగ నొకసంగీతశబ్దమునుగావించి కదులును తేనెటీగ; కాని తనయుపహారణచే పుష్పభారమును తగ్గించితినను గర్వముతో నిశ్శబ్దముగ నెగిరిపోవును సీతాకోకచిలుక.

చేప నాకాశపథమున నెగదన్నుకపోవుటయు నొకదయాపూర్వకమగు కార్యమేనని తలంచును పక్షిరాజు.

నీటిలో చేపనైన బాగుండుననిపక్షియు, గాలిలోపక్షినైన బాగుండునని చేపయు తలంచుచుండును.

# వేదవతి

సహదేవ సూర్యప్రకాశరావుగారు

అది హిమాలయశిఖరాలయాంకసీమ
అది జటాచ్యుతగంగాపగావిశాల
తీర మచ్చట వేదవతీలలంతి
అతిమహాస్సుతో చేయు మహాతపస్సు
ఆతపస్సులో కొనవోవు నామెలేత
వయసు క్రీగంటనవ్వుతో నివాళిబెట్టు;
ఆమె లేయెదలో తీపులార్చి వేసి
ఎగయుకోరికతీవ సుమించుకొరకు.
ఆమెతండ్రి కుశధ్వజనామకుండ
వేదవేదాంగవిద్యాప్రవీణు డతడు
మిహికశిశిరారుణారుణోన్మిషితవేళ
చదువుచుండ వేదము పుట్టినదికుమారి
వేదసారమ్ము రూపమ్ము విరిసికొనగ
త్రిజగతీహృదయమ్ము నర్తించిపోవ
బహుగుసన్యాసిమనసు చెప్పంగనేల?
ఆకుమారియే వేదవతీకుమారి.
కన్నులరవిచ్చి పసికందువేడ్క
కరగి పారిన వాత్సల్యగరిమతోడ
మూర్ధ్ని శిరముకన్నుల ముద్దులుంచి
నవ్వికొన్నాడు హత్తికొన్నాడు తపసి
హత్తికొన్నహృదియె యూర్చి యశ్రుబిందు
లోడ్చె, ఎంతమిసిమివెత్తనో యెడంద
కన్నకూతుపరిష్వంగకలన నాత
డేమిభూతసౌఖ్యమ్ము లూరించుకొనెనో.
అనిదూర్పుల బాష్పజలాంజలిచ్చి
ముసిలితాపసి శపథమ్ముపూనినాడు
వేదవతిని శ్రీపతికి నర్పింతుననుచు
లోకములునదియింప సుశ్లోకసరణి.
ఆమెయందాలరాశి, నేత్రంచలాల
చిందుప్రణవానుభూతరోచిర్మరీచి
ఆమెనీలాలకాలిక అలరుకలల
యలలు హృదిరేగు నీరెండయామెవయసు.
ఆమె నందనోద్యానవనీమనోజ్ఞ
పారిజాతము, నయనచకోరకమ్ము.
జారుప్రయాన నామెయేపంథతార,
అతనిశూన్యగృహమ్మున కమృతదీప్తి.
ఆమెశోభామనోజ్ఞత లాకలించి
ఎందరెందరో రాజరాజేంద్రులెంద
రోసురాసురేశు లేతెంచినారు
కలికి వేదవతీకరగ్రహణమునకు.
అంతటివయస్సులో నామహాతపస్వి
పట్టినశపథమున్ విడువంగబోడు
ఆశలన్నియు నడియాశలైన వారు
వచ్చినట్టులేమార్గమ్ము పట్టినారు.
దంభదైతేయు డొకనాడు తరలివచ్చి
విమలతేజోవయస్విని వేదవతిని
గాంచియెఱిగించినాడు హృత్కాంక్ష మునికి
వానికోర్కె తపసి నవ్వులో నడంచె.
ఎంతవలపూనివచ్చెనో యేమొగాని
అసురభూజాని కృధబూని యట్లెవేసె
గుప్తఖడ్గానశయ్యాప్రసుప్తమునిని
ఏసినట్టులే వాడు నశించిపోయె.
కంటికన్నీరు మున్నీరుగాస్రవింప
గోలుగోలునతపసి యిల్లాలువగచి
జ్వలనకుండమ్ములో ప్రవేశమ్ముచేసె
తన్వి ఏమినోచెనో సతీత్వమ్మునిలిపె.
వేదవతి ఏకవతి నయవినయశీలి
తండ్రిశపథమ్ము గడతేర్పతలపునూని

హారునితలపూని కారుకారడవిలోన
చేయుచుండెతపస్సు సుశ్రీనటింప.
జైత్రయాత్రమార్గాన అచ్చటికివచ్చి
రావణాసురు డామె కల్యాణమూర్తి
గాంచి యామెచరిత్ర నాలించివలపు
లెగయ తీరనివాంఛ నాశించినాడు.

రావణ

"తలిరుప్రాయమ్మునందచందమ్ములడవి
గాయువెన్నెలజేసి రాగప్రశస్తి
లేనిహారుకోసమే తలపూనినావు
ఎంతటియమాయికవతివే ఇంతి! నీవు
రాజకోటీరకోటీవిరాజితోరు
వజ్రవైడూర్యమాణిక్యభవ్యకాంతి
నాపదాలకళాసించు; నన్నుజూచి
ఒదుగురవిచంద్రతతి యంబుదోదరాన
సురగరుడనాగసాధ్యకిన్నరులునాకు
తొలగిపోవుదురిరుపార్శ్వములకుభీతి
నన్నుమన్నింప కన్నుసన్నలమెలంగు
నిఖిలభువనాళి, బాళి నన్నేలుకొనుము."

వేదవతి

"ఓనిశాచర! చాలు లెమ్మోయిమాట
లలరువెదతోడ వలపుభాగ్యమ్ముతోడ
నాబ్రదుకు నివేదించుకొన్నాను హారికి
ఇతరులకుసుంతతావు లేదీ యెడంద.
సకలదివిరాజభువిరాజమకుటదివ్య
రత్ననీరాజితాంచితప్రభుడవాడు
త్రిజగదీశులు నమ్మికొలిచెడుబంట్లు
ప్రకృతినీవ దియైన నెవ్వరికివలయు
క్రమజీవితాశాసుధాకరుడు హారుడు
వాడు నీలోన నాలోన ప్రకృతిలోన
దానెయై వెల్గుచున్నాడు దానవేంద్ర!
అతనికాదని తగునే యహంకరింప."

వేదవతిమాట పెడచెవిబెట్టినాడు
కనులమోహాంధు చిమ్మచీకటులుకవియ
క్రిందుమీదులచూడక కెరలి వేణి
కరములై సేయ నద్ది సకమ్ము తెగియె
వడవడవడంకె పరకరస్పర్శనాన
స్వచ్ఛహృదయము కలగుండువడియె ఏమి
యేమియోచించుకొనియెనో ఏమొయూచి
కొన్నక్రోధమ్ముతో కొట్టుకొనియెనపుడు.

ఆమె భీషణాభీలక్రోధాగ్నికీల
అప్పు డాసతి కన్నెత్తియరయలేరు
ప్రళయకాలఘుమంఘుమారవముతోడ
పలికెనిటులనాశాశలు వక్కలవ్వ.

"ఓశఠనిశాట! ఇటువినవో మదీయ
దారుణతపస్సువెచ్చించి నీరుసేయ
నిన్ను, నేన సీతౌదు వినీలశిఖల
నీవినాశమ్ముకోరి జన్మింతునవల".

# శ్రీ హరీ!

శ్రీమతి ధూళిపాళ సీతారామలక్ష్మీగారు

ఉ. పారుచు దా వలంపడిన పక్షియనంగ నపారఘోరసం
సారదురంతపాశములసందున చిక్కిన మానవుండు నీ
చారుతరప్రపూర్ణసరసామృతవీక్షణనొందగల్గునే
ఘోరవిషాదవేదనల కుందుచునుండునుగాక శ్రీహరీ!

# పవిత్ర ప్రేమ

శ్రీమతి సూరత్తు నాగమణెమ్మగారు

చీకటిపడుతోంది. గోదావరి గట్లనొరసి పారుతోంది.

ఆమెరుపులు ఆఉరుములుతిరిగి ఆకొండలోయల్లో ప్రతిఫలించి ప్రతిధ్వనిస్తున్నాయి.

వానతుంపరకొంచముగా పడుతోంది. ఒకపల్లెవాడు తనపడవని ఒడ్డుకు జేరేసి ప్రక్కనే ఉన్నతనగుడిశకు పోబోతున్నాడు.

ఉద్వేగపూరితాలైన హృదయాలతో, అలసిపోయిన శరీరాలతో, తడసిపోయిన దుస్తులతో యిరువురు—యువతీయువకులు—అక్కడకుచేరారు.

వాణ్ని అక్కడనే ఆపేసి తమప్రేమను పెద్దలు తిరస్కరించారనీ, అంచేత దొంగతనంగా పారిపోతున్నామనీ, వాళ్లు తరుముతున్నారనీ, అంచేత తమ్మావతలి ఒడ్డుచేర్చమనీ బ్రతిమలాడేరు.

వెనుకగుర్రపుగిట్టల శబ్దాలు వినవస్తున్నాయి.

ఒకమెరుపు మెరిసింది...ఆయువతి దీనముఖంలో ఉద్వేగం విస్పష్టంగా ప్రతిఫలిస్తోంది.

అత జాటవికుడైనా, సహజంగా ప్రేమఅంటే ఏమిటో ఎరుగకపోయినా, ఆయువతీయువకుల ప్రేమకొరకై, వారిదీనాలాపాలకొరకై, సహజసుందరియైన ఆయువతికొరకై పడవకట్లిప్పేడు.

పడవనట్టేటిలోనికి పోయింది...

ఇంతలోనే ఆఅమ్మాయి తండ్రి సపరివారంగా ఒడ్డుచేరేడు. గాలి హోరుమంటోంది. వర్షంప్రబలమైంది.

ఇంకొకమెరుపు మెరిసింది...

ఆక్రీనీడలో ఆఅమ్మాయి ప్రియుణ్ణి బిగ్గకౌగిలించుకొని సహాయంకొరకు ఒకచెయ్యిచాపి నిల్చోడంచూచేడు.

తోడనే అతనికోపమంతా దుఃఖములోకి మారిపోయింది.

ఏడ్చాడు......పిలిచేడు...లాభంలేకపోయింది ..

ఆముప్పేరితో ఆపడవ అచ్చటనే అదృశ్యమైపోయింది. పడవఅవతలిగట్టు చేరనేలేదు.

# చిరస్మరణీయములు

బొడ్డు బాపిరాజుగారు

పరిచయములేని దొలుదొల్త పాఠశాల
నుండి యింటికి జనువేళ నొంటిగలసి
చూపులోచూపు జొన్పినన్‌జూచి మనసు
నపహరించిననాటి సాయంతనమ్ము.

పరిణయముహూర్తమున దలబ్రాలుపోయ
నంజలిపుటంబునెత్తి నాయాస్యమరసి
సిగ్గుదొంతరలన్‌ముగ్గి జెలువుసూపు
నెలతరూపు చిరస్మరణీయముగద.

తలుపుకడనాపి సకియలు ధవునిపేరు
నుడువువేగమెలేకున్న విడువమనుచు
దగవుసేయగ ముసిముసినగవులురల
సగముగొణిగి సగముజెప్పు సఖియనేర్పు.

మనసులోగల్గు ప్రణయమర్మములవెల్ల
మసలుకడగంటి జూపుతో మాటలాడి
వద్దకరుదేర హరిణశాబకములీల
నొక్కయుదుటున బరుగెత్తునువిదసొంపు.

తలిరుగెమ్మోవి నవ్వువెన్నెలలుగురియ
చెక్కుటద్దాల లోలకుల్ జిందులాడ
కన్పడియుకన్పడక నోరగంటజూచు
వనితక్రీగంటిజూపు నెప్పటికిమఱవ.

# సంతానసమస్య

తాత కృష్ణమూర్తి గారు, బి. ఏ; యల్. టి.

ప్రపంచంలో అన్నిదేశాలలోను బుద్ధిమంతులు తీవ్రంగాఆలోచిస్తున్నారీసంతానసమస్యనుగూర్చి. కాని 'లోకో భిన్నరుచిః' అన్నారు పెద్దలు. జనసంఖ్య పెరిగినకొద్దీ, దేశానికి శ్రేయమేనని వాదిస్తారుకొందరు; కొంపమునిగిపోతుందని ఘోషపెడతారు మరికొందరు. ఎవరికితోచినసమాధానాలు వాళ్ళుచెప్తారు. ఉన్ననిజం ఆలోచిస్తే మాత్రం బిడ్డల్నికనే వాళ్ళుకాని, కననివాళ్ళుకాని దేశాన్నిగూర్చి ముందుగాఆలోచించుకొని ఏదో నిశ్చితాభిప్రాయానికివచ్చి ఆవిధంగా ఆచరిస్తున్నారనితోచదు. ఎవరిసంగతి వాళ్ళు తిన్నగా ఆలోచించుకో గలిగితే, లోకానికి మేలుచేసినంతఫలం! సంఘంమాట, దేశంమాట దేవుడెరుగును. ఆత్మశ్రేయమైనా యోచించుకొని నడుచుకునే బుద్ధిమంతు లెందరున్నారు, ఈకాలప్రపంచంలో?

కోరుకొని పెళ్ళిచేసుకునే ఆచారమైనా లేని మనహిందూదేశంలో, మంచిచెడ్డలు వితర్కించుకొని సంతానం పడయడమనే సంగతి హాస్యాస్పదంగా కనిపిస్తుంది. ఒకవేళ ధైర్యవంతుడెవడైనా స్వతంత్రంగా నడుచుకుందుకు సాహసిస్తే, 'పులినిచూసి నక్క వాతపెట్టుకున్నట్లు' పాశ్చాత్యదేశస్థులనుచూసి వీడు చెడిపోతున్నాడని మొత్తుకుంటారు మనలోకొందరు చాదస్తులు. స్వబుద్ధిచేత ఆలోచించుకోరు. కాని బిడ్డల్నికనే విషయంలో మనవాళ్ళు యిప్పటికైనా కళ్ళుతెరిస్తే వాళ్ళకు, బిడ్డలకు, దేశానికి, అందరికీ మేలుకలుగుతుంది.

ఉద్దేశపూర్వకంగా, తపఃఫలితంగా కోరుకొని సంతానంపొందడం మెప్పు. అది జీవితానికి శోభ. కాని మొర్రోవద్దనియేడుస్తూ, అప్రయత్నంగా పిల్లల్నికనడంకంటె అన్యాయం మరొకటిలేదు. బిడ్డలు పుట్టడం, పుట్టకపోవడం అంతా భగవదేచ్ఛకాని మనచేతిలోయేమున్నదనీ, తలక్రిందుగా మనం తపస్సుచేసినా విధివశం తప్పించగలమాఅనీ వెర్రివేదాంతాలుచెప్పడం బుద్ధిహీనం.

'సంసారసాగరం దుఃఖం, తస్మాత్ జాగ్రత!' అనిబెదిరించే మనపూర్వులకు సంతాననిరోధమంటే తప్పుగా, అసాధ్యంగా తోచిఉండాలి. పురాణాల్లోను, మహాకవుల కావ్యాల్లోను సంతానప్రాప్తికి దంపతులుపడవలసినపాట్లు కొన్ని పేర్కొనబడిఉన్నవి కాని నిరోధసాధనాలప్రసక్తిలేదు. మన ఆయుర్వేద వైద్యులు యీవిషయమై అసలే ప్రస్తావించరు. సామాన్యజనులకు విద్యలేమివలన, చదువుకున్నవాళ్ళకు శాస్త్రాల భయంవలన, స్త్రీలకు సహజమైనసిగ్గువలన సంతాననిరోధంగూర్చి స్వతంత్రాలోచనలు చేసుకుందుకు వీలు లేకుండాఉంది. కాని మనదేశంలో యించుమించు ప్రతీమనిషికీ తనసంతానంగూర్చి యేదోఒకవిధమైన అసంతృప్తి లేకపోలేదు. బిడ్డలులేనందుకు వగచేవాళ్ళుకొద్ది. భరించలేనంతమందినికని మక్కుని బాధపడేవాళ్ళు జాస్తి. సంఘానికి, నీతికి, శాస్త్రాలకి వెరచి శ్లేష్మంలోపడ్డయీగలవలె కొట్టుకుంటున్నారు వీళ్ళు గత్యంతరం కానక. స్వర్గతుల్యంగాఉండవలసిన దాంపత్యసౌఖ్యాన్ని పాడుచేసుకొని జీవితాన్ని నిప్పుల్లోపొర్లించుకుంటున్నవాళ్లెందరోఉన్నారు! వాళ్ళపిరికితనం, మూఢవిశ్వాసాలు దేశానికెంతో అనర్థంతెస్తున్నాయి.

పెద్దల యెడల భక్తి చూపడం మంచిదే. సంఘాచారాలను మన్నించడం అవసరమే. కాని, దేశకాల పరిస్థితుల కనుగుణ్యంగా నరుడు తన ప్రత్యేకజీవితాన్ని నడుపుకోవడం బుద్ధికి లక్షణం. తన్నుమాలిన ధర్మం తెలివిహీనం. పెళ్ళివిషయంలోను, పిల్లలవిషయంలోను ఎవరి మంచిచెడ్డలు వారే నిర్ణయించుకోవడం సబబు. సంఘానికి, పెద్దలకి, పూర్వాచారాలకి వెరచి అనవసరంగా బాధపడడం మన దేశస్థులప్రారబ్ధం కాబోలు!

అజ్ఞానం, దరిద్రం, రోగాలు, అకాలమృత్యువులు దేశంలో అంతకంతకూ అధికమవుతున్నాయి. శరీర బలం, మనోబలం, మనలో క్రమంగా నశిస్తున్నాయి. పాడిపంటలకు ప్రసిద్ధిచెందిన యీ పుణ్యభూమిలో

ఆకలిబాధకు తాళలేక జనులు యేడుస్తున్నారంటే, యెందుచేత? అర్థంలేకుండా పెరుగుతూవున్న జనసంఖ్య, మూర్ఖంగా బిడ్డల్ని కలిపించే అసందర్భవివాహాచారాలు కొంతవరకు యీదుస్థితులకు కారణాలని తోస్తుంది.

వెనకటిరోజులవైభవం స్మరించుకొని సంతోషించడం వ్యర్థం. ఇప్పటిరోజుల దుర్దశకు వగచి యేడవడం నిరర్థకం. రాబోవురోజులనుగూర్చి సాధకబాధకాలన్నీ బాగా విమర్శించుకొని, సాధ్యమైనంతవరకు స్వతంత్రబుద్ధిచేత ప్రతిమనిషీ తనజీవితాన్ని సౌఖ్యప్రదంగా చేసుకోవడం ధర్మం.

సృష్టిలో వున్న విచిత్రాల్లోకల్లా, బిడ్డలు పుట్టడమనే చిత్రం మహాఅద్భుతమైనది. జీవరాసులకుగల శక్తులలోకల్లా బిడ్డలుకనేశక్తి ఒక్కటే వాటిలోవుండే జీవత్వాన్ని నిరూపిస్తూవుంది. అట్టి అమూల్యమైన శక్తిని దుర్వినియోగం చేసుకొని, మానవుడు లేనిపోని కష్టాలనుభవిస్తున్నాడు. బహుశః మరికొన్ని శతాబ్దాలు గడచినపిమ్మట గాని యీశక్తిని తనస్వాధీనంలోకి తెచ్చుకోలేడేమో నరుడు!

దేవుడనుగ్రహించిన బిడ్డలుకనేశక్తితో నేటి మానవుడు తృప్తిపొందలేకుండా వున్నాడు. కోరిన బిడ్డను, కోరినసమయమందు పొందడానికి ప్రయత్నిస్తున్నాడు. పెద్దపెద్దశాస్త్రవేత్తలీవిషయమై వింతవింత శోధనలు చేస్తున్నారు. పురుషుడిజోక్యంలేకుండా స్త్రీకి గర్భంవచ్చే ఉపాయమేమిటని వెతుకుతున్నారు. బ్రహ్మదేవుడు మట్టిబొమ్మల్నిచేసి జీవంపోసినట్లు, మనంకూడా 'లేబొరేటరీ'లో బిడ్డలను సృష్టించగలమా అని ఆలోచిస్తున్నారు. దీనినే "ఎక్టోజెనిసిస్" శాస్త్రమంటారు. అసహజసాధనాలవల్ల బిడ్డలను నిర్మించగల ఉపాయమే నరుడు కనిపెట్టగలిగితే దేవుణ్ణి ధిక్కరించి మృత్యువును జయించవచ్చును. ప్రపంచం తల్లక్రిందు చేయవచ్చును!

ప్రకృతికి విరుద్ధంగా బిడ్డల్ని సృజించడం మనకు తలకుమించిన కోర్కె కావచ్చును. కాని, పిల్లలక్కరలేనివాళ్ళు కనవలసిన నిర్బంధంలేకుండా జాగ్రత్తపడవచ్చును. సాధారణంగా మనదేశంలో బిడ్డలపుట్టుక బలవంతబ్రాహ్మణార్థంవలె వుంటూవుంది దంపతులకు. కనేవాళ్ళ యిష్టంలేకుండా పుట్టేబిడ్డలసంఖ్య అపరిమితం!

బిడ్డల్ని కనడమంటే సహజమే కాని నిరోధించుకోవడమనేది దాంపత్యధర్మంకాదనీ, అసహజమనీ, అక్రమమనీ, ప్రకృతివిరుద్ధమనీ, చాలమంది ఉద్దేశం. సంతానం పొందడానికి యెన్ని ఉపాయాలాలోచించినా ఆక్షేపణలేదు. నిరోధనసాధనాల విషయమై మాత్రం నోరెత్తి గట్టిగా మాట్లాడితే తప్పు!

ఇతరదేశాలలో యింత అన్యాయంలేదు. హాలెండ్‌లో సంతాననిరోధనజ్ఞానం ప్రజలలో విపులంగా వ్యాపింపజేయడానికి గవర్నమెంటువారే శ్రద్ధవహిస్తున్నారు. ఇంగ్లాండు, అమెరికా, మొదలైన దేశాలలో అనేకులు నిర్భయంగా నిరోధనవిధానా లవలంబిస్తున్నారు. ఒక్క ఇటలీలోమాత్రం తనప్రజలు బిడ్డల్నికనడంలో అశ్రద్ధవహిస్తే వొప్పుకోకుండా వున్నాడు 'ముస్సొలోనీ' ప్రభువు. హిందూదేశంలో మోస్తరు మట్టుకు భూలోకంలో ఎక్కడా వుండదు. పిల్లల్నికనడానికి శక్తిలేక, కోరికలేక, ఆనందంలేక, అప్రయత్నంగా, అజ్ఞానంగా, గుడ్డిగా సంతానాలు పొందుతూ, యేడుస్తూ, మొత్తుకుంటూ, నవ్వుకుంటూ, అఘోరిస్తున్నారు మనదేశంలో అనేకులు. జీవితాశయాలులేవు వీరికి. ఉద్దేశాలులేవు, చేసేపనులకు! విద్యలేదు. స్వాతంత్ర్యంలేదు. గడుసుతనంలేదు. అమాయకంగా అడవిమృగాలవలె తింటూ, అరుస్తూ, పిల్లల్నికంటూ జీవయాత్రగడిపే అభాగ్యులు వీరు. పడేకష్టాలు, పొందేసుఖాలు, అన్నీ తమ కర్మానుబంధాలే అని భావించుకోగల వేదాంతబుద్ధిగల ధీరులు!

బిడ్డలు కావలసినవారు అవశ్యం కనవచ్చును చిత్తం వచ్చినంతమందిని. సంతానాభిలాషగలవాళ్ళు చేసే అర్థంలేనిపనులనుకూడా మనం వెక్కిరించకూడదు. పూర్వులు తపస్సులు చేసేవారట సంతానంకొరకు

దేవుళ్ళు ప్రత్యక్షమై వారికి వరాలిచ్చేవారు. ధర్మసంతానాలకు సంఘం తప్పుపట్టేదికాదు. ఈరోజులలో తపస్సులు చేసేవాళ్ళులేరు. చేసినా దేవుళ్ళు ప్రత్యక్షంకాకుండా ఉన్నారు. అంచాత సంతానప్రాప్తికి, యిప్పటివాళ్ళు చేసే సాధనాలు కొంచెం సులువుగా ఉంటాయి. దేవుళ్ళకీ, దెయ్యాలకీ మొక్కుకుంటారు. ముడుపులు కడతారు. మాంత్రికులనీ, బైరాగులనీ, భస్మాలకోసం ఆశ్రయిస్తారు. ఎరుకుల వాళ్ళనీ, జోతిష్కులనీ ప్రతిమాలి ప్రశ్న చెప్పించుకుంటారు. వైద్యులకు డబ్బిచ్చి ఔషధాలు పుచ్చుకుంటారు. నోములు, జపాలు, దానాలు, తీర్థయాత్రలు–ఎన్నెన్ని చెయ్యాలో అన్నీ చేస్తారు. వారి మూఢనమ్మకాలకుగాని, అనాగరికతకుగాని యెవరూ ఆక్షేపించరు. అభ్యంతరం చెప్పరు. హిందూముత్తైదువ యేదైనా సహించుకోగలదు కాని, గొడ్రాలితనంమాత్రం సహించుకోలేదు.

బిడ్డలు కావాలన్నవాళ్ళ అవస్థలు యీవిధంగా ఉండగా, అక్కరలేదన్నవాళ్ళ మొర్ర వినేవాళ్ళు లేరు. సంతానం వద్దోఅని ఆబ్రహ్మదేవుడుకి విన్నవించుకొని యెన్నిపూజలు, వ్రతాలు చేసినా ప్రయోజనం లేకుండాఉంది, చాలామంది అభాగ్యులకు! పిల్లల్నికనడానికి అయిష్టతగలవాళ్ళందరూ దుర్మార్గులనీ, ధూర్తులనీ, అమానుషప్రకృతిగల రాక్షసులనీ, నీతిదూరులనీ అనుకోకూడదు. నిష్పక్షపాతబుద్ధితో ఆలోచిస్తే, పిల్లల్ని కోరేవాళ్ళయెడల చూపవలసిన గౌరవంకన్న, సంఘం వీరిపట్లనే యెక్కువసానుభూతి చూపవలసి ఉంటుంది.

బిడ్డల్ని కనుక్కోవాలన్నకోర్కె సాధారణంగా ప్రతీమనిషికీ ఉంటుంది. అట్టికోర్కెసహజమేకాక, సంఘాభివృద్ధికి అవసరమనికూడా చెప్పకతీరదు. భార్యాభర్తలను అన్యోన్యప్రేమపాశాలతో బంధించడానికి యేర్పడ్డ మంత్రబలంగల మంగళసూత్రంకంటె, దాంపత్యసుఖంవల్ల జనించిన జానెడుశిశువుకు యెక్కువశక్తి ఉంది. అందుకనే 'అపుత్రస్య గతిర్నాస్తి' అన్నారు పెద్దలు. దాంపత్యానికి సౌఖ్యం, సంఘానికి గౌరవం, దేశానికి బలం చేకూర్చగలవాళ్ళు బిడ్డలు. సంసారంలోవచ్చే ఒడుదుడుకులకు సంతానసహాయ్యంమీదనే ఆధారపడతారు తల్లిదండ్రులు. వృద్ధాప్యంలో అక్కరకు వచ్చేవారు పిల్లలేకదా అని ధైర్యపడతాడుతండ్రి. భూమిని పెకలించి సంపాదించినరత్నాలవలె, తనదేహంచీల్చుకొని కనుకున్న బిడ్డల్ని భర్తకీ, లోకానికీ యివ్వగలిగినందుకు గర్విస్తుంది తల్లి. ఉత్సాహం, ఉద్దేశంగల దంపతులు కోరినంతమందిని కనుక్కోవలసిందే. పిల్లలుకావాలని కోర్కెగలవాళ్ళకు ఆరోగ్యం, శరీరధార్ఢ్యంఉండి, సంతానపోషణకు సరిపడే డబ్బుఉంటే; 'అధికస్య అధికం ఫలం' అన్నట్లు, ఎంతమందినైనా కనుక్కోవచ్చును.

అయితే లోకంతీరు ఆవిధంగాలేదు. కావాలన్నవాళ్ళకు సంతానంఉండదు. అక్కరలేనివాళ్ళకు గంపెడేసి పిల్లలు! ఆసృష్టికర్త చిద్విలాసం యీవిధంగాఉంది. మనుషులలోగాక, యితరజీవరాసులలో కొంతవరకు యీఅనర్థాలు సర్దుకుంటాయి, ఏదో ఒకవిధంగా. 'సర్వైవల్ ఆఫ్ ది ఫిట్టెస్ట్' అన్నన్యాయం ఒక్కటే వర్తిస్తుంది వాటిలో.

మనిషికీ, తక్కినజంతువులకీ యీవిషయంలో కొంత వారాఉంది. తన జ్ఞానసహాయంవలన మానవుడు ప్రకృతిని జయించగలుగుతున్నాడు. అతడు తన సదుపాయంకోసం చేసుకున్న పనులన్నీ ప్రకృతికి విరుద్ధంగానే ఉంటాయి, ఇంచుమించు! తిండిలో, నిద్రలో, శరీరపోషణలో, నడవడికలో– అన్నిటిలోను అసహజంగానే వర్తిస్తాడునరుడు. కాని సంతానవిషయంలోమట్టుకు నేచర్‌కు వ్యతిరేకంగా నడుచుకుందుకు ఎందుకో సంకోచిస్తాడు.

ఇప్పటిమాస్తరుగానే భూలోకంమొత్తంపైని జనసంఖ్య దినేదినే పెరుగుతూఉంటే, కొద్దికాలానికే మహాప్రళయమేదో సంభవిస్తుందని చెప్తున్నాడు, హెచ్. జి. వెల్స్‌దొర. భూమియిచ్చేపంట అందరితిండికీ

సరిపోదనీ, ప్రజలఆరోగ్యం చెడిపోతుందనీ, మనలోఉండే దైవికగుణాలునశించి, రాక్షసులవలె మనం ఒకరి నొకరు చంపుకొని భక్షిస్తామనీ, చెప్తున్నారు దివ్యజ్ఞానంగల మహానుభావులు. వారి బెదిరింపులు అక్షరాలా నిజం కాకపోవచ్చును. అదిగాక, లోకానికి సంభవించే అనర్థాలన్నిటికీ ప్రతీమనిషీ ఉత్తరవాది కాజాలడు. యుద్ధాలకు, భయంకరమైన వ్యాధులకు, తుపానులకు, భూకంపాలకు, వరదలకు, అగ్నిపర్వతాలకు, ప్రమాదాల వల్ల కలిగే అసహజమైన చావులకు, కరువులకు, మొదలైనవాటికి పూచీదారు లెవరు? సృష్టిలో జననమరణాలను కంట్రోల్ చేయడానికి బహుశః భగవంతు డేర్పరుచుకున్న విధానాలు కాబోలివి!

లోకాన్ని ఉద్ధరించడానికి కాకపోయినా, స్వలాభమైనా చూచుకొని, ప్రతీమనిషీ తన సంతానం విషయమై కొంతశ్రద్ధవహించి నడుచుకోవడంమంచిది.

ప్రస్తుతం మనదేశంలో సంతానంగొడవ చాలావిచారకరంగాఉంది. అంగవిహీనులు, అంధులు, బలహీనులు, అల్పాయుష్మంతులు అధికమౌతున్నారు. పుట్టినపిల్లలు బలంగా, ఆరోగ్యంగా ఉండడంలేదు. వాళ్ళకు సరియైన ఆహారపోషణ, దేహపరిశ్రమ, ముద్దుముచ్చటలు, లభించడంలేదు. బాలింతలు, శిశువులు, వేలకొలది యేటా మరణిస్తున్నారు. ఎన్నోకుటుంబాలలో అశాంతి, దుఃఖం విశదమౌతున్నాయి. మొత్తంపైని శోకమయంగాఉన్నాయి పలువురిజీవితాలు. సంతాననిరోధనావశ్యకతను సూచించుటకు దేశంలోఉండే దరిద్రమొక్కటేచాలును. 'ఎట్టివారు బిడ్డల్నికనడానికి అర్హులు? ఎంతమందిని కనడం సబబు? ఎట్టిస్థితులలో కనడం మంచిది?' ఆ ప్రశ్నలకు సమాధానా లాలోచించుకొని కాపురాలు చేసేవాళ్లెందరున్నారు మన దేశంలో?

పెళ్ళిలేకుండాఉండడం మనవాళ్ళకు నీతివిరుద్ధం! సంఘాచారాలనుబట్టి, ప్రతీమనిషీ పెళ్ళిచేసుకొని తీరవలసిందే. శాస్త్రాలలో పెళ్ళిళ్ళకట్టి కట్టుదిట్టాలు సూచింపబడినా, ఆచరణలోమాత్రం యెట్టి అసందర్భపు వివాహాలకైనా ఆక్షేపణలేకుండా ఉంది. ముసలివాడు చిన్నపిల్లను చేసుకుంటున్నాడు. మంచిబలంగల ముష్కరుడు ఊపిరిలేని సుకుమారిని కట్టుకుంటున్నాడు. పుక్టైడు రోగాలతో ఉన్నపుచ్చివాడు పవిత్రమైన కన్యను చేపట్టి చెరుస్తున్నాడు. తనపొట్టతా పోషించుకోలేని అప్రయోజకుడు పిల్లలతండ్రి కావడానికి సిద్ధపడుతున్నాడు. సాధారణంగా వయస్సు, దేహారోగ్యం, డబ్బు, రూపం, ప్రేమ యేవీ అనవసరంలేని పెళ్ళిళ్ళు మనవి! అన్నీ సవ్యంగాఉన్న దంపతులకు సంతానవిషయమై తగినజ్ఞానం, ధైర్యంలేక చెప్పుకోలేనన్ని విచారాలు.

భార్యాభర్తలకు శరీరావయవాలు పరిపక్వానికి రాకమునుపే చిన్నవయసులో శోభనం. గర్భాదానమైన కొద్దిరోజులకే పెళ్ళికూతురుకు వేవిళ్ళు. నెలలు నిండకుండా నొప్పులు. పురుడుగడవడ మొక పెద్ద గండం. గట్టిగా యేడవలేని కొనఊపిరితో ఉన్న జానెడుబిడ్డ. తల్లి మంచంపట్టిపోయి మూడునెలలదాకా లేరుకోలేకపోవడం. పిల్లకు చనుబాలులేకపోవడం. శిశుసంరక్షణవిధానం తెలియక ఆతల్లి నానాఅవస్థలూ పడడం. నెలపురిటినుండి పిల్లకుజబ్బులు. మందులు. దృష్టిదోషాలకుమంత్రాలు. ముసలమ్మలుపెట్టేభూతభయాలు. దేవుళ్ళకు, దేవతలకు మొక్కులు. మళ్ళీ సాధ్యమైనంతత్వరలో తల్లికి గర్భం! ఈవిషమచక్రంలోపడి కొట్టుకునే దంపతులకు మరి ముక్తి, మోక్షం యెక్కడ? దేవుడిచ్చిన యౌవనసౌందర్యాలు త్వరలో రూపుమాసి, శరీరదార్ఢ్యంచెడి, నడివయస్సులో ముసలిదిగాకనబడే తనభార్యమీద భర్తకు క్రమంగా మోహంచచ్చి, పడక గదిచూస్తే విరక్తి, భయం పుడతాయి. ఏడాదికో, రెండేళ్ళకో ఒక్కొక్కబిడ్డచొప్పున పుడుతూఉంటే ఆపిల్లలకుసరియైన సంరక్షణ యెట్లావుంటుంది? ఆతల్లికి యెంతకష్టం? డబ్బుకు యెంతయిబ్బంది? వాళ్ళకు

సంకెళ్ళవలె చుట్టుకున్న పిల్లల్ని విడిచిపెట్టలేక గాని, లేకుంటే గృహస్థాశ్రమం ఎత్తిపెట్టి సన్యాసం పుచ్చుకోవాలనిపిస్తుంది అట్టి తలిదండ్రులకు.

బిడ్డల్ని కనడంలో పురుషుడికిగల బాధ్యతలు తక్కువ. కష్టమంతా ఆడదానిది. కాని, ఆమెసంగతి విచారించడు భర్త. ఎంతసేపూ తనసౌఖ్యం, తనసదుపాయం, తనఆరోగ్యం, తనగొడవే చూసుకుంటాడు. బిడ్డమీద బిడ్డ పుట్టుకొస్తావుంటే చికాకుపడి, పెళ్ళాన్ని తిడతాడు-తప్పంతా తనయందుంచుకొని. పాపం నోరెత్తక ఆయిల్లాలు అన్నిటికీ ఓర్చుకోవాలి. వివాహమంటే హిందూస్త్రీ అనుభవించే సౌఖ్యం యిది! మానం, ప్రాణం, ఆరోగ్యం అన్నీ మొగుడికి ధారపోయ్యాలి. విద్యలేక, స్వాతంత్ర్యంలేక, సౌఖ్యంలేక—యింటికి బానిసై, భర్తకుబిడ్డలుకనే యంత్రమై, సంఘానికీ కులాచారాలకీ వొదిగి, ఆత్మాభిమానం చంపుకొని, అభాగ్యజీవనం గడపాలి. బిడ్డలవిషయమై ఆమె యిష్టాయిష్టాలతో యెవరికీపనిలేదు. భర్తనుతృప్తిపరచడమే ఆమెకువిధి!

సంతాన నిరోధనశాస్త్రం మనస్త్రీలలో బాగావ్యాపిస్తేకాని యిట్టిఘోరాలు కొంతవరకైనా తగ్గవు. బిడ్డల్ని కనిపెంచే సమర్థురాలు ఆడదే గనుక, ఆమెయిష్టాన్ని అనుసరించే సంతానాలు కలగాలి. పురుషులు తగిన శ్రద్ధతీసికొని స్త్రీలకు నిరోధనసాధనాల మంచిచెడ్డలు బోధించాలి.

సంతాననిరోధనజ్ఞానం అందరికీ విశదపరచడంవల్ల దేశంలో దుర్నీతి ప్రబలుతుందని కొందరిభయం. జ్ఞానాభివృద్ధివలన దుర్నీతిఅణగడం సహజంకాని, పెరగడం అసందర్భం. గర్భంరాకుండా కాపాడుకునే ఉపాయం ఆడదానికితెలిస్తే యిష్టంవొచ్చినట్లు చెలరేగి, కాని పనులుచేస్తుందనీ బిడ్డలుకనడం అందరూ మానేస్తే, క్రమంగాజనసంఖ్య క్షీణించిపోయి సృష్టి అంతరించిపోతుందనీ గోలపెడతారు నీతిమంతులు. ఆడదాన్ని సంఘం అజ్ఞానంలో అణగద్రొక్కి ఉంచబట్టి ఆమె బుద్ధిగా ఉంటూవుందనీ, లేకుంటే నీతితప్పి ప్రవర్తించితీరుతుందనీ భావించడం అధర్మం. కడుపువస్తుందన్నభయమే నిజంగా ఆడదానికిలాన్ని కాపాడుతూ ఉన్నట్టయితే, మగవాడి కట్టిభయంలేదు కాబట్టి, అందరు పురుషులూ నీతిదూరులేఅన్న అసందర్భ సారాంశంతేల్తుంది! స్త్రీలపట్ల అన్యాయంగా దురభిప్రాయాలు పెట్టుకోవడం పురుషులు తమఅల్పబుద్ధిని ప్రకటించుకోవడమన్నమాట. ఇక జ్ఞానాభివృద్ధివలన భగవంతుని సృష్టికి అంతరాయం కలుగుతుందేమో అన్న రెండోవాదన మరీ విపరీతంగాఉంది. బిడ్డలుకావాలని కోర్కెగలవాళ్ళు నిరోధనసాధనాలవలంబించరు. అవలంబించ నక్కరలేదు. కాబట్టి, అనవసరసంతానాలు పొందుతున్నవాళ్ళకే యీనిరోధనజ్ఞానం ఉపచరిస్తుంది. అప్పుడు దేశంలో అందరూ సత్సంతానాలు పొందుతూ హాయిగా, నిర్విచారంగా గడుపుకుంటారు తమతమ సంసారాలను. దంపతుల ప్రణయజీవిత మొక నిర్భయానందస్వప్నంవలె మధురంగా గడచిపోతుంది.

## వన్యవృత్తి

శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు

సీ. ఆకలియైనప్పు డవనీరుహాంబులు
పక్వఫలంబు లర్పణము సేయఁ
బరిపూర్ణతోయలై ప్రవహించుచుండెను
శైలాపగలు దాహశాంతి సేయఁ
బొమ్మ్మలెమ్మనకుండ భూమీధరంబులు
వసియింప, నిమ్మగువసతులీయఁ
జాలినయట్లుగా సరసాంబరంబులు
ధరియింప భుజపత్రతతులొసంగఁ

గీ. దినుటకై తిండి త్రాగుటకును జలంబు,
పండుటకుఁదావు ధరియింప వస్త్రములును
నహహ! లభియించుచుండ నయాచితముగ
వన్యవృత్తియె తలపోయధన్యవృత్తి.

# తోలుబొమ్మలు

కవికొండల వేంకటరావుగారు బి. యె; బి. యల్.

రాత్రిరల్లా బొమ్మలాట చూచివచ్చి తెల్లవార్లూనిదర లేక అదేపడగ్గా పడుకొనివుంది ఇల్లాలు. ఇంటిలో వంటలక్క తప్పక లేచి పని చేసుకుంటూవుంది. ఇంటియజమాని అప్పుడే కళ్లునులుపుకుంటూ గుమ్మంలోకివచ్చి వీథి కేసి తొంగిచూస్తూన్నాడు. బళ్ళున తెల్లారి పోయి ఎండబాగా గుడిగోపురంమీద ప్రకాశిస్తూవుంది——రాత్రిబొమ్మలాట ఆడిన వాళ్ళల్లో ఓఆడుదివచ్చి "ఒకపాతకోక అమ్మగార్ని అడుక్కోడానికివచ్చాం" అంది. "అమ్మగారింకా లేవలేదు. నిదరోతున్నారు" అన్నాడు యజమాని. "అమ్మగారైతే రాత్రి మాఆటకు వచ్చారన్నమాటే. ధన్యులం, ధన్యులం. మళ్ళీవస్తాం" అంటూ వెళ్ళిపోయిందది.

ఆమాటలో ఏమీఅర్థం కనబడలేదు యజమానికి. లోపలికివెళ్ళి కల్యకృత్యాలు తీర్చుకొని తనగదిలోకివచ్చి తనయిల్లాలింకా మొద్దునిద్దర్లోనుంటే "లే! లే! తోలుబొమ్మలాటకే యీలా నిదరోతే, ఇంకానృత్యం అదీ నీవు దొరసానులల్లే చేయడమంటూవస్తే అలసిసొలసి కుంభకర్ణురాలివయిపోయ్యేటట్టున్నావు. లే! లే!" అని వీపుమీద ఒక్కమొత్తనిచఱపుచఱిచాడు. ఇల్లాలు గుబుక్కున లేచి "ఏమిటా మోటుహాస్యం?" అంది. "ఏమీలేదు. నీవు బొమ్మలాటదానికి కోకిస్తానన్నావటగా? వచ్చిపోయింది" అన్నాడు యజమాని. "నేను కోకిస్తానన లే, మీరు పంపిస్తానన్నారేమోగాని" అంది ఆబిడ. "ఏమి మతి పోయిందాయేమి? అదిగో మళ్ళీవస్తానంటూ పోయింది" అన్నాడు యజమాని. "వస్తే యిస్తా లెండి" అని ఓవిధమైన తెచ్చిపెట్టుకున్న రుసరుసమొగంతో నిదరమత్తుకొద్దీ చేతిగాజులు చెక్కిళ్ళనో తినరాయితుడునో వులునోవుల్లావుంచుకునే గదికిటికీ తెఱచుకొని వీథిలోకి పాఱచూచింది. చూచి "అదేనా మీరనేమనిషి? భిక్షుకాలు—బొమ్మలాటకత్తె అంటారేమిటి?" అంది. "అమ్మగారైతే రాత్రిఆటకొచ్చారన్నమాటే. ధన్యులం, ధన్యులం అని అదిఅంది. నీవేమన్నా దాన్ని ఆనవాలుపట్టనట్టుగానే మాట్లాడుతున్నావు—అయితే, ఈ తోలుబొమ్మల ఆటలో ఏదోఒకానొక రహస్యంవుండి తీరాలి. తెలుసుకోవాలి" అన్నాడు ఇంటాయన.

అప్పుడింకా ఆపయిని ఆయనకు ఆబిడకు ఈలా జఱిగింది సంభాషణ:

ఇల్లాలు

నేను సాయంకాలం ఆరుఘంట్లకు ఆలాగు పేరంటానికి వెళ్లినాను. ఆయుసుకబయులున నాకేమీ ఆగపించలేదు. ఒకగడపాతి యుండ లేదు. ఒకమనిషి కనిపించలేదు.

యజమాని

సరిగా 6½కు వాళ్లువచ్చి వెదుళ్లపాతి ఒకబురకాలాగు బరకంకప్పి ఎదరతట్టుకు తెర గుడ్డలుకట్టినారు. ఆకట్టడం నీవు చూచి యుండలేదు.

ఇల్లాలు

ఎంతలో తయారయిపోయింది తెర?

అయితే దీపాలెప్పుడు వెలిగించారండీ? బొమ్మలెప్పుడు గుచ్చారూ? ఆడేవాళ్లంతా ఆబరకం క్రిందకు ఎప్పుడు ప్రవేశించినారూ?

యజమాని

నీవు ఇంట్లో పనీగినీ ముగించుకునివచ్చి వేసేసరికి బొమ్మలను గుచ్చి ఆ తెర వెనక బొమ్మలను గుచ్చి ఆముదపుదీపాలను వ్రేలాడగట్టి అంతా సిద్ధంచేసినారు.

ఇల్లాలు

ఈపగలల్లా భిక్షాటనకై తిరిగినవాళ్ళంతా ఆబరకంచాటున వున్నారంటారూ నేను చూడ్డానికి వచ్చేటప్పటికప్పుడే?

యజమాని

మరేమిటనుకున్నావు? మనం వాళ్ళను చీకట్లో చూడకుండా వాళ్లు దీపాలు వెలిగించకుండానే ఆబరకంలో ప్రవేశించి యిప్పుడు దీపాలు పెట్టి బొమ్మల్ని ఆడిస్తారు.

ఇల్లాలు

నిజం?

యజమాని

నిజం.

ఇల్లాలు

అయితే వాళ్లకు ప్రేక్షకుల ప్రేక్ష్యం లేదన్నమాట.

యజమాని

వాళ్లకు ప్రేక్షకులతో పనిలేదు. ఆడించే బొమ్మలతోనేపని. ఆ బొమ్మల మీదకు వెలుగు బాగా ప్రసరించేటట్టు దీపాలెగసందోస్తూ పాడుతూండడం బొమ్మలయొక్క కాళ్లు వ్రేళ్లు అభినయిస్తూవుండడం వాళ్ల పని.

ఇల్లాలు

మధ్యమధ్య బుఱ్ఱుమనేబూరా ఏమిటండీ?

యజమాని

కిక్కిసికర్రబూరా.

ఇల్లాలు

హనుమంతుడు గిర్రునపల్టీలు కొట్టినప్పుడు చేసేచప్పుడు?

యజమాని

రెండు చిటికిపోయిన పీటచెక్కలు.

ఇల్లాలు

ఆః విఘ్నేశ్వరునిబొమ్మ?

యజమాని

తోలుది.

ఇల్లాలు

సరస్వతి?

యజమాని

అదీని.

ఇల్లాలు

రాముడు? రావణుడు?

యజమాని

అన్నీని. అందుకే తోలుబొమ్మలాటని పిలవడం.

ఇల్లాలు

అయితే ఆఆడించేవాళ్లంతా వీధులంట తిరిగేవాళ్లే అంటారా? "ఓయి రావణా" అని పిలవడం, "పుత్ర=కొడుకులు, మిత్ర=స్నేహితులు, రథ=రథములు, భట=భటులు, బంధువర్గము" అని అర్థంచెప్పడం, "బ్రహ్మాత్మభూస్సురజ్యేష్ఠ పరమేష్ఠిపితామహాః ఇత్యమరః" అని అనడం, చౌషష్టివిద్యలు ఏకరుపెట్టడం, ఇంతవిద్వత్తూ వాళ్లదే నంటారా?

యజమాని

అంతే అనుకున్నావూ? పంపావరోసరము, రథారూఢుండెక్క, అనువృతుండు ఇలాంటివి కూడా వాళ్ళవేను.

ఇల్లాలు

నవ్వకండీ! తెలియక అడుగుతూవున్నాను. నాచెవుల్లోనుంచి యింకాపోలేదు అదీర్ఘంటీను కుంటూ వాళ్ళంతాకలిసి ఆతన్మయత్వంలో తాళం మద్దెల మూడోకాలంమీద వేస్తూ మైమఱచి——

యజమాని

మైమఱచి?

ఇల్లాలు

మైమఱచి మనలను మఱపించినపుడు మానవుడో కానొక తోలుబొమ్మ వెనుక దీపంవుంచి ఆవెలుతురును దానిమీద పడే ట్టుచేస్తూ ఆబొమ్మను చిన్నెలువన్నెలుగా ఆడిస్తూ ఆనందించేటప్పుడు, భగవంతుడు ఏవైపునా మనకుపైని, వెనుక, ముందు, సూర్యుడుమున్నగు జ్యోతిర్గోళాలను నిలిపి మనల నాడించడంలో ఎంతతన్మయుడై యుండాలంటారు? ఆభగవంతుణ్ణి మనం ఆనవాలు పట్టలేమనడంలో, మన క్కనబడడనడంలో ఆశ్చర్యములేదు.—వీళ్ళగపించినారా మనకు? చెప్పండి, వీళ్ళగపించినారా మనకు? చెప్పండి.—అదిల్లాతిరిగివస్తూంది. మంచి కోకఒకటిద్దాం.

యజమాని

నీయిష్టంవచ్చిందియ్యి.

ఇల్లాలు లోపలికివెళ్ళి ఒకకోకతీసికొని వచ్చి ఆబొమ్మలాటదాని కిచ్చి "రాత్రిఆడించిన బొమ్మ లేమైనా నీదగ్గఉన్నాయా? యిప్పుడు" అని అడిగింది, "ఏమైనా ఏంటండమ్మగారూ! పెద్దరాబణాసురుని బొమ్మేవుంది. ఇప్పుడే తెచ్చి చూపుతాను." అని వెళ్ళినది. అది ఆబొమ్మ తీసుకొనివచ్చేలోపుగా వంటలక్కవచ్చి "అమ్మగారింకా ముఖంకడుక్కోలే"దంది. ఇల్లాలు "ఉండవమ్మా! ఈరోజున తోలుబొమ్మలయొక్క సంగతి పూర్తిగా తెలుసుకోవాలి" అని అంటూ పెఱటిలోనికి పోయి కల్యకృత్యములు దీర్చుకొని తిరిగి వచ్చింది.

యజమాని ఆలోపున ఆతెబొయ్యేరావణా బమ్మబొమ్మ పగలెలావుంటుందో ఊహిస్తూ కూర్చుచున్నాడు. ఆబొమ్మొచ్చింది. ఇంటిల్లిపాదీమూగిచూచినారు. నగిషీబొమ్మయొక్క అందచందం, కీలుకీలుఅతుకు అతిచిత్రంగా కనిపించింది. చేతులు మేకతోలు. మొండెం దుప్పితోలు. ఆబొమ్మనలాగూర్చి తేజస్సులో పెట్టేసరికి ఎక్కడలేనిరంగుల రాణింపూ! చెప్పశక్యంకాకపోయింది.

ఉండియుండి తోలుబొమ్మలాడించిన దానికేసిచూస్తూ ఇల్లాలు అడిగింది! "నీవు రాత్రి ఆబరకంలోవున్నావా?" అని. "మీరు రాలేదండి మఱి" అంది ఆఆటకత్తె.

వాళ్లిద్దఱియొక్క అపరస్వరమహాసమస్యను అక్కడవున్న యజమానికాదుగదా ఎవ్వరూకూడా తీర్చలేకపోయినారు.

ఆటకత్తె తనదారిని తానుతిరిగి రావణా బొమ్మపుచ్చుకుని, ఇచ్చినకోకపుచ్చుకుని వెళ్ళిపోయింది. అది వెళ్లిపోయిన వెంటనే యజమాని ఇల్లాలుదిక్కై "బ్రహ్మాండంగా

రావణాబమ్మబొమ్మదాన్ని పనిగట్టుకు పట్టుకు రమ్మనమని, పట్టపగలు బొమ్మంతా పరిశీలించి తుదకాబొమ్మను గుఱించి ఒక్క ముక్కా అడక్కుండా నీవురాత్రి ఆబరికంలో వున్నావా? అని అటకత్తెను అడిగావేంటి. అదుండక మఱెవరుండి ఆడించేరు ఆబొమ్మల్ని అంతసొంపుగా" అన్నాడు. ఇల్లాలు అంది: "రావణాసురునిబొమ్మలో రాత్రిచూచిందాని కన్న ఇప్పుడు పగలు చూడ్డంలో నాకేమి వింత తట్టలేదు. కాని ఈభిక్షుకురాలు రాత్రి ఆబరకంలో వుండి ఆడించింది బొమ్మల్ని అంటే నాకింకను సందేహమే" అని—"అందుకే నీవు ఆటచూడ్డానికి రాలేదని అదీ అనుకుంటూంది" అన్నాడు యజమాని. "అవును కొన్ని సంగతులు మనం చూడగల్గినా, చూడక పోయినా మనం నమ్మాలి" అంది ఇల్లాలు.

"సంశయాత్మా వినశ్యతి" అన్నాడు యజమాని.

## వ్యాజాలాపము

శ్రీమతి యస్. టి. పి. కృష్ణవేణమ్మగారు

చెలువెసంగు సుధాబ్ధివీచికలనడుమ
నోలలాడెడు నొక్కవినీలమేఘ
శకలమును గంటి సకియరో! చాలతడవు
మరతునే దాని; నాదగు మానసమున.

ఆయనంతవిచిత్రితేలాబ్దశకల
మే, యొకప్పుడు విప్పున మించి; జగము
లొగులఁగారించి ఘర్మదినోష్ణమడఁగ
వృష్టినొసఁగూర్చు జంతుసంతుష్టిగాఁగ.

అతితరస్వేచ్ఛ నాత్మవాతావృతమయి
యిందునందును మెలఁగుచు నెందుఁదనదు
కందువఁగనఁగనీని యిక్కాలమేఘ
శకలచరితముఁదలపోయ సంబరమగు.

ధరణి నాదిత్యతీవ్రప్రతాపమడఁప
భిన్నయయ్యును శక్తిదీపింపనడరె
నెడియొ;యవ్వాసవోపల నీలనీల
నీరదసుసారము గణింప నెగడుముదము.

హంససంచయమానసహారికాంతి
కలితవిద్యుద్గణాల నాకాశవీథి
వెలిఁగి; మెలఁగిన తెరువులఁ దెలియనీక
నలరుఁగద యావినీలనవాంబుదంబు.

ఆర్తితాతుర చాతకాహ్లాదకారి
మృదుమధురగర్జచే ముదమిచ్చి;యమృత
కల్పసుఖజీవనంబిడు కమలధరము
నెంతనివచించి వర్ణింతు నే లతాంగి!

సూక్ష్మరూపాన నొకొక్కచో నెసంగి
విప్పుగల్గి యొకొక్కచో వెలసి; తనదు
నైజరూపంబు చూపక నలువుమిగులు
నీలజలధరచరితవర్ణింపఁదరమె?

ఒకట సర్జనభావంబు నొంది యొకటఁ
గృష్ణభావముఁజూపుచుఁ గెరలి; యెందు
దనదునైజము వివరింపఁదరముకాని
యనువున రహించునౌర యీయంబుదంబు.

రమణనొప్పు వినీలధారాధరంబుఁ
గాంచినెమ్మది నన్నియో కతలుపర్వ
తలఁచితలయూచి డెందానఁ దగులు నబ్బు
రంబుఁ దెల్పితి నీరీతి రాజవదన!

# రాజావారి ఎడమకన్ను

గొబ్బూరు వేంకటానంద రాఘవ రావు గారు బి. ఏ.,

పూర్వకాలమునం దొకదేశమును చంద్రసేనుడను రాజు పరిపాలించుచుండెను. అతడు తన సేవకులయందును భాగ్యవంతులయందును పక్షపాతముకలవాడై వారల మాటలే నిజములనినమ్మి వారు చెప్పినట్లే నడుచుకొనుచుండెడివాడు. ఆసంగతి కనిపెట్టి ఆదేశమునందలి ధనవంతులును, రాజ్యసేవకులును పేదలను బహువిధముల పీడింపజొచ్చిరి. శ్రీమంతులు తమపలుకుల కెదురాడ సాహసించిన పేదలపైని, సాధులపైని లేనిపోని నేరములుకల్పించి రాజునెదుట ఫిర్యాదులు చేయుటయు, వారలమాటలే సత్యములనిభావించి రాజు అమాయకులను అక్రమముగా దండించుచుండుటయు సంభవించుచుండెను. ఫిర్యాదువిచారణ చేయునప్పుడు రాజావారికుడి ప్రక్కను ఫిర్యాదియు ఎడమప్రక్క నేరస్థులును నిలుచుండుట ఆదర్బారులో పద్ధతియైయుండెను. ఎడమ ప్రక్కనిలుచుండి మొఱపెట్టుకొను పేదలమాటలుపాటింపక రాజుగారు వారిని క్రూరముగా దండించుచుండుటచేత ఎడమప్రక్కవారిపని పైసలైవదని ప్రజలనుకొని నిరుత్సాహులై దుఃఖించుచుండిరి.

ఆరాజ్యములో నొకయూర పెద్దకమతముగల రైతుగలడు. వానిపేరు గోవిందరాజు. వానికి ముగ్గురు కూతుండ్రుండిరి. పెద్దది లక్ష్మి. రెండవది దుర్గ. మూడవది భారతి. అందరిలో వయసునచిన్నదైనను విద్యాబుద్ధులయందు భారతి పెద్దదనియే చెప్పవలెను. తండ్రికి భారతియందు ఎక్కువముద్దు, గౌరవము కలవు.

గోవింద రాజొకనాడు కొన్ని పశువులను సంతకుతోలించుచు, కూతుండ్రనుపిలిపించి "అమ్మా! పశువులతో నేను పట్నంవెళ్ళుచున్నాను. మీకేమికావలెనో చెప్పండి తీసుకొనివస్తాను." అనెను. లక్ష్మి "నాయనా! నాకు కాళ్ళకు వెండిపట్టీలు- మన పొరుగుసీతమ్మ చేయించుకున్న పట్టీలవంటివి- కావలెను. మచ్చుచూపించెదను. ఉండు" మనిచెప్పి, వెంటనే పొరుగింటికివెళ్లి సీతమ్మపట్టీలు తెచ్చి చూపించెను. "సరే-లే-" అని గోవిందరాజు రెండవకూతురునుపిలిచి "అమ్మాయీ! దుర్గా! నీకేమికావలెను?" అనియడిగెను. "నాకు రాజేశ్వరి చేతులకున్న మోస్తరు గాజులజత తెచ్చిపెట్టుము" అని తక్షణమే దుర్గ తనస్నేహితురాలగు రాజేశ్వరియింటికి పోయి, ఆమెను పిలుచుకొనివచ్చి తనకుకావలసినగాజులెటువంటివో తండ్రికిచూపించెను. "సరే నీకు ఇటువంటిగాజులజత కొనితెచ్చెదనులే. తల్లీ! భారతీ! నీకేమికొనితెత్తునే?" అని గోవిందరాజు మూడవకూతు నడిగెను. "నాయనా! నాకు పట్టీలు, గాజులు, నగలు అక్కరలేదు. నాకుకావలసినది వేరేఒకటియున్నది. అది తెచ్చుట చాలకష్టము. ప్రమాదముకూడను. అందువల్ల మీకు చాలాబాధలుకూడ కలుగవచ్చును. కనుక మీతో చెప్పుటకు సందేహించుచున్నాను" అని భారతి ప్రత్యుత్తరమిచ్చెను. "తల్లీ! నీవెప్పుడును నాకిదికావలె, అది కావలె-అనినన్ను పీడించుదానవుకావు. కన్నతండ్రిని, నాదగ్గర సంశయ మేలనమ్మా? ఏమిప్రమాదించినను, ఏమి బాధలు కలిగినను నేను లక్ష్యముచేయను. అవసరమైనయెడల నాప్రాణమిచ్చి నీయభీష్టము తీర్చెదను. సంశయింపకు. చెప్పు" మని తండ్రి ఆమెను ప్రోత్సాహించెను.

"అలాగైతే, నాన్నగారూ! మీరు తక్కినపశువులను మీయిష్టమువచ్చినట్టు అమ్ముకోండి. కాని దోరపెయ్యనుమాత్రం డబ్బుకుఅమ్మకండి. ఏమియిమ్మన్నావు ఈపెయ్యకు? అని ఎవరైనా అడిగితే నేను డబ్బుకు అమ్మను. మనరాజావారి ఎడమకన్ను ఎవరుతెస్తే వాళ్ళకీదోరపెయ్యనమ్ముతాను. లేకపోతే అమ్మను అని ఖండితంగా చెప్పండి. అందునుగురించి ఎవరివల్లనైనా ఏమైనా చిక్కువస్తే తక్షణం నాకు కబురు పంపండి. నేనువచ్చి సర్దుకుంటాను." అని చెప్పినది భారతి. ముద్దులకూతురు కీవింతకోరిక కోరినందుకు గోవింద

రాజు మిక్కిలి యక్కజపడెను. కాని భారతి చాలబుద్ధిమంతురాలు. ఏచిక్కులువచ్చినను క్షణములో విడ దీయుగల సామర్థ్యము ఆబాలికకడ లేకపోలేదు. చూత మీ చిత్రమేమోయని తండ్రిఅందు కంగీకరించి యిల్లు బయలుదేరెను.

పట్టణము చేరినతరువాత సంతలో నాతడు గోరావునుతప్ప తక్కినపశువులనన్నింటిని అమ్మివేసెను. తరువాత పెద్దకూతురుకోరిన వెండిపట్టీలను, చిన్నకూతురుకోరిన బంగారుగాజులుకొని యింటికిపంపించెను. పిమ్మట గోరావును సంతలోపెట్టి శ్రీరాజావారిఎడమకన్నిచ్చి యీగోరావును కొనవచ్చు నని బహిరంగముగా ప్రకటింపజొచ్చెను.

"డబ్బో, గింజలో కోరక రాజావారియొక్కమకన్ను కావలెనంటా డీగోరపెయ్యకు-ఇదేమి? వీనికి పిచ్చిరేగి త్తినదా?" అని క్రోత లబ్బురపడుచుండిరి. ఈద కీవృత్తాంతము రాజభటుల చెవినోకినది. వారు పరుగునవచ్చి గోవిందరాజునుపట్టుకొని-"అరే- ధడవా? నీకు రాజావారిఎడమకన్ను కావాలా? వెన్నుబద్దలు కావాలా? పదపద. నీరోగము చప్పగాకుదురుతుంది" అని రెక్కలువిరిచికట్టి గెంటుచు రాజసముఖమున కీడ్చుకొనిపోయి, ఎదుటపెట్టి "మహాప్రభూ! వీడు మనపట్టణములో పశువుల సంతకు ఒకగొడ్డావును తోలుకొనివచ్చినాడు. డబ్బుకు అమ్మడట! ఏలినవారి యెడమకన్ను తెచ్చినవారికి వీడాదోరపెయ్యనమ్మతాడట. ఇంతపొగరెక్కియున్నాడు. ఈరాజద్రోహి నేమిచేయుమని సెలవు?" అని యడిగిరి.

"మహాప్రభూ! నేను రాజద్రోహినిగాను, నాఅంతటనేనై యీలాగున చెప్పలేదు. నాకు ముగ్గురు ఆడపిల్లలు. కడసారపుది భారతి. మంచి తెలివితేటలుకలది. అదే యీదోరపెయ్యను ఏలినవారి ఎడమకంటికమ్మకొమ్మని నన్నుకోరినది. దాని అభిప్రాయమేమో నాకును తెలియదు. ఏచిక్కులువచ్చినను వెంటనే కబురంపినయెడల తానువచ్చి విప్పుదునని చెప్పినది. ఆపిల్లమాట చెల్లించుటకే నేనీలాగుచేసినాను. అంతయు స్పష్టముకాగలదు. వెంటనే మాభారతిని రప్పింపు"డని గోవిందరాజు ఏలినవారితో సవినయముగా మనవిచేసికొనెను.

ఈసంగతి యేమో తెలుసుకొందమని రాజావారు కొందరంతఃపురపరిచారికలతో రాజభటులను, పల్లకిబోయీలను గోవిందరాజు నింటికిపంపి భారతిని తక్షణము కొనితెమ్మనిరి.

౨

వచ్చినదిభారతి - సాక్షాద్భారతివలె - రాజసభకు - చూచినాడామెను పరికించి - చంద్రసేనుడు - "శీ ! ఈబాలిక నాఎడమకంటికి తనయింటి గొడ్డావుకు సమపెట్ట సాహసించినది." అని రాజాగ్రహపరవశుడై, "ఏమే పిల్లా! నీకన్ను లింతపొరలుగ్రమ్మినవా? యీగొడ్డావునకు నాయెడమకన్ను సమజేసి సంతలో పెట్టించితివా? ఏమిసంగతి? చెప్పు"మని గద్దించియడిగెను. భారతి సవినయముగా "మహాప్రభూ! నాకను లేమి పొరలుగ్రమ్మలేదు. ఈవింతసంగతివిని ఏలినవారు నన్ను తమసముఖమునకు తప్పకపిలిపింతురనియు, ఈవిధముగా నాకు రాజదర్శనలాభము కలుగుననియును ఊహించియే మాతండ్రినట్లుకోరితిని."

రాజు:—నాదర్శనము నీకేల?

భారతి:—మహాప్రభూ! మీకును, మీ రాజ్యమునకును, మీప్రజలకును మిక్కిలి యావశ్యకమును, అత్యంత క్షేమకారియునైన హితవొకటి వెంటనే మనవి చేయవలసియున్నది. అది తమదర్శనము చేసుకొని నేను స్వయముగా చేయవలసినమనవి. ఆయవకాశము లభింపచేసుకొనుటకు నేను మాతండ్రి నిందుకు నియమించినాను.

రాజు:—ఏమిటామనవి?

భారతి:—మహాప్రభూ! చెప్పుచున్నాను. చిత్తగింపుడు. సత్యముగనుక నిర్భయముగా మనవిచేయుచున్నాను. మీరాజ్యములో శ్రీమంతులు, ధనవంతులు, మీసేవకులు ఆడినదాట, పాడినదిపాట. వారిమాటలు వేదవాక్కులు. వారేమిచెప్పిన నదేనిజమని తమరునమ్ముచున్నారు. పేదలగోల వినరు. వాండ్ర దురవస్థ చూడరు. మీకుడిప్రైపున నిలిచినవారిమీదనే మీదృష్టి. ఎడమప్రైపున నిలిచినవారిగతి కనిపెట్టరు. మీఎడమకన్నుండియు లేనట్లయినది. మాపసువులలో నొకావుగొడ్డుది. నిరర్థకములైన యీరెంటిని సమపెట్టుట ధర్మమనిమాగొడ్డావుకు మీయెడమకంటినిమ్మంటిని.

ఎత్తిపొడిచి నిజముచెప్పినది భారతి. కోపమతిశయించినది రాజునకు. సత్యంపరంధీమహి. నిర్భయముగ నిజముపలికి చలింపక నిలిచిన యీబాలికసాధురూపము రాజును కలవరపెట్టజొచ్చెను. నిశ్చేష్టుడైప్రభుడు కొంతతడవూరకుండవలసివచ్చెను. పిదప మంత్రితో మంతనముచేసి కొంటెప్రశ్నలుకొన్ని వేసి ఆమెను భంగపుచ్చదలచి క్రమ్మఱ రాజిట్లనియె: "బాలికా! నీతెలివితేటలెట్టివో పరీక్షించి నీసంగతి తెలిసికోవలెను. నిన్ను మేము కొన్ని ప్రశ్నలడుగదలచినాము. నీవుసరిగా ప్రత్యుత్తరములిచ్చినసరి లేకున్న నిన్ను క్రూరముగా దండింతుము. ముందుగా ఆకాశముమీదనున్న నక్షత్రములసంఖ్య ఎంతో సరిగా చెప్పుము".

భారతి:—మహాప్రభూ! మనపట్టణసముద్రతీరమున నిసుకరేణువులెన్నిగలవో సరిగా అన్నినక్షత్రములే ఆకాశముననున్నవి.

రాజు:—ఎవరు ఎక్కువమందియున్నారు? చచ్చినవాళ్లా? బ్రతికియున్నవాళ్లా?

భారతి:—మహాప్రభూ! బ్రతికున్నవాళ్లే ఎక్కువమంది - చచ్చినవాళ్లు ఉండనేఉండరు. ఉండేవాళ్లయితే వాళ్ళు చచ్చినవాళ్ళలో జమకానేరరు.

రాజు:—ఈభూమికి మధ్యనేమున్నది?

భారతి:—తమరాజ్యము - తమపట్టణము. తమకోట-తమసభ - తక్కినవన్నియు తమచుట్టునున్నవి.

రాజు:—మారాజ్యము అందుగల చరస్థిరరూపకమయిన యాస్తి సరిగా ఎంతవెలచేయును?

భారతి:—ఈప్రశ్నకు సరిగా జవాబు చెప్పుదును కాని ముందుగా తమరొకఖరారుచేయవలెను. మూడు రోజులు తమరు నేను చెప్పినట్లునడుచుకోవలెను. అందుకు మీరంగీకరించినపక్షమున మీప్రశ్నకు సదుత్తరమువచ్చును.

రాజు:—ఈలోపుగా మాఖజానాలెక్కలు, కోటలు, పేటలు, భూములు కిమ్మతుకట్టించి కూడిచెప్పదువు కాబోలు?

భారతి:—లేదు-లేదు-మీఖజానాలు, కోటలు, పేటలు, భూములు, బుట్టలు, లెక్కలు నాకేమక్కరలేదు- మీ ఉద్యోగస్థులు నాదగ్గరకు రానక్కరలేదు. నేను వారెవరితో మాటలాడుదానను గాను.

రాజు మరియు నక్కజపడజొచ్చెను. "ఎవరితో మాటలాడక, లెక్కలుగట్టక యీకొమరాలు నా రాజ్యపువిలువ తెల్పునట! దీనిసంగతియంతయు బహువిచిత్రముగానున్నది-కానిమ్ము. చూతము" అనుకొని, "సరే- నేను మూడురోజులు నీవుచెప్పినట్లే నడుచుకొందును. నీవిచట నేయుండుము." అనెను.

భారతి:—చిత్తము-మహాప్రభూ! నేనట్లేయుండెదను. తమరుమాత్రము సత్యముతప్పక నేడును, రేపును- ఏమియు తినకూడదు. మంచినీళ్లయిన త్రాగకూడదు. శుష్కోపవాసముండవలెను. ఎల్లుండి ఉదయము సమస్తము తమకు స్పష్టముకాగలదు.

## 3

భారతితో చేసిన ఖరారు తప్పకుండ రాజు రెండుపవాసములుచేసెను. భారతి రాజాంతఃపురమునందే నివసించియుండెను. మంత్రిసామంతాదులెవరును భారతితోగాని రాజుగారితోగాని ప్రసంగింపలేదు.

మూడవనాఁడు తెల్లవారినది. రాజునకు స్వరము హీనమయ్యెను. నీరసము భరింపరాకుండెను. కనులును, శరీరమును మండుచున్నట్లుండెను. ఆకలి దహించుకొని పోవుచుండెను. దాహముచే నోరెండిపోవుచుండెను. క్షుత్పిపాస లెంతదారుణముగా క్రూరముగా మనుజులను పీడించునో స్వానుభవముచే రాజునకు లెస్సగా బోధపడెను. భారతి ఉదయము తొమ్మిదిగంటలకు రాజుగారికి వంటచేయించి, పీటవేయించి బంగారుకంచములో పట్టెడన్నము పెట్టించి, చెంబునిండనీళ్లుపోయించెను. అపుడు ప్రభుని భోజనమునకు వేంచేయుమనెను. "బ్రతుకు జీవుడా" అనుకొని రాజు పీటమీదకువచ్చెను. భారతి "ఆగు" మనెను. రాజుగుండెలలో రాయిపడెను. ఇది మరేమితంటా తెచ్చిపెట్టుచున్నదోయని రాజుభయపడెను. అపుడు భారతి "మహాప్రభూ! తమరాజ్యము వెలయెంతో మనవిచేయుమని నాకాజ్ఞాపించినారు. మీరాజ్యమంతయు నిపుడీపట్టెడన్నమునకు, ఈచెంబెడు నీళ్ళకు సరికాదు- ఇంతకుతక్కువేనని నేనుచెప్పుచున్నాను. ఏమందురు?" అని ప్రశ్నించెను.

రాజు "నాప్రాణము లెగిరిపోవుచున్నవి. నీవుచెప్పినట్లు నారాజ్యమంతయు నిపుడీయన్నము నీళ్లపాటి చేయదు. ఇందుకదంతయు తీసికట్టే-తక్కువ-చాలతక్కువ-ముమ్మాటికితక్కువ. ఇకనైననన్ను మెతుకులుతిన నిచ్చి యీనీళ్ళుత్రాగి పడియుండనిమ్ము" అనుచు భోజనమారంభించి, ఆయన్నముతిని నీళ్ళుత్రాగి యున్న తనుచు విశ్రమించిలేచెను.

అపు డాతడు భారతినిపిలిపించి సగౌరవముగా నిట్లనియెను: "అమ్మా! భారతీ! నారాజ్యములో నాలోపముచే జరుగుచున్న అధర్మవ్యాప్తియు, అందువలన ప్రజలలో పెరుగుచున్న అశాంతిని నాకు స్ఫుటముగా గోచరింపచేసితివి. అధోగతి పాలుకాకుండ నన్నును, నాశనముకాకుండ నారాజ్యమును కాపాడి రక్షించితివి. కనులుండియు గ్రుడ్డివాడనై రాజధర్మచ్యుతుడనై యున్న నన్ను, ద్యుమత్సేనుని సావిత్రివలె సముద్ధరించి పుణ్యముకట్టుకొంటివి. నీవు నాకు ధర్మోపదేశముచేయవచ్చిన పరదేవతవని భావించుచున్నాను. నీవు నాకు కోడలివై రాజ్యక్రమమునడుపుము. ధర్మహానిగాకుండ కాపాడుము. ప్రజలసంతోషమే రాజ్యమునకు పునాది-ప్రజాతుష్టి బడయనిరాజ్యము త్వరలో భగ్నమైపోవును. నారాజ్యములో ప్రజాసామాన్యమునకు కలుగుచున్న పీడ నీవుసాహసించి చమత్కారముగా నాకు తెలిపి మహోపకారము చేసినందుకు నీబుద్ధివిశేషము కొనియాడుచు ఎంతో కృతజ్ఞుడనైయుండెదను."

పిమ్మట చంద్రసేనుడు భారతిని తనకుమారునికి వివాహముచేసి, ఆమెసాయముగొనుచు ధర్మగ్లాని కాకుండ ప్రజాహితముగ రాజ్యపరిపాలనముచేసెను. పల్లెటూరిలో పేదరైతు కూతురై పుట్టినభారతి బుద్ధిబలముచే రాజాహ్వానముబడసి, సత్యమునాశ్రయించి, రాజ్యధ్వంసముగావింపనున్న యధర్మమును వశింపజేసి మహారాజుకోడలైనది. "క్రియాసిద్ధి స్సత్వేభవతి మహతాంనోపకరణే." మహాత్ములైనవారు అవసరమైన సాధనసంపత్తిలేకున్నను ప్రజ్ఞచేతను, బుద్ధిబలముచేతను సమస్తమునుసాధించి కార్యసాఫల్యముపొందుదురు.

# రాధారాధనము

పండిత ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు

అలమందలు జెవులెత్తి యాలకింప
మైమఱచిగోపకులమెల్ల మసలుచుండ
మోళ్ళుచివురించి యంతట మొగ్గలీన
నాకసంబునఁ జనుపక్షు లట్లనిలువ
హర్షపులకితగాత్రులై యమరులెల్ల
"నమృతమానాఁడు విషముతో నమరెమనకు
నేఁటియమృతంబె స్వచ్ఛమై నిక్కమైన"
దనుచుఁ దనివోనిమనముల నారగింప
రాలుగరుగంగ లోకముల్ రంజిలంగఁ
బూతకాళిందికాతీరపుణ్యభూమి
శ్యామలతమాలపాదపచ్ఛాయలందు
ముంగురులుఫాలతలమును మూసివె వఁ

గాళ్ళగజ్జెలఘులుఘుల్లుఘుల్లురనఁగఁ
జిఱుతగంటలుమొలనూటఁ జెలఁగుచుండఁ
గంఠహారములల్లాడఁ గమలసదృశ
నేత్రములు నీటుగుల్కంగ, నెమలిపించె
మమరశిరమున, మృదుమందహాస మొలుక
విద్రుమోష్ఠఫలంబున వేణువునిడి
చిత్రతరలీల సంగతుల్ చేర్చుకొనుచు
బాలగోపాలమూర్తివై పాదములతో
తాళములవేయుచును మది దమకమలరఁ
గలకలస్వనమాధుర్యగరిమతోడ
నాఁడు మ్రోయించినట్టుల నేఁడు కరుణ
మురళి మ్రోయింపఁగదవోయి! ముద్దుకృష్ణ!
నందనందన! నీమీద నాటియున్న
నామనసు నెట్లు పెడదారి నడుపఁగలను?
వరుసఁబిడుగులురాలఁబో వారివాహ
జలము నేకోరికోనుఁగాదె చాతకంబు?
దేవ! నీముఖచంద్రచంద్రికలు మంద
హాసములెగాఁగ నేనాఁడు నాస్వఁగ్రోలఁ
గను జకోరిని నాకిమ్ము కరవుదీర
వాగమృతధారలెన్నొ నవ్వారిగాఁగ
హృదయపీఠంబునను నిన్ను బదిలపరచి
ప్రేమకుసుమాంజలుల వేడి ప్రీతిగలుగఁ
బ్రణయమాధుర్యగీతికల్ పాడిపాడి
విసివివేసారితిఁగదయ్య వేణులోల!
రాజితాకార! నీమధురాధరమ్ము
పూర్ణముగనాని నిరతంబు భోగమొందు
మురళి జేసిన ప్రాక్తనపుణ్యమేమొ
తెల్పగదె? నేను వేణునై పొల్పుఁగందు.
మోహనాకార! కృష్ణ! నీ ముద్దుమోము
గనఁగఁజాలనిదినము దుర్దినముసుమ్ము
తనివివో నీదువాగమృతంబుగోనని
నాఁకు బూర్ణోపవాసంబు నాథ! మాకు.
సత్కళాకావ్యసంధానచతురుఁడైన
కవిని నేనైన నీపుణ్యకవితజదివి
మనసుగరిగించి నీదయ మనుచునతను
నిన్ను నెడబాయకుందుఁగా నిర్మలాత్మ!
అరయఁ గర్తవ్యతామూఢనైన నాకు
కృష్ణ! నీదివ్యమంగళాంగియవిమల
సుఖమొకటికన్న వేఱొద్ది చూడలేదు
నాదుసర్వస్వమును నీవె నల్లనయ్య!
మునుఁగుచున్నాఁడు పశ్చిమాంబునిధి నినుఁడు
శ్యామలంబగు గగనమాశాలితోడఁ
గనుసడలు నాకు సందెచీకటులయందు
తోడురావోయి వ్రేపల్లె వీడుజేర
రాధహృదయంబు నీయది రాధ నీది
కాదనక రమ్ము కరుణతోఁ గమలనయన!
ఈతమాలంపుఛాయల నేమొభయము
భయము నున్న దేమొకో— ఈపాడుజన్మ
ఏది చూపుము నీరూప మెచటనుంటి?
వేమనెద? వెంతఁజెప్పిన నెరుగలేవె?
ఏల యీలీల గుణజాల! జాలమేల?
మేల? రావేల?గోపాల! బాలకృష్ణ!

(సాక్షాత్కరించి కృష్ణభగవానుఁడు)

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణంవ్రజ

(అనుగ్రహింపఁబడిన రాధ)

దేవ! భవదీయదర్శన హావభావ
వీక్షణంబులధన్యనై వేడుదాన
ననవరతమిట్లె యెడబాటు నరయరాని
శాశ్వతానందమొసగూర్పు శాంతరూప!

(శ్రీకృష్ణుఁడు)

అహంత్వాంసర్వపాపేభ్యో మోక్షయిష్యామి
మాశుచ.

# ప్రేమ బలి

శ్రీమతి బి. లలితాంబగారు

నిశ్శబ్దము. ఒకవ్యక్తి. అతని నివసన మొకయున్నతసౌధమున. తరంగకల కలస్వనంబున నొకస్వచ్ఛజలపూరితంబగు వాహిని ప్రవహించుచుండెను. నాఁడు కృష్ణచతుర్థి. భూనభోంతరంబులు తిమిరావృతమైయున్నవి. వెలువలనేమిగలదో గుర్తించుట కష్టసాధ్యంబుగనుండెను. అశుభశూచకంబులగు దివాంధవితతులయు, సృగాలంబులయు కూతలు భయమాపాదించుచుండెను. వ్యక్తి మోమెత్తి దృష్టిసారించెను. "ప్రియా!" యనియొకు మృదుమధురసంబోధనంబు వినియెను. "హా! కమలా! ప్రణయమూర్తీ! నన్నుఁబాసిపోయితివా!" యని వ్యక్తి విలపించెను. ఎదుట నొకఛాయగోచరించెను. "నీయండనుండుట కెంతయు నభిలషించితిని. కాని దైవము కట్టడికదా! అకాలమృత్యువువాతఁ బడితివని విని వియోగసంతాపంబెడతెగనిదిగా నిశ్చయించి—నాథా! నినుఁజేర నుసురుఁబాసితి —క్షమింపుము." పురుషుని కను లరుణపద్మంబులాయెను. బాష్పవారి యవ్వారిగఁ బ్రవహించుచుండెను. "—ప్రాణాధికా! నీబాహువల్లరులఁజేర్చి కమలా! మనము మోదమతులము. ప్రేమమూర్తులము. సుఖస్వరూపులము. అనియింపుగుల్కఁ బలికితివిగా. అట్టికపురంపుపలుకులఁబోలు పలుకుల నే విను శుభదినంబులెన్నడేనియే తెంచునా? అలనాఁడు చంద్రకాంతశిలావేదికయందుపవిష్టులమైయుండ, మేఘమధ్యస్థంబగు నింబుజాబిల్లింజూచి ప్రియా! నీవదనబింబ మెదుర్కొనఁజాలకఁ జూడు మాతఁడుపాకరుం డెటుల దాగిలిమూలలాడుచుండెనో యని దరస్మితాననుండవై నుడివిన యానుడువు లెన్నడైన నేనికవిందునా? అప్రఫుల్లవదనసరోజ మెప్పుడైనఁ గరువుదీఱఁగందునా! జీవితేశ్వరా! మధురతరమని యధరమును, నిర్మలమగు నునుపుటద్దంబులని చెక్కుళ్లను మోంచి ముద్దులఁ గురిపించుచుండెడివాడవు. అట్టివి నేడెట్టులవసివాడి, కృశించియున్నవియో గాంచుము. నీప్రణయబహుమానము లవనిలోదిగనాడి, మానితాంబర మొంటుదాలిచి నీనామమంత్రంబు జపియించుచు నాయుసురుల నీనది కర్పించితి......క్షమింపుము...నాకో అకు...విచారమొందకు?...నాథా!. సెలవు..." పురుషుఁడు ఛాయనుఁబట్టఁ గమకించెను. కరములుసాచెను...విఫలుఁడాయెను. అనిర్వాచ్యంబగు దివ్యతేజంబొందు విమలనదీతరంగంబులపై రాఁగల్లుచుండెను. అందు పురుషునితేజంబు లీనమాయెను. ఆదివ్యజ్యోతి కమలాపునివెలుంగున నైక్యమాయెను.

# ఎడఁబాటు



వెఱ్ఱియాసలఁదీరని ప్రేమతృష్ణ
మాటిమాటికిఁ దలుపులమాటునందు
వినువులేక యలసిపోక వెలితిచూపు
లేలచూచెద వోకుమారీలలామ!

చక్కఁబెట్టని యీయింటిచక్కఁదనము
చిక్కిపోయిన దీనాఁడు చిట్టితల్లి!
ఏలపరుగిడెదిటునటు ధూళిలోన?
ఏలపరుగిడు నీ చంచలేక్షణములు?

చెలువుగాఁదీరుగా విరచించినట్టి
రంగవల్లికలే కానరావు నేఁడు;
అమనోజ్ఞశృంగారమే, అక్రమమ్మె,
అకళయె, పాసినది యీగృహమ్మునేఁడు.

ప్రేమమైనీరములువోసి పెంచినట్టి
తల్లి నెడఁబాసి విరహబాధావశమున
మల్లెతీవియు లల్లవే తెల్లఁబోయి
చూచుచున్నవి జాలిగాఁ జూడుమమ్మ!

అక్కయక్కా! యటన్న నీయందరాని
పిలుపులో, మూఁగకన్నుల పలుకరింత
లో వినంబడుచున్నది నీవియోగ
వేదనాగీతి నామనోవీథియందు.

మూఁగభావాలుకదలునో, రాగరసము
చిప్పిలునొ, నూతనవియోగచిహ్నితమ్ము
లైన నీతెలిగన్నుల యంచులందు;
నేకరణినోర్తు నీవ్యథ నాకుమారి!

చెదరిపోయిన తావకచికురజాల
మకట! సంస్కారశూన్యమై యమరునేఁడు;
నీటుగాదిద్దు కాటుకనీలిపూఁత
కొరఁతపడినది నీ కనుఁగోనలందు.

నీదు నయనాంచలములందు, నీదు కావి
మోవితుదలందు, నవ్వులపోలుపేలేదు;
ఆటలే, పాటలే, తీయనైన ముద్దు
మాటలే యింకలేవు కుమారి! నీకు.

ఎంతయాకలిఁగొన్నవో యిపుడు నీక
పోలపాళిక లామోవిముద్దుకొరకు;
ఎంతతపియించుచున్నవో యిపుడు నీదు
మృదుకరమ్ము లామెడకౌఁగిలింతకొరకు.

నిన్నరాతిరి యేమేమొ నిదురలోనఁ
గలఁతనెంది, కలలుగాంచి, కలవరించి
పలవరించితి వెడఁద సంభ్రమమునొంద
అక్కయక్కా! యటంచు నాయనుఁగుబిడ్డ!

అకసమ్మునఁ దారకాలోకమునకుఁ
బోయినదినాఁడు నీతల్లి, ముద్దుతల్లి!
అదిమొదలునిన్ను లాలించు నక్కకూడ
పయనమైపోయె నూతనావాసమునకు.

ఆగృహజ్యోతి యాసాధ్వి యరిగినపుడె
శిథిలరాగము, మామకజీవితము, ద
రిద్రమైనది; నీదైన్యవృత్తి పూర్వ
శోకమురగిల్చి కనుల కశ్రువులుదెచ్చు.

అత్తవారింటికరిగిన యాకుమారి
తనదుముద్దులచెల్లెలి ననుఁగుఁదండ్రి
వదలినది, వేఁడినిశ్వాసవాయువట్లు,
కన్నుగవనుండి బాష్పాంబుకణములట్లు.

వెఱ్ఱియాసలఁ, దీరని ప్రేమతృష్ణ,
మైమరపునెంది హృదయసంభ్రమముతోడ
నేలపరుగిడి వెదకెదు మూలలందు?
ఏలపరుగిడు నీచంచలేక్షణములు?

# పుట్టింటికిప్రయాణము

శ్రీమతి సువర్ల లక్ష్మీనరసమాంబగారు

౧

గంటలులెక్కించుకుంటూకూర్చుందిగంగాభాయి. పదకొండుకొట్టింది ఘడియారం. గుమ్మంవద్ద గుఱ్ఱపుబండీ ఆగింది. బండిలోనుంచి దిగే భర్తకెదురుగా వెళ్ళిందిగంగ. సుబ్బారావు చెల్లెలని అత్తవారింట దిగబెట్టివస్తున్నాడు. 'ఇంతప్రొద్దెక్కిందే మీరైలు లేటైందాయేమిటి?' అన్నదిగంగ-మరేమంటూకూర్చున్నాడు. 'లెండి. స్నానంచెయ్యండి. భోజనంచేదాము' అందిగంగ-ఇద్దరూ భోజనంచేశారు. మంచంమీదపండుకుని గృహలక్ష్మిచూస్తున్నాడు. గంగ తమలపాకులుచీల్చుతోంది. "ఏమండీ! మిమ్మల్ని ఒక్కటిఅడుగుతాను యేమీఅనరుగదా." అంది- "మంచిసంగతైతే యేమీఅనను అడుగు"అన్నాడు- "మంచిచెడ్డలకి మరేమీలేదులెండి మానాన్న యీ దసరాపండుక్కి మనల్నిద్దరినీరమ్మని వుత్తరం వ్రాశాడు."

"ఓహో తెలిసింది. ఎప్పుడూఆడవాళ్ళకి పుట్టింటి గోలే. ఇపుడు వెడతానంటావేమిటి? ఏదీవుత్తరం?"

తీసియిచ్చి "మనంవస్తామంటే బయలుదేరివస్తానని వ్రాశారు. మీకు శెలవులున్నాయ్గ?"

"అచ్చే అదన్నాళ్లు. పదిహేనురోజులేకదూ. గిఱ్ఱున తిరిగివస్తాయి. శెలవల్లో హాయిగాయింటిపట్టున వుండకుండా వూళ్ళమ్మటతిరగడంయేమిటీ?"

"అక్కడ మీరేమన్నా కష్టపడతారా యేమిటి? మీస్వంతయిల్లులాగేవుంటుంది. శ్వశురగృహం పరమ సుఖం అన్నారు. మీకేంలోటూ?"

"మాటలు బాగానేర్చావ్. నా స్వంతయిల్లులా యేలావుంటుంది? ఇంతకీ నీకు వెళ్లాలనివుంది. నీవు వెళ్లుపోనీ."

"సరే: నేనూ మీరూ వెడితే సర్దాగావుంటుంది. నేనువెడితే మీకు భోజనం?"

"నాభోజనానికేమిలే, నీవంతపట్టుదలగా వెళ్లాలంటేవెళ్లు మీనాన్నవస్తే."

ఆమాటఅంటే గంగ చాలాసంతోషపడింది. నిజంగా వెళ్లమన్నాడనుకుంది. "చూశారూ మీకు తోచంవస్తుందని అడగలేదుగాని యెన్నాళ్లనుంచో చూడాలని వుందండీమావాళ్లని, ఏడాదైందిచూచి. మాచెల్లెలుకూడా యిక్కడేవుందిట, మీరుకూడావస్తే మరీసంతోషిస్తారు మావాళ్లు. స్కూలుమేష్టర్లకి పదిహేనురోజులేనా శెలవలు? వీలుంటే రండి మళ్లీ యెన్నాళ్లకో వెళ్లటం."

"ఆలోచిద్దాంలే"అంటూలేచి వీధిలోనికెళ్లి వస్తానని వెళ్లేడు-గంగాభాయికి యేమీతోచటంలేదు - ఆమెకి తత్ క్షణమందే పుట్టినింటికి వెళ్లవలెనని ఆశగలిగింది. తల్లి, సోదరీలు, చిన్ననాటినెచ్చెలులూ, బొమ్మలకొలువు అన్నీ జ్ఞాపకంవచ్చాయి. ఎప్పుడు అక్కడికి వెళ్లి వాలుదామాఅనిపించింది - డ్రాయరుతీసి, పెన్సలుపుచ్చుకుని కార్డుతీసి "తక్షణంరావలెను. పంపుతారట" అనివ్రాసింది తండ్రికి-సగం ఆందోళన మణిగింది ఆమెకి.

౨

గోపాలంగారికి చాలాకాలంవరకూ సంతానంలేక పోతే కాశీ మొదలైన యాత్రలువెళ్లి అనేకనదులలో స్నానాలు చెయ్యగా పుట్టింది గంగ - తర్వాతమరి యిద్దరు పిల్లలుపుట్టేరు-వారికి యమున, సరస్వతి అని పెట్టేరుపేర్లు-గంగ, యమున, సరస్వతి-అని ముగ్గురుకి పెట్టేరు-గోపాలంగారు మర్యాదగల కుటుంబీకుడు. దసరాకి పెద్దఅల్లుని కూతురుని తీసుకువెడదామని వచ్చారు.

"గంగా? మీనాన్నగారొచ్చారు."

గంగాభాయి యీమాటవింటూనే, మొఖంకడుక్కుంటూన్న మనిషి, తుడుచుకోకుండానే చెంబులో నీళ్లుపట్టుకొచ్చింది. "వచ్చేరూ? కాళ్లుకడుక్కోండి. అమ్మా చెల్లెళ్లూ క్షేమమేనా?" అంది.

"ఆ, క్షేమమేనమ్మా. నిన్నూ బావనీ చూడాలని కావలసినంత కంగారుచేస్తున్నారు-చెల్లెళ్లు."

గంగ త్వరగా కాఫీతయారుచేసుకొచ్చింది-అంతా కలిసి పుచ్చుకున్నారు. కుమార్తెగారింట్లో గోపాలం గారికి మర్యాద యెక్కువగాజరిగింది. పులిహోర, ఆవడలు మొదలైన పిండివంటలుకూడా చేసింది గంగ.

అంతా సర్దాగా భోజనం చేశారు-మధ్యాహ్నం అయింది- సుబ్బారావు గంగను పిలచి "ఇదిగో మీ నాన్న వచ్చారు. నాకు తీరుబడి లేదుకదా వెళ్లటానికి-నీవు మాత్రమెట్లా వెడతావు? యీసారి మేమిద్దరం కలిసి వస్తామని చెప్పు" అన్నాడు.

"మళ్లీ యిల్లా అంటున్నారేమిటండీ. పోనీ వెళ్లొద్దాం రారాదండీ! నాల్గురోజులుండి వద్దాం."

"ఏమో నాకిష్టంలేదు. నీయిష్టం తర్వాత."

"మీరు పంపుతానన్నారుగదా అని మా నాన్నకి ప్రత్యుత్తరం వ్రాశాను. తీరావచ్చినతర్వాత పంపనంటా రేమిటండీ."

"వస్తేమాత్రమేమీ? చూచివెళతారు. నిన్ను యిక్కడ చూచారుగదా! యింకెందుకు నీవు వెళ్లటం?"

"అయ్యో! అదేమండీ అల్లాఅంటారు? మా చెల్లెళ్లు, అమ్మ అంతా నన్ను చూడాలని అంటున్నారట పాపము."

"మీ చెల్లెళ్లని అమ్మని యిక్కడికే తీసుకురమ్మని చెప్పు. పండుగ సర్దాగా ఇక్కడే చేసుకుందాం."

"పోనీ లెండి. పంపుతారని యెంతో సర్దాపడ్డాను- పంపరూ? పదిరోజులుండి వస్తాను."

"నాకు యిష్టంలేదు-నీకిష్టమైతే వెళ్లు. మీ నాన్నతోటి యిట్లాఅన్నట్లు చెప్పకుసుమీ, రమ్మంటే యిప్పుడు వచ్చేటందుకు వీల్లేదని చెప్పు."

"అయితే యెందుకు వ్రాశావు అని అడుగుతాడు, అప్పుడేమననూ? మీరే పంపనని చెప్పండి. అదిగో మా నాన్న వస్తున్నారు. ఏమి చెపుతారో చెప్పండి."

గోపాలంగారు "అమ్మాయీ!" అని పిల్చేరు.

"లోపలికి. రా నాన్నా!" అంటూ తండ్రికి ఎదురుగా వెళ్లింది గంగ.

"రండి మామగారూ! కూర్చోండి" అని కుర్చీ చూపించాడు సుబ్బారావు.

"ఏమోయి! పండక్కి నిన్ను అమ్మాయిని తీస్కువెళ్లటానికేవచ్చాను. రేపే మంచిది. ప్రయాణమయి సిద్ధంగావుండండి."

"నేనెందుకు? మీ అమ్మాయిని తీసుకువెళ్లండి."

"అమ్మాయిని తీసుకువెడతానోయీ: నీవుకూడా రా. ఇప్పుడు తలవులే కదూ, నీకూ? పిల్లలు, మీ అత్తగారూ చూడాలంటున్నారు."

"అబ్బే వీల్లేదండి, ఈమాటు వస్తాను. దాన్ని తీసుకు వెళ్లండి."

"అల్లాఅంటే యేం చెప్పను? అమ్మాయీ! బట్టలు సర్దుకో. రేపే ప్రయాణం."

పెనిమిటి వద్దని సైగచేయగా, గంగ మాట్లాడకుండా వెళ్ళిపోయింది.

సుబ్బారావులేచి "మామగారూ! బజారుకు వెళ్ళి వస్తాను" అని వెళ్ళేడు.

గోపాలంగారు యింట్లోకివెళ్ళి వుప్మా చేస్తూన్న గంగదగ్గరకూర్చుని "అమ్మా! తెల్లవారకుండా ప్రయాణమునకు మంచిది - వేగిరము బట్టలుసర్దుకో. అల్లుడు రానట్టేనా?" అన్నాడు.

"నాన్నా! నన్ను పంపటం యిష్టంలేదు వారికి. మొదట పంపుతానంటే ప్రత్యుత్తరం వ్రాశాను. తీరావచ్చిన తర్వాత పంపనంటున్నారు."

"నాతో పంపుతానన్నాడే. నీతో అట్లాయెందుకన్నాడు?"

"నీయెదుట వూరికే నీవేమనుకుంటావో అని అన్నారు. అసలు యిష్టంలేదు. నీవు వెళ్ళవద్దని నాతో చెప్పి, తీసుకువెళ్ళండని నీతో చెప్పేరు. నీవు బ్రతిమాలితే యేమంటారో మరి."

"సరేలే. నేను అడుగుతాను. నీవు సిద్ధంగా వుండు."

గంగాభాయి సంతోషముతో వుప్మా, కాఫీ సిద్ధం చేసింది.

3

సుబ్బారావు రాగానే అంతా ఫలహారంచేశారు. తాంబూలం వేసుకుంటూ "యేమోయీ! అమ్మాయి రానంటోంది, యెందుచేతనోయి?"

"అదిరానంటే నేనేమి చెయ్యనండి. నా అభ్యంతరంలేదు."

"కాదోయి నీకుయిష్టముంటే అదితప్పకుండా వస్తుంది. కాబట్టి నీవే చెప్పు."

"నేనేమి చెప్పను: తప్పకుండా తీసుకువెళ్ళండి"

"అమ్మాయీ! విన్నావా? తీసుకువెళ్ళమన్నాడతను. నీవు రానంటావు."

"ఆయనకి యిష్టంలేనిదే యెట్లా రానూ? పంపితే తప్పకుండా వస్తాను. వద్దుఅని చెప్పటచేత రాను న్నాను."

"విన్నావా? యెందుకుపంపవు? పదిరోజులువుంచుకుని తిరిగి పంపేస్తాను. నామాటవిని పంపు. మావాళ్ళంతా చూడాలని కంగారు పడుతున్నారు."

"ఇప్పుడు అనవసరంగా ఎందుకని అన్నాను. ఈమాటు మేమిద్దరం వస్తాములెండి. పదిరోజులు కాదు, సెలవుంటాము."

"అట్లాకాదు యిప్పుడు మీరిద్దరూ రండి. పదిరోజులుండి, యీసారి మళ్ళవచ్చి సెలవుండవచ్చును. నిన్నుకూడా తీసుక్కురమ్మని మీఅత్తగారూ మరీమరీ చెప్పింది. నాకుపిల్లేదంటే పనివుందేమో అనుకున్నాను గాని యిష్టంలేక అన్నావనుకోలేదు - ఇద్దరూకూడా రండి."

"అల్లాగేలెండి. రేపటిమాట ఆలోచిద్దాం."

౪

రాత్రి భోజనాలు అయినాయి. సుబ్బారావు గదిలోనికి వెళ్ళేను. గంగ గృహలక్ష్మి చదువుతోంది. "అనుగాని, మీనాన్నతో యెందుకు చెప్పావు?" అన్నాడు గదిలో అడుగుపెట్టుతూనే.

"చెప్పకుండా వుందామనుకున్నాను గాని యెందుకురావని నొక్కినొక్కి అడుగుతూంటే యేమనను? మీరు తీసుకువెళ్ళమనిఅంటే, నేను రానంటే నాదిలోటు అవటంలేదూ?"

"వాన్ సెన్స్, నాతోమాట్లాడకు. నీవెందుకూ పనికిరావు. వట్టిఫూల్ వనుకోలేదు."

చేతిలోనిపుస్తకం పెట్టిమీద పెట్టి "యిదిగో, చూడండి! కోపంవచ్చిందా? తెలివితక్కువచేత చెప్పేను. వెళ్ళనులెండి. మీరూ, నేనూ యీసారి వెడదాం. మానాన్నతోటి అట్లాచెప్పొస్తాను."

"చాల్లే. చెప్పొస్తావు? ఇంతవరకు వచ్చినతర్వాత అల్లాచెపితే యేంబాగుంటుంది? వస్తానని చెప్పిరా."

"అల్లాగే పంపుతానన్నారని చెప్పివస్తా. మీరు కూడారారూ, సర్దాగావెడదాం?"

"నేను రాను నీవువెళ్ళు"

"అట్లాకాదు మీరువస్తేనేగాని నేనూవెళ్ళను. ఇద్దరంవస్తామని చెప్పివస్తాను" అని చక్కాపోయింది. తండ్రితో చెప్పి బట్టలుసర్దడం ఆరంభించింది. ఇద్దరి బట్టలూసర్దింది.

"నాబట్టలుకూడావేశావ్? ముఖ్యంగా నీతో రావాలన్నమాటా? నే లేకుండావెళ్ళవూ? అసాధ్యురాలవు. నాచేత వప్పించావు. ఎందుకూ నీకు వెళ్ళాలని అంతసరదా?"

"ఎవ్వరికైనా పుట్టింటికంటే వెళ్ళాలని ఆశ వుండదూ?"

# పుష్పాంజలి

శ్రీమతి బి. పార్వతమ్మ గారు

సూర్యభగవానునందు ప్రసూనతతుల
ముద్దుగుల్కుమొగాల సముద్రమందు
భవదనంతవిలాసముల్ ప్రతిఫలించు
శ్యామసుందర! సుకుమార! రామచంద్ర!
విమలగోదావరీసరిద్వీచికలను
భద్రకాననవేణునిస్వానములను
హాయిగ్రోలెద నీదుగీతామృతంబు
శ్యామసుందర! సుకుమార! రామచంద్ర!
పూతసాకేతపురిసరయూతటాన
నిలచి "హేరామ! సంసారజలధితరణ
మాంప్రపేదదయానిధే మాంప్రపేద"
అనుచుజంతించువారె ధన్యాత్ములయ్య!
వలదు కరులందలంబులు వలదు హారులు
స్వామి! చూపవె నీపాదజలజయుగళి
మ్రొక్కిముద్దిడికొలుతు నే ప్రొద్దు తండ్రి!
శ్యామసుందర! సుకుమార! రామచంద్ర!
అలసి తిర్థాలవెంబడి నరుగబోను
సొలసి విపినాలఁదపములు సలుపలేను
చేతు నొకనీదుపాదరాజీవసేవ
శ్యామసుందర! సుకుమార! రామచంద్ర!

*

*   *

# అంశువు

ఈహృదయమున దుఃఖదవానలము చెలరేగిన దని ఎవరికెరుక?—హృదయమునందలి దావాగ్ని హృదయమునకే ఎరుక.

చేసిన అక్రమములను విచారించి మానవుడు మానవునకు మరణదండనవిధించుచున్నాడు. చేసిన మేలుగ్రహించి మానవుడు మానవున కౌన్నత్యము ఘటింపజేయుచున్నాడు. ఇతర జంతుతతికి మానవుడే పరిపాలకుడు!—మానవుడు సమర్థుడు!—కావుననే కొన్నిసమయములందు పరాత్పరుని సరకు గొనడు!

ఆకుసుమమున కాసౌందర్యమెట్లువచ్చినది?—నెత్తురుముద్దయగు ఆపసికందు ఆమెయే తల్లియని ఎట్లుగ్రహించినది?—మట్టివిత్తనమెంత వృక్షమెంత!

*   *   *

సమర్థుడగు మానవుడు తలవంచుచున్నాడు! పావనమగు పరంజ్యోతి విజయమువలని ఆనందమున అతనిశిరముపై నాట్యమొనరించుచున్నది.—మానవు డసమర్థుడు.—

ఈయసమర్థుని హృదయమునుండి మకరంద ధారలా—వేడినిట్టూర్పున వెచ్చబడిన శోణితమా—స్రవించునది? అకారణముగ ఈహృదయపీడన మెందులకు?—ఇది సకారణమేమో?......ఇట్టి యజ్ఞానమే మానవమత్తేభమున కంకుశము.

పరాత్పరా! ఇట్టి యజ్ఞానతిమిరమును పటాపంచలొనర్చ విజ్ఞానాంశువును ప్రసాదింపుము.

కర్త
చిరుమామిళ్ల
శివరామకృష్ణప్రసాదుగారు

*   *

*

# వియోగరాధిక

సామవేదము జానకిరామశర్మగారు

ఈవిరజాజిపూవుబోదరిండ్ల మధువ్రతకామినీగణం
బీవిధితేన లాత్మప్రియు లింపుగ గ్రోల సమీకరించె బో
నావలె మన్మథార్తిబడునాయివి? గోపకిశోరమూర్తికై
నావిడియమ్ము యట్టుల ననాదృతులై, వచియింపు నెచ్చెలీ!

ఆమధుమూర్తికై హృదయ మాసనమాయెను. అర్ఘ్యపాద్యముల్
మామకహాసచంద్రికలు. మంజులముల్, కమనీయప్రేక్షణ
శ్రీమధురత్వముల్ యొసగి ప్రేముడిజూపుదమన్న, యేలకో!
తామరసాయతాక్షు డిటు తా దయసేయడు. కిన్కబూనెనో,

ఈలలితాంగి రాధ నొకయించుక చూతమటంచు ధూర్తుడై
యేలవలీనికుంజములయేపున డాగెనొయన్న, వానికై
సోలుచుదీరమెల్ల బరిశోధనజేసిన గానరాడు. నా
లో లవమేనిదోసము విలోకనజేసి వచింపరాదటే?

సంధ్యావికచకుందసాంద్రకుట్మలము లింపుగగూర్చితిని మెడబూనరాదె?
అభినవగంధమ్ము లలఘుపరీమళవ్యాపృతమ్ములు మేన నలదరాదె?
తేటులాననితీయదేన పాత్రములలో నింపియుంచితి నారగింపరాదె?
కర్పూరబహుసుగంధద్రవ్యసమ్మిశ్రితాంబూలమున హాయిదనరరాదె?

లలితశుకపికశారికాలాపకలిత
మాత్మవీణియ మేళనమాచరించి
యుంటి, వినిపించుకోనరాదె? యువిదమిన్న!
మదనగోపాలు డెంతయమాయకుండు!

నేనొకపిచ్చిదానివలెనే యిచటన్ విలపించుచుండు నం
ధ్యానవమల్లికావిలసితమ్మగు మద్ధృదయమ్ము ప్రేమతో
కానుకవెట్టినన్ దయకుగానని నవ్యమరందసంభృతం
బీనవమాలతీకుసుమమేల మధువ్రతుడేగు నొల్లకన్?

అల మలుసంజవేళ పునరాగమనంబని, చేయి చేతిలో
పలనిడిపోయి, బల్వెతలబాలొనరించిన గృష్ణు డూరనా?
ఫలమిదియంచు యేడ్వన? స్వభావమటంచని యూరడిల్లనా?
కలికి! యొకైన నమ్మసరిగావుకదా మురవైరికృత్యముల్.

# విమల

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

౧

విమలబాల్యము వసంతఋతువువలె సౌఖ్యముగ నాటపాటలతో గడచెను. ఇఁక యౌవనమో యిరువదియైదేండ్లదాక వర్షశరత్ప్రకృతివలె నవనవోన్మేషమై, అప్పుడే వికసించిన కుసుమగుచ్ఛమువలె సుందరతరమై, సౌరభోపేతమై, నిర్మలసలిలప్రవాహానుకరణగంభీరమై, ప్రణయినీమృదులమై, అన్యోన్యావలోకనానందరసాస్వాదనధన్యజీవియై వెలసెను. ప్రాణపతిపవిత్రప్రేమామృతధారాభిషేచనచే విమలాజీవితసుమము నయనారవిందమయ్యె.

ఇఁక మూఁడవకాలము సంధ్యాసమయము. అస్తంగితభానుని యుష్ణదీప్తివలెనే విమల ఆశాదీపికచల్లనై, హృదయస్థితకుసుమమందలి ప్రణయదళము లొక్కొక్కటి యూడ జొచ్చెను. విమలఅవస్థ ప్రకృతిము శిశిరమందలి ఎండుమోడు ననుకరించుచుండెను. నిరాశాసూచకంబగు ముఖమున విషాదచ్ఛాయ లలముకొని, రాహుగ్రస్తభానునివలె కాంతిదొరఁగి యుండెను. విమలాకల్పతరు విరువుర పిల్లలగాంచెను. కాని భర్తానురాగదూరీకృతురాలగుటచే గర్భరత్నములదీప్తి కామోదము లేకుండెను.

విమల అనర్ఘరత్నమనియు, తనపాలిటికామధేనువనియు వచించుపతి తన్ననాదరణ సేయుచుండుటచే, "అతిపరిచయాదవజ్ఞ" అను లోకోక్తి సత్యమయ్యెనని తలఁచి ఆమె దుఃఖించుచుండెను. మనోవ్యాధికిమందు లేదు. సంతోషముసగముబలము. అసంతృప్తిగల తరుణి అవస్థాకారణమున వృద్ధురాలిననుకరించును.

కేశవునికి దుస్సహావాసంబున క్రమముగా జారద్యూతపానంబు లభ్యాసమాయెను. రంభాసదృశసతీరత్న మసహ్యాకరముగను, గృహనివాసము కంటకతల్పమువలెను, పత్నీహితాదరణామృతము విషపానమువలెను తలఁచి ద్వేషింపమొదలిడెను.

త్రాగుట, ఎచ్చటనోపడిపోవుట, మతిలేని సమయంబున జేబులందుండెడి ద్రవ్యము గోల్పోవుట, తెలివిగలిగినతర్వాత యింటికివచ్చి కస్సుబుస్సుధ్వనులతో బొమముడులతో రెండుమెతుకులుకతికి నాన్నాయని చేరవచ్చుబిడ్డలను చీదరించుకొనియు మాటాడబోవు భార్యను రెండుమోదియు నిమిషములమీఁద నిలువెడలిపోవుట జరుగుచుండెను.

ఒకసారి కూతును, మనుమలను చూచుటకువచ్చిన విమల తలిదండ్రు లీతనిప్రవర్తనఁ దిలకించి ఘోరము చింతించి విమలను పుట్టింటికిరమ్మని బ్రతిమాలిరి. కాని సతీరత్నమగు విమల శ్రీకి నివాసయోగ్యమైన భర్తృస్థానమువిడుచు టనర్హమని, విష్ణువక్షస్థల మాక్రమించిన లక్ష్మిని, పతిజిహ్వనేనిలచిన సరస్వతిని, పతికి అర్థాంగియైయున్న పార్వతిని తార్కాణము జూపి, ఎంతటి కంటకస్థానమైన పతిసహచారిణినై యిచ్చటనేయుండెదను కాని దేహసౌఖ్యమునకాసించి పుట్టినింటనుండి ఆత్మౌన్నత్యము చంపుకొనసని ఖండితముగాబల్కెను. కూతు

సుగుణశీలంబులకాత్మలో ముదమంది, ధర్మమేజయించునని దీవించి విమల జననీజనకు లామెకు సరిపడుడబ్బునొసగి, ఇబ్బందికలుగుతరుణమున మరల జాబువ్రాయుమని వెడలిపోయిరి.

౨

ఒకనాడు. పౌర్ణమి. రాత్రిపదిగంటలైనది. గోదావరికివరదసంపూర్ణముగావచ్చి గట్టుకు డాసియుండెను. పిల్లలేడ్చుచుండుటచే మంచిగాలిలో త్రిప్పవలచి విమల గట్టుదరినేయున్న తమ యింటినివీడి శిశుద్వయముతో గట్టెక్కెను. ఇంతలో కాలికి బలుబుపదార్థము తగిలి యులికిపడి క్రిందకుచూడ తనభర్తయగు కేశవుడచ్చట అచేతనుడై పడియుండెను. త్రాగుబోతు మితిమీరిత్రాగి ఇంటివైపువచ్చెను. అంతటితో యొడలుమరచి పడియుండవచ్చును. కాని భర్తానురాగిణియగు విమల కాతనిస్థితి చూడగనే హృదయము చెదరెను. మతి మతిలోలేదు. శక్తిలో ఆలోచనలేదు. ఏమిచేయవలెనో తోచక చంకబిడ్డను క్రిందదించి ఎడకుర్రనిమరచి, ఉగ్గిలిపట్టున పతిదేహమెత్తి సందిటపట్టి హృదయావేశమున అబలాత్వముపోవ నతివేగమున ఇల్లుప్రవేశించి మగనిని మంచముపై బరుండబెట్టెను.

తలమునిగిన ఆపదసమయమున గర్భంతీపిమరచినది. గట్టుపై విడచిన బిడ్డలయాలోచనయేచేయక మగనియందే దృష్టినిల్పి శీతలోపచారములు చేయుచున్నది. ఏడాక్టరుకైన కబురంపుదమన్న మారుదిక్కులేదు. ఇట్టి ఏకాకిదశలో నాసాధ్వి భగవంతునిపై భారము వైచి భర్తనురక్షింప ప్రార్థించుచుండెను.

ఇంతలో విమలచేయు నుపచారములచే త్రాగినమత్తును, పడుటలో నెత్తికితగిలిన దెబ్బచే కలిగినదిమ్మును వదలి; మెల్లనకండ్లు తెరచిచూచి దాహమని సంజ్ఞచేసెను. పతిస్మృతియే కావలసినవిమల యాతని సంజ్ఞగుర్తు గ్రహించి తత్క్షణమే చల్లనిపానీయములాతని నోటపోసెను. దానితో కేశవునకు పూర్ణస్మృతికలిగి తానిచటకెట్లువచ్చితినని ప్రశ్నించెను.

పతిజీవితసంశయవిచ్ఛిన్నహృదయయై విమలకుమతికుదుటబడుటలో బిడ్డలుజ్ఞప్తికి వచ్చి పతిప్రశ్నకు జవాబివ్వకయే శరవేగంబున గట్టెక్కిచూడ ఏమనిచెప్పను? నిమిషమాత్ర మాలసించిన కసుపు గంగాప్రవేశమై పోవలసినదే. ప్రాకుచుండిన చంటిబిడ్డఏడ్చుచు నీటిదరికి బోవుచుండెను. ఏకగర్భజనితావ్యాజానురాగ అయాచితభావోదయుడగు ఎడబాలు డాచిన్ని బాలవెంబడినే ఏడ్చుచు, చెల్లెలిని తీయశక్తియు, యుక్తియు లేనివాడగుట కూడనేగుచుండెను. సహజసోదరస్నేహమంతటిదే. ఇటుల వారిరువురు నీటిసమీపమునకు వచ్చియుండిరి. అట్టి భయానకదృశ్య మవలోకించి విమలకడుపు తరుగుకొనిపోవ ఒక్కదాటునగట్టుదిగి, చేతులతో తపతపకొట్టుచుండిన పసినినుగు సమాంతమున హృదయమున నత్తికొని, పెద్దకుర్రని ఎడమ చంకపెట్టుకొని కనుకొలుకుల వేడికన్నీటిబిందువులచే బిడ్డల మూర్ధములు తడువగ ప్రస్తుత పరిస్థితు లానందదాయకములుగచేసిన పరమేశుని మనమున కీర్తించుచు గృహముజొచ్చెను.

పడుటలో తగిలిన ప్రబలాఘాతముచే కేశవునికి పూర్వజ్ఞానముకలిగి తనవివాహ

మాదిగా విమలచెలిమియు, ఆమె ప్రేమాలాపంబులచేతను లాలింపబడుచుండిన కాలమును, ప్రస్తుత తనదుష్ప్రవర్తనయు, హృదయరత్నమును తనపదముల తన్నుచుండిన తనయవివేకమును, అప్పటికిని తనయందాసతి చూపుచున్న ఆదరణాతిశయానురాగమును గుర్తెరిగి తనదై యున్న వస్తువయొక్క విలువ తెలియని అలుసుతనముకు పశ్చాత్తప్తమనస్కుడై భార్యానురాగము అవస్థాభేదావరణచే కప్పబడినది తొలగి మరల మొలకెత్తెను. "హృదయకుసుమమును చించివేయకుము. దాని సౌరభంబాఘ్రాణించుచు శిరమునదాల్చుము! అర్థాంగి కానందదాయివగుము." అని హృదయవీణ పంచతంత్రులమ్రోగుచుండెను. వస్తుతత్వ మెరిగిన వారికది రెట్టింపువిలువ. ప్రేమస్థిరత్వమగును. అట్టి సదవకాశము కేశవునివలన మరల విమలకు కలుగనుండెను.

కిశోరద్వయముతో, దరహాసితవదనముతో వచ్చుచుండిన గృహలక్ష్మి కాగృహమేధి యెదురేగి బిడ్డల నిరువురనొక్కసారియే అందికొని ముద్దులమునిచివేసెను. "ఏదీ నాసతి! ఏదినాజీవితరత్నము. కాలదన్నిన సుమమును కళ్ళనద్దికొనువిలువనిప్పటికెరిగితిని. విమలా! నాతప్పులను మరువవా? నా యనాదరణాగ్నిచే నీహృదయమును కాల్చివేసితిని; క్షమించవా? మునుపటి నీప్రేమామృతముచే- నిస్సారమైశుష్కించిన యీయెంకుకట్టెను - మరలదనిపి చిగురించచేయవా?" అని సంపూర్ణచంద్రకాంతిలో నామెను చేరదీసికొనెను.

పతియొక్క పది అవమానభారముల నొక్క ఆదరణముతో నిజసతిమరువకుండనుండగలదా? విమలానందనయనముల సొబగాసమయమున వర్ణింపశేషునకైన తరముకాదన కేశవునకువశమా? ప్రేమరెట్టించిన హృదయమునకు కురూపి జగన్మోహినియే.

"అచేతనుడనై యుండిన భారమగు నాదేహమెట్లింటి కొక్క తెవు మోచికొనివచ్చితివే విమలా!" అనెను కేశవుడు.

"స్త్రీ శక్తిస్వరూపిణియనియు, సమయానుకూలముగా కుంచితవిఝృంభణశక్తులను పొందగలదనియు నెరుగరా? భర్త్రానురాగము కడుపుతీపినికూడ కొంచెపరచెనుకదా! మీరుండెడి ఆపదస్థితిలో పిల్లలనే వదలివచ్చితినికదా? నమ్మినవారిని చెఱుపడని భగవంతునికి బిరుదు లేనియెడల గోదావరియొడ్డునకుదిగిన పిల్లలు, కనుపుగంగాప్రవేశమై "నదీనాంసాగరోగతి"యై యుందురుకదా!" అనెనువిమల.

ఈ కడపటిమాటలతో హృదయముకలిగి కేశవుడు బారున పసినిసుగువలె ఏడ్చి తన సతీమణినిలాలించి, బిడ్డలనిరువుర మరల ముద్దాడి హృదయవ్యథ తీర్చికొనెను. అది మొదలు కేశవుడు పశ్చాత్తాపాగ్నిచే పాపతృణరహితుడై నాకు మొదలు కపోతదంపతుల వలె యెడబాటులేక అన్యోన్యబద్ధులై విమలాకేశవులు కైశోరలీలలంగాంచుచు సుఖజీవితమామరణాంతము గడపిరి. కూతురి సంసారమందలిమార్పున కానందచిత్తులైరి విమల తలిదండ్రులు. విమలకూతురు లీల. లీలలాలింపులచే తదుపరిపుట్టిన తమ్ముడానుకొనుచుండెను.

# సతి

ఆలమూరు రాజగోపాలరావుగారు బి. ఏ.

౧

రాధ

అక్కా! నీకాళ్ళసాక్షి- నాకడసారికోరిక. ఒఖచోటుండి ఒఖచోట పెరిగాం. ఈతండ్రిలేనిగుడ్డు, కనుగాయ, నాకొడుకు- కాదు నీకొడుకు. ఇదుగో, ఇహానీఆధీనం. పెంచుతాను అనుతల్లీ, తల్లిలేనిలోటుండదు అనుతల్లీ. నిశ్చింతతో, నిశ్చలాత్మతో ఇహ నాజీవాలువిడుస్తా...అమ్మా! ఏకాకి, దిక్కులేని బిడ్డ, మీరే తల్లీతండ్రీ-

సత్య

అయ్యో, అమ్మ, నాగుండె పగిలిపోతూంది సుమా. నాహృదయంలో చిచ్చుపెడుతున్నావుసుమా. మమ్మల్నికష్టాలముంచుతావా? నేజీవంగడపగలనా? ఇంత మోసమా?

రాధ

అక్కా! ఈశ్వరాజ్ఞ-ఏడవకు- నేనిహజీవించను-. నీపాదాలశరణం. అదిగో అల్లాచూడు ఆతొట్టెకేసి. నాఆనందం, నాజీవితం, నాసర్వస్వం-ఇహానీఆధీనం- మళ్ళీమారుమాటాడకు- శలవు - వెళ్ళిపోతున్నా. నమస్కారం.

రాధకి మళ్ళీమాటలేదు. శ్వాసలెక్కువైపోయాయి. ఎక్కిళ్ళుబలిశాయి, శ్లేష్మంచుట్టేసింది. కరచరణాలు చైతన్యంవిడిచాయి. నిశామధ్య మేఘపుటాలు చీల్చుకుంటూ బయటబడుతూన్న ఆనాటి అర్ధచంద్రుని కోరచూపుల్లో రాధముఖం దీపించిపోయింది. ఘర్మబిందువులు ముఖరేఖల్లో తాండవించాయి. ఘణాఘణా గడియారం పన్నెండుకొట్టింది. విశ్వనాధుడుగుండె గుభేలుమంది. ఆరోగ్యశరీరంలోనిహంస కళేబరాన్ని కదిపికుదించి ఒఖసారి ఎగిరిపోయింది. ప్రేమాకృతి రాధ నాపహించింది.శరీరం వివర్ణమయింది. రాధకట్టె మిగిలింది. కాని ఆజ్ఞానమయపుంజాలు, ఆఅనంత సంతోషాలు, ఆరాధవిశాలనేత్రాలు, ఆమక్కల్లాంటి కళ్ళతో, ఏకుల్లాంటిచేతుల్తో, పొత్తిగుడ్డలెగకేసుకుంటూ వెఱ్ఱినవ్వులునవ్వుతూ వెఱ్ఱిఆటలాడుతూ వెఱ్ఱి ఆనందంలో తేలి ఆడిపోతూన్న ఆ, తనకొడుక్కేసి తన అనంతుడికేసి అల్లాగే, అచంచలంగా సుప్రజ్వలితాలై, చూస్తూనే నిలబడిపోయాయి.

పాపం. విశ్వనాధుడో మూల కళ్ళుప్పగించి నిర్విణ్ణుడై అల్లాగే చతికిలబడిపోయాడు. గోరుచుట్టుపై రోకలిపోటులాగ, తమ్ముడు చనిపోయి మూడునెల్లు తిరగలేదు, సరికదా మరదలు రాధకూడా తనసర్వస్వం తన కప్పగించి వెళ్ళిపోయింది.

౨

ఏంలోటూలేదు. తల్లిలేకపోతేనేం పెత్తల్లి, తల్లికన్న ఎక్కువ. తనకికొడుకూలేడు,కూతూళ్లూలేరు. ఇహతనకి మరిదికొడుక్కన్న దిక్కెవరు? భర్త, విశ్వనాధుడు సరళుడు. తనతమ్ముడికొడుకు తనకొడుకే అనుకున్నాడు. అనంతుడిహతనకొడుకే అన్నాడు. సత్య, అనంతుడు రాధ ప్రతిబింబంఅంది. లేదు, తన బింబమేనంది. విశ్వనాధుడు అనంతుడు తన ప్రేమమూర్తిఅనుకున్నాడు. తనసర్వస్వం అనుకున్నాడు.

అనంతుంతల్లిదండ్రుల బొమ్మ కైదువందలిచ్చి పెద్దవిచేయించారు. సావిట్లో వీధిగుమ్మంపైన కట్టారు. రోజూ పూలదండలేశేవారు. విశ్వనాధుడు అనంతుడిడబ్బంతా కుర్రాడిపేర బాంకులోవేశాడు. అతని చితాఅంతావిడతీశాడు. అతని శిస్తంతా విడిగా ఉంచాడు. అతని ఆస్తంతా అతనికేఉంచాడు. అనంతానికికావలసిన డబ్బంతా తనడబ్బులోంచే ఖర్చుపెట్టాడు. తనడబ్బూచివరికి అతనిదేనన్నాడు. ఇహ తనే అనంతం అనంతమే తను అన్నాడు.

ఆదంపతులకి అనంతం అంటే ప్రేమపాశాలు మరింత మితిమీరిపోయాయి. ఇహ అనంతానికి కాస్త రొంపపడితే గంటగంటకీ ముగ్గురుడాక్టర్లువచ్చేవారు.

పదివుందినరుసులు పనిచేసేవారు. పెత్తండ్రి అతనికి తొక్కుడుబండి కొన్నాడు. పండగపండగకీ బహుమతులిచ్చేవాడు. రోజా కొనిపెట్టేవాడు. తనతో కూడా షికారుకుతీసికెళ్ళేవాడు. అతనికి ప్రత్యేకం పలుగురునౌకర్లనెట్టాడు. చదువుకునే యీడొచ్చింది. అక్షరాభ్యాసం చేశారు. పొద్దున్న సాయంత్రం యిద్దరిద్దరు పంతుళ్ళింటికొచ్చి "అఆలు" చెప్పిపోతుండేవారు. బళ్ళోకతనుబండిమీద చప్రాసీతోటు తోడుక్కువెడుతూంటే, పలకో నౌకరు, గొడుగో నౌకరు, ముందో నౌకరు, వెనకో నౌకరు ఇల్లాగ్గా కేవలం దేవేంద్రునిమీద తొడకొట్టేటట్టు కనబడేవాడు. తోటికుర్రాళ్ళంతా అతనితో బండివెనకాలవెళ్ళటం ఓగొప్పఅదృష్టంఅనుకునేవాళ్ళు. ఓనాడేకారణం చేతన్నా అనంతం ఇంటికిరావటం ఆలస్యమైతే సత్య కళ్ళనీళ్ళెట్టుకుంటూ వీథిగుమ్మంమీదకూచునేది. విశ్వనాథుడికి వెఱ్ఱెత్తి యిల్లిల్లూ వెదికేవాడు.

3

అనంతుడు పెద్దవాడయాడు. మంచిచెడ్డలు తెలుసుకునే యీడొచ్చింది. మెట్రీకునుపాసయాడు. ఉన్నతవిద్య చదవమన్నారు. ఇహవిద్య వద్దన్నాడు. ఈవిద్యలో లాభంలేదన్నాడు. విద్యపుస్తకాల్లో లేదన్నాడు. విద్య హృదయంలోనే పుడుతుందన్నాడు.

తనతండ్రి గల్లాపెట్టికావాలన్నాడు. వంశపారంపర్యమైన వ్యాపారం పునరుద్ధరించాలన్నాడు. బజారులో కొట్టువుచ్చుకున్నాడు. చిన్నవర్తకం స్థాపించాడు. ఆతేటనవ్వులు తాండవించేపెదవిల్తో, తేనెలొలికేపలుకుల్తో నిర్మలపూరితమైన హృదయంతో షాపులో కూచుంటే ఊళ్ళోవాళ్ళంతా అనంతంయొక్క తండ్రిలేనిలోటు పోయిందన్నారు. తనతోచదువుకున్న కుర్రవాళ్ళంతా తనదగ్గిరకే కొనేవాళ్ళు. ఊళ్ళో ఉద్యోగస్తులంతా అతన్నే పొగిడేవాళ్ళు. పుట్టుదరిద్రులైన బీదలంతా అతన్నే తలుచుకునేవాళ్ళు. చూస్తూండగా అనుపుత్రుడు సులక్ష్మీపుత్రుడైపోయాడు. తన తల్లి పేరోపుస్తకభాండాగారంకట్టించాడు. తనతండ్రి పేరోటోర్నమెంటు (Tournament) స్థాపించాడు. దేశంకోసం ఓసత్రంకట్టించాడు. తన పెత్తండ్రికి పెత్తల్లికి ఓమోటారు కొనిచ్చాడు. ఊళ్ళోకి కొత్తగా దిగినవాళ్ళంతా ముందుగా అతని దర్శనంచేసేవారు. ఊళ్ళోమీటింగంటే చిన్నవాడైనా తానే అధ్యక్షుడయేవాడు. పెద్దల్లోకీ పిన్నల్లోకీకూడా అనంతుడే బుద్ధిమంతుడయాడు. సర్వం సలక్షణంగానేజరిగిపోయింది. అతనిదేయోగం, అతనిదేఅదృష్టం. సిరిసంపదయితనే గుత్తపుచ్చుకున్నాడు. కాని అతనికున్నది ఒకటేవిచారం. పాపం అతన్ని చిన్నప్పట్నుంచీ పెంచిపెద్దచేసిన ఆవృద్ధదంపతులకు వయస్సు మళ్ళిపోతూందిగదాఅని. పెద్దవాళ్ళయి పోతున్నారుగదాఅని. వాళ్ళఋణం తానేలాతీర్చుకుంటానాఅని.

4

ఓనాటిసాయంత్రం, అనంతం మేడమీద అప్పుడే ఉదయిస్తూన్న చంద్రబింబాన్ని తిలకిస్తూనిలబడిపోయాడు. ఒక్కసారి కన్నీళ్ళుతుడుచుకున్నాడు. భావి జీవితం ఇహాగడపటం తనతరం కాదనుకున్నాడు. సర్వంనిరాశాపూరితమనిభావించుకున్నాడు. వేనోళ్ళ దేవుళ్ళకు మొక్కుకున్నాడు. మెల్లిగాలేచి కిందికి పోయాడు. 'ఎల్లాఉంది' అనిఅక్కడున్న దాదినడిగాడు. జ్వరంజారింది అంది.

అనంతానికి మట్టుకు తెలియదూ! పెద్దతనంలో పక్షవాతం, వయస్సుమళ్ళింది, మందులుపని చెయ్యనిస్థితి. ఖిన్నవదనంతో ఆతల్లికేసి చూసుకుంటూ దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. తల్లికదిలింది. అనంతా అని మూలుగుతూ కళ్ళు తెరిచింది. 'అమ్మా' అని ఆత్రుతతో అనంతం మెల్లిగా పలకరించాడు. "నాయనా, యిక్కడే ఉన్నావా?" అంది. అనంతాన్ని దగ్గరగా కూచోమంది.

"నాయనా! అనంతం! నేబతికుండగా ఆకాస్తకార్యం అయిపోతే నాకళ్ళుచల్లబడతాయిరా. ఇదిగో నాకీ రోగం ప్రవేశించింది. మీనాన్నకా అరవై దాటాయి. ఇహావృద్ధులంమేమయిపోయాం. నువ్వు నీపట్టుమానెయ్యి. నేనన్నా యిహావెళ్ళేదాన్నే కాని

ఉండేవాన్ని కాదు. నువ్వుకూడా ఓగృహస్థువై, భార్యతో యీయింట్లో తిరుగుతూంటే నాపుట్టుక పండుతుంది. ఎప్పుడడిగినా దేనికీతిరుగుచెప్పనివాడవు యీ విషయంలో పట్టిపట్టుపడుతున్నావు. చిన్నవాడవు. నీకు తెలియదు. గృహస్థుధర్మం అయింతర్వాతేమతో ఆశ్రమం. నామాటవిను. నీగడ్డముట్టుకు బతిమాల్తా. నా బొందిలో జీవాలుండగానే నువ్వొకయింటివాడవై ఉంటూండటం నాకళ్ళతో చూస్తానా అని బెంగెట్టుకున్నా. నానోవు ఫలిస్తుందాఅని ఉవ్విళ్ళూరుతున్నా. నాయనా-నామాటవినవూ-'సరే' అను బాబూ! నిన్ను బతిమాల్తా. నాకు పోయేప్రాణాలొస్తాయి." అని సత్య దీనంగా వేడుకుంది. అనంతంమీద పాషాణంపడింది. కంఠం స్తంభించిపోయింది. నేత్రాలు స్వాధీనం తప్పాయి. పెళ్ళిఖబురొచ్చినప్పుడల్లా ఎప్పుడూ ఏదో వంక పెట్టి తప్పించుకునేవాడు. పెళ్ళి బానిసత్వానికి మొదటిమెట్టనుకునేవాడు. సుస్థిరబ్రహ్మచర్యంతో అనంతసేవాసదనమై దేశదారిద్ర్యం బాప వలంతి కాదాఅని అతనికోరిక.

*

స్వస్థతకుదిరింది. కొంచంకాలు చెయ్యి వచ్చాయి కానియింకా సంపూర్ణారోగ్యంలేదు. అయినాద్విగుణీంచిన బలంతో పందిళ్ళువేయించింది. ఇంటికి రంగులు పూయించింది. అప్పడాలు, వడియాలు స్వయంగా పెట్టించింది. ఇహమన్నాడే తనఅనంతం పెళ్ళికొడుకవుతాడు. ఆమన్నాడెప్పుడొస్తుందా అని మొహం వాచిపోయింది. కళ్ళుతెరుచుకుకూచుంది.

మన్నాడు. విశ్వనాథుడు కచ్చేరీసావిట్లో రాశే శుభలేఖలు రాయిస్తున్నాడు. కొనేవస్తువులు కొంటున్నాడు. వచ్చేజనం, పోయేజనం ఇళ్ళు కిటకిటలాడిపోతూంది.

అనంతాన్ని పెళ్ళికొడుకుని చేస్తున్నారు. ఇల్లు ఘెళ్ళుమనిపోతూంది. వీథిలోస్తంభాలుకనబడకుండా అరటిచెట్లుకట్టారు. ముంగువాకిట్లో పెద్దరుగుమీదబాండు, బుల్లరుగుమీదసన్నాయి, పెద్దవసారాలోగవసెట్టు, ప్రక్కవసారాలో పాటకచ్చేరీ ప్రతిధ్వనించి పోతున్నాయి. ఇన్ని ధ్వనులూ మిశ్రమై యింటికప్పెగరకొడుతూన్నా మధ్యసావిట్లోంచి గ్రామఫోనుమాత్రం "ఏదీగతి నాకు" అనకమానలేదు. ఇహవూళ్ళో ఆడపురుగు పేరుచెప్పి యావద్విసిష్టజనం చంటిపిల్లలదేఖే, ముత్తైదులు రాజమార్గాన్నీ—పూర్వసువాసినులు దొడ్డిగుమ్మాన్నీ యిల్లు ముట్టడేశారు.

సత్య. ఆపచ్చనిపండు. తెల్లగపాలినతములపాకు, నిండైన్న మొహాన్ని స్ఫుటమైనకుంకుంతో శరీరస్థితి మఱచి స్వస్థత తెచ్చుకొని, సుస్మితవదనంతో, పొంగిపొరలే సంతోషతరంగాలతో స్వయంగావచ్చి, ముత్తైదుల నాదరిస్తూ, రాని వారికోస మెదురుచూస్తూ నిలబడివుంది.

నేడు సత్య నోము ఫలించింది. ఒకకంటిలో ఆనందబాష్పం, ఇంకోకంటిలో రాధకన్నీరు. ఓకంటిలో నాటిప్రొద్దున్న తన అనంతానికి తానుస్వయంగా దీవించి నెత్తిని చారెట్టానసేగర్వం, రొండోకంటిలో ఆనాటిరాత్రి రాధరంగం. ఒకకంటిలో జయభేరి, మరోకంటిలో తీరనిలోటు.

సరే పసుపుకొట్టటం పూర్తయింది. అనంతనాథుడు పెళ్ళికొడుకయాడు. పడుచులు మంగళహారతన్నారు. మంగళహారతి పళ్ళెంపట్టారు. మంగళహారతిపాడారు. అనంతంలేచాడు. తల్లికినమస్కారం చేశాడు. తల్లి మనసారదీవించుతూ తన్నుతాను మఱచిపోయింది. అనంతం తండ్రికోసం సావిట్లోకెళ్ళాడు. నమస్కారం చేస్తున్నాడు. ఇంట్లో గొల్లుమన్నారు యావజ్జనం. ఇంట్లోకంతా పరిగెత్తారు. సత్య స్మృతి తప్పింది. నేలబడింది. రొండోదెబ్బ పక్షవాతందెబ్బ వచ్చింది. ఆమె నెత్తివడింది. కరచరణాలు స్వాధీనం తప్పాయి. నోరుపడింది. అనంతాన్ని విశ్వనాథుడి కప్పజెప్పింది. చేతిలో చెయ్యోయించుకుంది. నమస్కారం చేసింది. ఆత్మ చాలించింది.

మన్నాడు. వీథులు బుక్కామయమైపోయాయి. పసుపుకుంఖాల్తోనిండాయి. పూలగుత్తుల్తోదొల్లాయి. ఐనోతనంతో పసుపుకుంఖాల్తో. పునిస్త్రీమయంతో ఆయింట్లోంచి, ఆవీథిలోంచి, ఆలోకంలోంచి, సత్య

వెళ్ళిపోయింది. పాపం, కళ్ళనికాటుక, కాళ్ళని పారాణి చేతిలోఅగ్గికుండ అఅనంతుడిస్థితి. మరి అవ్యద్ధుడో?

## ౬

ఇహ అనంతానికిదిక్కెవ్వరు? సర్వంప్రపంచం మిథ్యామయమనిపించింది. వర్తకం అంటే విరక్తి. ఇల్లంటేభయం, బంధువులంటేవిషం అనిపించింది. చివరికి విరక్తిభావం, ఆనిశ్చలాత్మ నావహించింది. రాను రాను సంధ్యారుణకిరణాల్లో "పిలయేటిమిలమిలల్లో, చిగురాకుదొంతరల్లో" ఆశామూర్తి తాండవించింది. కన్నీటిపరదల్లో ప్రశాంతప్రవాహాలునించాడు. నిర్విణ్ణచైతన్యంతో ఆకాశరాగాలు విన్నాడు. వర్తకం విడిచాడు. పుస్తకాలుతోశాడు. భాగ్యభోగాల సేల తన్నాడు. ఆత్మకు శాంతికావాలన్నాడు. దేశం చూడాలన్నాడు. యాత్రన్నాడు. సెలవిమ్మన్నాడు. తండ్రినివిడిచాడు. వెళ్ళిపోయాడు.

ఒకప్రక్క భార్యామరణం. రెండోప్రక్క తన నేత్రజ్యోతి, మనోమూర్తి, తనగుండెకాయ, తనకుడిచెయ్యి అనంతంవియోగం. ఆవిశ్వనాథుడిస్థితి భయంకరమైపోయింది. ఇంట్లో యెక్కడచూచినా తమ్ముడిమూల్గు, రాధప్రార్థన, సత్యమోకరింపులు. వాకిలెక్కితే శవాలదండు. బీభత్సదృశ్యం. ఇది, ఆతండ్రిగతి. ఆవిశ్వనాథునిగతి. తానిహజీవించనన్నాడు. జీవించకూడదనుకున్నాడు. మరణం నిర్దయురాలన్నాడు. ముందుగతి, కాడో, గోదావ్య, విషమో అని నిశ్చయించుకున్నాడు.

## ౭

కాలగర్భంలో ఏళ్లుదాగిపోయాయి. కొత్తలుపాతలయాయి, పాతలుకొత్తలయిపోతున్నాయి. మొగాడు-ధనంకలవాడు. అది ఆట్టేపొడగరీకాదు పొట్టిదీకాదు. మరీసుందరీ, బొత్తిగాకురూపీ కాదు, లావుకాదూ, సన్నంకాదు. పదవజనంతో దిగకపోయినా, కేవలం ఏకాకీకాదు, పుస్తకాలుచదవకపోయినా అక్షరాలానుమాలట్టకలదు. ఎదిగినపిల్ల, ఇహనేం అన్నిహంగులూ కుదిరాయి. పెళ్ళికూతురు ఘనందుగాఉంది. తాంబూలాలుచ్చుకున్నారు. తక్షణంలేకపోయినా, అవసరమైవేద్యాలకిమల్లే అవసర ముహూర్తాలు పెట్టొచ్చునన్నారు. మన్నాడే ముహూర్తం. తనింట్లోనే పెళ్ళి. అరవైఏళ్ళ ముసలాడైతేనేం, చూస్తుండగా నవమన్మథుడైపోయాడు. ఘెళ్ళుమంటూ పెళ్ళయింది. మూడుముళ్ళూపడ్డాయి. విశ్వనాథుడో ప్రణయపార్వతిని సంపాయించాడు. పదహారోజులపండగెళ్ళకుండానే పచ్చత త్తరంవచ్చింది. మూడోనాడే అమ్మాయి కాపరానికొచ్చింది. ఇహవిశ్వనాథుడు డబ్బుఖర్చయిపోతోందని దాసీవాళ్ళనితగ్గించాడు. ఇంట్లోగుమ్మాలు మార్చి గుమ్మాలెట్టించాడు. కిటికీలుతీయించి కిటికీలెట్టించాడు. ప్రహారీగోడ కొంచంపల్లమైనట్టు అనుమానంలోచి మరిరెండు గజాలెత్తించాడు.

ఏడాది తిరగకుండా తనకొడుకుపుట్టాడు. ఇంకయే జన్మఫలించిందనుకున్నాడు. ధన్యోస్మి ధన్యోస్మి అన్నాడు. తన స్నేహితులందర్నీ జ్ఞాపకం చేసుకున్నాడు. బంధువులందర్నీ ఏరాడు. వంశవృక్షాలు వెదికాడు. ఎక్కడున్న జ్ఞాతుల్నీ లిస్టురాశాడు. స్నేహితులికీ బంధువులికీ శుభలేఖలంపాడు. జ్ఞాతులందరికీ ఒకవేళ అందవేమో అని రిజిష్టరీశుభలేఖలంపాడు. భారశాలొచ్చింది. దివ్యమైనవక్షత్రం దివ్యమైనజాతకం అయినాఒకసారి నాన్లో మొహంచూసుకున్నాడు. అబ్బాయికి ఒడుదుడుకులేంలేకుండా నిత్యం సూర్యనమస్కారాలు, నవగ్రహజపం మొదలెట్టించాడు.

## ౮

ఏళ్ళుగడిచాయి. ఒకనాటిసాయంకాలం. సంధ్యాకాలం. సంధ్యకాంతులు విదజల్లుతున్నాడు సూర్యుడు. తన తులసి కలంకారాలుచేసి కోటదగ్గర కొడుకు నాడిస్తూ పార్వతికూర్చుంది. విశ్వనాథుడు ఆపూజలకీ అలంకారాలకీ ఎంత ఖర్చుఅయిందా అని జాపితావేసుకుంటున్నాడు. చూస్తుండగా ఆవిశ్వనాథుడికన్ను ఆజాపితామీదనుంచి, ఊళ్ళో పొలాలమీదనుంచి, ఇంట్లోయినపెట్టెమీదుగా కొంపలోఉన్న అనంతం

ఆస్తిమీదకిపోయింది. అయ్యో అనంతంఅనుకున్నాడు. ఇంకెక్కడి అనంతం, అనుకున్నాడు. ఇహ అనంతం కనపడ్డేనా అనుకున్నాడు. కనపడకపోవటమేబాగనుకున్నాడు. కనపడకూడదనుకున్నాడు. అతనాస్తంతా తనదే అనుకున్నాడు. తనకూనదేఅన్నాడు.

ఇంతలో వీథితలుపుచప్పుడయింది. గబగబా పరుగెత్తుకెళ్ళి విశ్వనాథం తలుపుతీశాడు. ఎదురుగా ఒకవ్యక్తి. అరమోడ్పుకలిగిన నయనాలతో, కోణంతేరి ఛాతీపై వేళ్ళాడుతూన్న గడ్డంతో కాషాయవస్త్రాలతో ఎదుట నిలబడ్డాడు. ఈ వైరాగి ముష్టాడు ఏం కొంపముంచుతాడో అని, విశ్వనాధుడు పొమ్మంటూ తలుపేసుకోబోయాడు. చిరకాలానికి కలిగిన తనతండ్రి పునర్దర్శనంచేత ఆవిశాలనేత్రాల్లోంచి, ఆదీపాల్లోంచి మంచిముత్యాలదొంతర్లురాలాయి. ఆవిశ్వనాధుడు కాళ్ళమీదపడ్డాయి. 'అయ్యో నాఅనంతవేనా' అని విశ్వనాధుడు నిర్విణ్ణుడైపోయాడు. కాని గుండె ఝల్లుమంది. ఏదో కడుపులో బాధనిపించింది.

౬

పార్వతి

నాయనా! అనంతం! నేను నీతల్లినికానూ. నేను నీసత్యవంటిదాన్నికానూ. నామాటవినవూ, నన్ను మన్నించవూ? నాకు కల్లో కనబడిందోయి. నాకళ్ళపై పడిందోయి. నిన్ను బతిమాలమందోయి.

అనంతం

అయ్యో, తల్లీ! ఇంకా నాకు వివాహమా, పెళ్ళా. అటుచూడు, ఆప్రపంచంకేసి, ఆదిక్కుమాలిన ప్రపంచంకేసి ఆఅనాథకూనలకేసి, ఆగర్భదరిద్రులకేసి, చినికివాలికలైన చీనికలతో, ఎండవానలకి తడిసి, రోగాలకి పుట్టిళ్ళై, మృత్యుదేవతకి నిత్యనైవేద్యాలై పోతూన్న ఆదీనతనయులకేసిచూడు. ఆభూదేవినిచూడు. ఆదేశమాత కన్నీళ్ళుచూడు, అమ్మా, ఇంకానాకు పెళ్ళా? సంసారమా?

పార్వతి

నాయనా! అనంతా! నాఒక్కమాట...

అనిఏదో ప్రాణావసరమైన ముక్క చెప్పబోతుండగా ఇంట్లోంచి విశ్వనాధుడిగర్జన వినబడింది. పార్వతి చెప్పకుండానే వెళ్ళిపోయింది.

౧౦

జోకొడుతూ, లాలిపాటలుపాడుతూ, తనపూర్వజన్మపూజాఫలితం అనిఅనుకుంటూ పార్వతి తన కొడుకుఉయ్యాలప్రక్కని కూచొని తన్నితాను మరచిపోయింది, కాని ఆనాడేదో పార్వతికి హృదయంలో మాత్రం ఆందోళన గాలేకపోలేదు. మనసుపరిపరివిధాలపోయింది. మనస్సెక్కడకో పరిగెత్తుకుపోతూన్నట్టనిపించింది. తనకళ్ళు ఆరనగదిలోని సీతారాములవనవాసంపటంమీదికి, సావిత్రీసత్యవంతుల్లోకి, చివరికి తనవొళ్లోని తనతులసిమీదికి పాకిపోయాయి. ఒకసారిగా ఆతల్లికళ్ళు కడవలైపోయాయి.

"అమ్మా! తల్లీ! ఓతులసీ! నీవే నాకుదిక్కు, నాపసుపుకుంకాల భారంనీది, నాపాతివ్రత్యధర్మఫలం నీఆశీర్వచనం, నాఅయిదోతనం నీకడుపుచలవ, ఏకష్టాలులేకుండా నాసంసారం నీఆధీనంసుమా, నీవే నాదిక్కుసుమా...—ఆఅదరిపాటునడకలు, ఆవిసుగుదలచూపులు, ఆసహించలేని ఆవేదనలు, ఆపలవరింతలు, ఆపిల్లినడకలు, ఆచేతిదురులుపులు, ఆఉలికిపాటుచూపులు,—అమ్మా తులసీ, నాగుండె తరిగిపోస్తున్నాయిసుమా - నా సం సా రా న్నే ఘోరపాతకంలోకి_"

ఇంతలో విశ్వనాధుడు తలుపుతీసుకొచ్చాడు. ఎన్నడులేంది ఏమో పార్వతిశరీరం మంచుగడ్డయిపోయింది. తెల్లబోయిచూచింది. తంగున విశ్వనాధుని దృష్టి ఆకొడుకేసితిరిగింది. ఆనిండునిద్రలోఉన్న కూన ఓచిన్న నవ్వునవ్వాడు. ఎందుకు? తన తండ్రినిచూశా? తల్లినిచూశా? లేక రామన్న సిరిసందలనుచూశా? ఏమో! ఆపసికుంకలోని నిర్మలాత్మకేలిక. కాని విశ్వనాధునికో కుడిభుజంఅదిరింది, కుడికన్నుకదిలింది. కాని గుండెమాత్రం ఘల్లుమంది. అయితే ధైర్యంతో శయ్యచేరాడు. మంత్రించినట్లు నిద్రపోయాడు,

౧౧

రాత్రి పన్నెండుకొట్టింది. చరాచరాలు ఒళ్ళు మరచాయి. ప్రకృతి మౌనాకృతివహించింది. కాని విశ్వనాధుడో మెల్లగా లేచాడు. తలుపుదగ్గరగా

వేశాడు. అడుగులెక్కబెట్టుకుంటూ-పిల్లిలాగ-మూడంగల్లో - మేడమీదికి - అనంతంగదిలోకి చేరాడు.

నిముషంగడిచింది. 'అమ్మో' అని కేక వినిపించింది. పార్వతి తుళ్ళిపడి లేచింది. పిల్లడు నిద్రలో ఏడుస్తున్నాడు. భర్త లేడు. చంకని కుర్రాణ్ణేసుకు ఒక్క అడుగులో గదిలోంచి మేడమీద కురికింది. చిమ్మచీకట్లో వసంతంకొట్టినట్టు భర్తశరీరం తడిసిఉంది. నేత్రాల్లో నెత్తిచూపడింది. పార్వతి కంఠం చుట్టేసుకున్నాడు. పార్వతికళ్ళు చీకట్లు కమ్మిపోతున్నాయి. విశ్వనాథుడు "అమ్మా! రాధా! క్రూరుణ్ణి నేబతకనమ్మాయి" అంటూ ఆకత్తి తనగుండెల్లోకి ధైర్యంతప్పి గురిచూసుకోబోయాడు. చటుక్కున ఆకత్తిని అతనిచేతుల్లోంచి లాక్కుంటూనే పార్వతి నేలకూలిపోయింది. చుట్టుపట్లవాళ్ళు లేచారు. దొడ్డిదార్ని నిముషంలో విశ్వనాథుడు మాయమైపోయాడు. ఇరుగుపొరుగు యిల్లుచుట్టేశారు. తలుపులుతట్టేరు. బద్దలుకొట్టారు. ఉతకలెత్తారు. ఇంట్లోప్రవేశించారు. పోలీసువచ్చారు. శవాన్ని స్వాధీనపరచుకున్నారు. పార్వతిని అరెస్టుచేశారు.

౧౨

కచ్చేరీ కిటకిటలాడిపోతూంది. జనం క్రిక్కిరిసిపోయారు. ప్లీడర్లుబలాబలాలు చూసుకుంటున్నారు. సాక్షుల వాఙ్మూలాలు పూర్తవుతున్నాయి. కేసుబలమైపోతూంది. నేరంమోపైపోయింది. విశ్వనాథుడు పార్వతీ యీఖూనీకి కారణమని తేలింది. కాని విశ్వనాథుడా లేక పార్వతా నిజంగా అనంతాన్ని పొడిచింది అనిప్రశ్న. పార్వతే అనంతాన్ని చంపిందని పబ్లిక్ ప్రాసిక్యూటరువాదన. కాదు విశ్వనాథుడేస్వార్థపరుడై, డబ్బుకోసమని, ఆఅనంతాన్ని, తమ్ముడికొడుకును ఖూనీ చేసెనని ప్లీడరువాదన. ఇద్దరూకలిసే అతన్ని చంపారని జడ్జీతటపటాయింపు. తాను నిర్దోషిననీ పార్వతే కత్తితో అనంతాన్ని పొడవబోతూంటే తానడ్డపడ్డాననీ, వృద్ధుడైనతనను పార్వతే గెంటిపారేసి అనంతాన్ని ఖూనీచేసిందని, ఆరక్తంచిమ్మి తన యిల్లూవళ్ళూ తడవగా పార్వతి తన్నుకూడా చంపుతుందేమోనని భయపడి పారిపోయాననీ ఆపైన తన్నిపోలీసు ఖైదుచేయటంతప్ప తనకు మరేసంగతీ తెలియదనీ నిర్దోషిననీ పార్వతే దోషిఅనీ విశ్వనాథుడు చెప్పాడు.

ఇహమిగిలింది పార్వతివాఙ్మూలం. ఆ పరిస్థితి హృదయభేద్యం. ఎదుట అరదండములతో తనభర్త. చంకని పాలులేక తనతో కారాగృహంలో కృశించి, నీరసించినబిడ్డ. ముందుమృత్యువు. వెనుక తననాథుని మఱచి తనమృత్యువుని నేలతన్ని, మానముడిడి, అనాథయై కొడుకును బానిసచేసి, విధితప్పిజీవింప నాహ్వానమిచ్చుచున్న జీవన్మరణం. పార్వతి నిలువున నీరైన చలువరాతిబొమ్మ. సతీత్వంప్రజ్వరిల్లు కళ్ళతో ఉరికంబములకువ్యాఖ్యాతూన్న త్యాగి. ఆశిలామూర్తి చైతన్యాకృతితో చేమోడ్చి లేచినిలిచింది. కన్గవల లోని కన్నీళ్ళు కడవల-చీల్చి నేలచిమ్మింది. నిరాశ, భ్రాంతి, గద్గద, అనంతానందం ఒక్కసారిగా నామె నావహించాయి. ఇహ మరణామరణములు ఆమె వాగ్ధాటిపై నాధారమయాయి. "నేను దోషిని, అనంతుని మరణమునకు నేను మూలకారణం. నేనుపునాది. నన్నుచంపుడు" అనుమాట లామెనోటినుండి వెలువడ్డాయి. వాఙ్మూలాలు పూర్తయాయి. నేరంమోపయింది. విశ్వనాథుడు నేలచూస్తూ నిలబడ్డాడు. ఇహ జడ్జీ జూరర్లు కూచున్నారు. ఒకరు అవునన్నారు. ఇంకొకరు కాదన్నారు. చివరికి పంజా పచ్చా అనే న్యాయంపై పార్వతి జీవాలాధారపడయాయి. జడ్జీకి తోచిందికాదు. చీట్లేశాడు. "పార్వతిదోషి, చచ్చువరకు ఉరి" అని శాసించాడు. విశ్వనాథుడు కదల్లేదు. అల్లాగేనుంచున్నాడు.

౧౩

నాడు పన్నెండుగంటలకి పార్వతి ఉరితీయబడును. అగ్గిలేక నిప్పులు చెఱుగుతూంది గ్రీష్మపుయెండ. కటికికంకర్రాళ్ళపై పార్వతిని అరదండాల్తో నడిపించుకుపోయారు. ఉరిస్తంభం చేరింది. పార్వతి కడసారి కోరిక ఒకకోరిక. తననాథుడు, విశ్వనాథునిదర్శనం తప్ప మరితరమామె మనస్సులో లేదు. విశ్వనాథుడు నేలచూపుల్తో వచ్చాడు. పార్వతి తన మెళ్ళోని కాసులదండ తననాథుని మెళ్ళోవేసింది. కొడుకుని

కడసారి ఒకముద్దు పెట్టుకుంది. భర్తచంకని జేర్చి, భర్తపాదాలికి నమస్కారంచేసింది. పాదధూళి నొసట నుంచుకుంది. ఉరిస్థంభ మెక్కింది. అంతవరకూ ఎండ దెబ్బకి సొమ్మసిలి నిద్రించుచున్న కుర్రాడులేచాడు. తల్లినిచూశాడు. కాళ్ళుచేతులూ తన్నుకున్నాడు. 'అమ్మా అమ్మా' అనిఏడిచాడు. విశ్వనాథుడు కదల్లేదు. అల్లాగే ఉన్నాడు. మొదటిగంటయింది. తీర్మానం చదవటమయింది. బైబిలుచదవటమయింది. కుర్రాడు గుక్కపట్టాడు. విశ్వనాథుడు కదల్లేదు. అల్లాగేఉన్నాడు. రెండోగంటయింది. పార్వతి ముఖానికి నల్లగుడ్డకట్టారు. ఉరితాళ్ళు సిద్ధంగా లాగిపట్టారు. విశ్వనాథుడు కదల్లేదు అల్లాగేఉన్నాడు. ఘణఘణా పన్నెండుకొట్టారు. తాళ్ళు లాగేశారు. పార్వతి నమస్కారంచేస్తూ ప్రాణంవిడిచింది. కుర్రాడు జారి కిందపడ్డాడు. వివర్ణుడైపోయాడు. విశ్వనాథు డల్లాగే నిలబడిపోయాడు.

# కన్నీరు

శ్రీమతి పైడిమర్రి సీతాదేవిగారు

కవి

ఉవిద! రాలుకరగన్ యేలవిలపించె
దీవు? యొంటివై రేయిని దీనముగను?
బంధుగుల్ లేరె? మిత్రులు బాసిరేమొ?
హృదయకవాటమ్ము తెరచి యాదరమున
నాహృదయతాపమ్ముపో! నాతిచెపుమ!
యువతి! భవదీయరుధిరంబు యుష్ణమయ్యె
ఈ:వోయినస్త్రీవోల వెతనుజెంది;
యేల, నీస్వీకరద్రూపంబు నిట్లు యడవి
గాచువెన్నెలభాతి చేజాచుటమ్మ?

యువతి

ఆర్య! యేమనిపల్కుదునయ్య నాదు
చరిత విన్న నేహృదయంబు కరుగకుండు?
సంఘసంస్కారులెంతేని సాకుగాంద్రు
చెప్పుదురుగాని, యేరుసుచేయరయ్య!
మంచిచెడ్డలనెరుగను మన్ననెరుగ
కష్టసుఖముల గ్రహింపగాను చాల
దీను,నిండగాలేదు పదేండ్లు—నిజము
ధవునిగోల్పోవునాట్కి, యీధరణినిట్లు
యుష్టకష్టములంజెందు యధమురాల!
తరుణినా నాకు సంఘానపరువులేదు

పుణ్యభామినుల్ నన్‌జూచి బొగులుచుంద్రు
ఐహికసౌఖ్యంబు నేనింక యుండబోను
బానిసట్లుహృద్వేదనన్ ప్రమ్గిపోదు
కట్ట! యీఘోరసంఘంబు నెట్టులోర్తు
జీవయాత్రను బంధనల్ చేతగ్రుంగి
నాదుదుఃఖంబు జవిజూచు నాతులిలను
యశ్రుధారలవరుసల, యనయమిట్లు
కార్చి కన్నీటికాల్వచే యార్చితీర్చి
యున్నసౌఖ్యసౌధంబుల నూడ్చివేయ
తగులు మాయుసురందరి దంపతులను.

కవి

భయముబోద్రోలి యెల్లనిబాధ లుపశ
మింపజేసుకోజూతువేని పతితులయి
యున్ననీబోటివారలు యొప్పిదముగ,
గైకొనుడు మీాకిష్టులౌ కాంతులవని.

యువతి

ఏమియదృష్టమోగాని నేను గాంచి
తయ్య—నీయట్టివారల—ననఘ—యెల్ల
కాల మిట్టిపుణ్యపురుషు లేలకాంచ
రాదు కరుణ మాబోటి యువిదల—నెన్న
శోభగాంచదు సంఘంబుసుఖములేక.

## కణ్వుని దుఃఖము

వడ్లమాని అప్పారావుగారు

భవవిమోహమ్ముఁద్రోసి, నేవనములందు
బ్రహ్మవిజ్ఞానసూత్రాన బ్రతుకుచుండ;
నేటి కీవేళ నన్నుకన్నీటిరొదలు
క్రమ్ముకొనివచ్చె యింతదుఃఖమ్ము దేల?
అత్తవారింటి కీమె నేఁడరుగుచున్న
వనమువనమెల్ల సౌఖ్యజీవనముద్రోసి,
యిరులుగ్రమ్మెడి నీలిమొయిళ్లగముల
చచ్చిపోయినదొక నిముసమ్ములోన!
చివురుటాకులకొలువులో శ్రేష్ఠమైన
గీతికావలిపాడెడు కీరసమితి
చదువలేదేమినేడు శాస్త్రమ్ములేవి?
ముద్దుభావాలుగల్గుహృత్పుటలువిచ్చి
ఆలమందలు, కరులు, సింహంపుదొరలు,
చిలుకపడతులు, రాయంచచెలులు, పులులు
యీమె యెడబాటుమాటకేయేడ్చియేడ్చి
పరవశత్వమ్మునొందుచు బ్రతుకలేక;
యీమెపోయెనుత్రోవనే యేగినారు!
తలిరుటాకులవోలెమెత్తనగునీమె
తరుణహృదయమ్ము యటవిలో కరకురాల
జీర్ణమౌనని యెంచి; నాశిష్యసమితి
చేరదీయగ పెంచితి చిన్నదాని.
ఒక్కత్రుటికాలమేను యీయువిదనెపుడు
విడిచియెరుగను, నేఁడీమె వెడలుచున్న
కొండచరియలలోనుండి కూడికూడి
యేరువచ్చెడురీతి కన్నీరుపారె!
ఆకుసందులమొగ్గగా నవతరించి
గాలితాకుననేలపై రాలుపగది,
నాశకుంతల మున్ను కానలతపించు
చిరుతప్రాయమువేళ నశింపకుండ
పెంచికొన్నాఁడ నిన్నాళ్లుప్రియముతోడ.
కనినప్రేమము కానలో కలసిపోవ,
పెంచికొనినట్టి నాకు యీవెలదిపైని
ప్రేమరాగమ్ము మధురమౌ రేకులెత్తి,
పూవుకడుపునదాచు పుప్పొడివిధాన,
దాచుకొన్నది తనలోన తరుణినెపుడు!
పసరుపచ్చికబీడులపైనియాడి,
రెల్లుపూవులమాల ధరించుకొరకు,
నచ్చెలులతోడ పోరాడు నెలతనిపుడె
యౌవనస్త్రీలు చురచురనల్లుకొనియె!
రేకుపా తిళ్లపడి మధురించిపోవు
పూరజమువోలె, వలపులుపొంగిపొరలి
నవ్యరోచిస్సుకురిపించు దివ్యమైన
యౌవనారంభసమయాన నత్తవారి
యిండ్లకేపోవ యత్నింతు రతివలెపుడు.
ఆడుబిడ్డల సుకుమారమైన బ్రతుకు
యత్తవారిండ్లకేపోయి యమరుచుండు!
జననమొందిన పర్వతస్థలమువీడి
పల్లమునసాగిపారు ప్రవాహమట్లు.

గోదావరిమహత్తు; గోదావరిఉపనదులు, వానివివరము; గోదావరితీరము నందలి పుణ్యతీర్థములు, వానిపురాణములు; రాజమహేంద్రవరము, దానిప్రశంస మొదలగువిషయములతో జూలై మాసపు గృహలక్ష్మిసంచిక శ్రీగోదావరీ పుష్కరపుణ్యదినములలో ఆంధ్రుల కరకమలములకు నివేదింపబడును.

# పందిరిక్రింద

బందా కనకలింగేశ్వర రావుగారు బి. యె.

బొత్తిగా లేకనూ పోలేదు. అంత ఒళ్ళుమరచిన భాగ్యమూ కాదు. ఏదో సంసారపక్షంగా కాలం వెళ్ళిపోతున్నది. పెద్దపెద్ద మామిడిచెట్లు, అరటిచెట్లు లేకపోయినా యింటిముందు యింటివెనక తాడిచెట్లు మాత్రము రెండున్నాయి. రెండూ ఆడవే! ఒకటి తాటిపళ్ళు తేగలకు; ఒకటి ముంజకాయలకు;—సరే దీపావళి దివిటీల పొట్లాలకు గులకలేవీ? వెతుక్కోనలసినదే,—సాలలో బండెడ్లజత; ఉత్తరపువైపు దొడ్డిలో పాడిపశువులు. పిల్లికూనలు చెప్పక్కర్లేదు. ఇంటినిండా అవ్వే.

ఇంతకూ, ముఖ్యమైన యింటి మనుష్యులనుగూర్చి చెప్పనేలేదు. మానాన్నకు నలుగురాడపిల్లలు. "మొగముండాకొడుకు ఒకడుకంటే ఎక్కువెందుకు పోనిస్తూ" అనేవాడుట. మాఅమ్మ "ఇద్దరుంటే బాగుండు"ననేదిట. ఒకళ్ళయిష్టంతో కూడిన వ్యాపారంకాదు గదాయిది. మాఅన్నయ్యకు తోడు నేనొకణ్ణి.

ఇప్పటి సంగతులా? ఇప్పటికాలమా? ఎప్పుడో లక్ష్మీదేవి పల్లెటూళ్ళలో కాపురంచేసేటప్పటి మాట. ప్రపంచకమంతా మారిపోయిందిప్పుడు. ముసలితనం చేత, ఏపని చేతగాక, పూర్వప్రసంగతులు నెమరుకు తెచ్చుకుంటూ కాలక్షేపంచేస్తున్నాను. అదే నాకిప్పుడు కాస్తసంతోషం. ఈ ప్రపంచకంలోవున్న నాలుగుగడియలు, అదొక్కటితప్ప నాకు, యింకో సంతోషమేముంది?

ఇల్లు కలకల్లాడుతూవుండేది గంపెడుపిల్లలతోటి. అప్పుడు మా "సత్తెప్ప" ఒక్కతే పెద్దది. ఇద్దరు పిల్లలతల్లి... ఉన్నది పల్లెటూరయినా, మావాళ్ళకి చదువుకొద్దిగా పట్టుబడింది... మధ్యాహ్నమవటం ఆలస్యము. గొడవ యింటినిండాను. "కళావరురాజు, డైమనురాణి" అనికాదు. "ఇంకోయెత్తు; ఆటకట్టు!" అనికాదు. "గోవిందారామ,—గోవిందా" అంటూ సందడిగా ఉండేది. అంటే అది మావాళ్ళదైవప్రార్థనకాదు. "శాంత గోవిందనామాలు" చదువుతూవుండేవాళ్ళు. 'సీతాకల్యాణం, కుశలవులపాట' చదువుతూ ఉండేవారు, అన్నట్టు 'కాళింగిమర్దన' ఒకటి. ఈ పుస్తకాలుతప్ప యింకేమీ ఉండేవికాదు. నేనూ అవ్వేచదవటానికి ప్రయత్నించాను. నడిచేదికాదు. దీర్ఘంతో చదవడానికి సిగ్గేసేది. ఆడవాళ్ళపాటని! చటుక్కున లాక్కునేది శ్యామల చేతులోపుస్తకం; "నీకు నడవ దిలాతే" అంటూను. ఇన్నిసంవత్సరాలయింది, నల్లనివెంట్రుకలన్నీ తెల్లబడ్డాయి! ఆసంగతులు, ఆపందిరిక్రిందివిశేషాలు రంగుమాయవుగదా!

సాధారణంగా వేసవిరోజుల్లో తీసుకొచ్చేవాళ్ళం సత్తెప్పను యింటికి. ఏకోశుభకార్యం ఆరోజుల్లో తటస్థించడంవల్లనో ఏమో? మాఅప్పతోబాటు "కిష్టిగాడు", "అమ్మాణి."

పేరు ఒకటైతేమాత్రం బుద్ధులు ఒకటవాలని ఏశాస్త్రంలోవుంది? నాపేరు సుందరరామయ్య అయితే మట్టుకు నేనందంగా ఉండాలని ఎక్కడున్నది? మాఅప్ప అంతదూరమాలోచించలేదు. ఏదో "కృష్ణమూర్తి' అని నామకరణంచేశారు. కాని అంతటి అల్లరిపిల్లడవుతాడని ఎవరూ అనుకోలేదు. "కిష్టిగాడు", అసాధ్యుడు. అబ్బా ఏమల్లరిచేసేవాడు! తగనల్లరి!

నిజంచెప్పద్దూ, మా పెద్దప్ప వచ్చిందంటే మాకుపండగ. అందులో కిష్టిగాడంటే మరీసంతోషం.—నా పెద్దప్పంటే మాకేకాదు ఊళ్లో అందరికీ మంచిఅభిప్రాయమే. చాలా తెలివిగలదని, పనిపాటలు నేర్చినదని. అది వచ్చిందంటే చినరావమ్మగారు "సత్తెమ్మా, సత్తెమ్మా" అంటూపరుగెత్తుకొచ్చేది. దానికి పనులన్నీ చేతవును. పెత్తనం అంతకంటే బాగాచేతవును. చిన్నపిల్లలను చేరదీసి "అదుపాజ్ఞలలో"నుంచటం తెలుసును. కాని కిష్టిగాడు మట్టుకు లొంగడు. పాటలు చదవటంచేతవునని యివరకే చెప్పితినిగదా; చేతగానిది

ఏదీ లేదు. సంక్రాంతిముగ్గులు అన్నీ వేసేది పందిట్లో. "తప్పాలాబిళ్ళ"లాండటం మాఅమ్మకు నేర్పేది. అయ్యో చిత్రమా! అరుగుకు చుక్కలుసరీగ్గాఉన్నాయో లేదో అది ప్యాసుచెయ్యాలి. అక్కడ దీనిదే ప్రభుత్వమన్నట్టుగావుండేది. నేను మిషనుమీద కుట్టించుకుంటానంటే, అదేకుట్టిపెట్టేది 'మట్టలాగూలు.' "బాగోలేదు ఒదులుగాఉన్నా"యని తగూపెట్టితే కోప్పడేది. మాయింటికొస్తే, ఇంకచద్దికంచాలదగ్గరనుంచి పక్కమంచాల దగ్గిరవరకు,-దంపుడు వడ్లుకొలకటం మొదలు చాకలిదానికి బియ్యంకొలిచేవరకు,—అంతా దాని పెత్తనమే.

* * * *

"పదిమంది మగవాళ్ళకైనా వడ్డించవచ్చునుగాని, ఒక్కపిల్లాడిని అన్నంతినిపించలే"మంటూవుంటారు యింట్లో ఆడవాళ్ళు. మాఅప్ప తెలివితేటలు 'కిష్టిగాడి' ముందు పనికొచ్చేవికావు. పందిట్లో అయిదుకంచాలూ పరిచేవాళ్ళం. వేసంకాలంగదూ. రాత్రిది పప్పుపులుసు, ప్రొద్దుటిది 'ఉల్లిపాయకారం', వెన్నపూసమీగడ. అప్పటివస్తన్నాలు! కాఫీకాచడం అప్పటికి చేతగాదు మాఅప్పకు. తరువాత తరువాత అలవాటయింది. అల్లుళ్ళు నవనాగరికులు,-తమ్ముళ్ళుమట్టుకు తక్కువగనుకనా-అదికాదని యివి, ఇదికాదనిఅది, ప్రాణంవిసిగించేవాడు. కిష్టిగాడు పోట్లాడి యింకాస్తమీగడవేయించుకుంటే నాతో, అనేవాణ్ణి—"మరీమరీ చిన్నవాడవవుతున్నావురా." అనేది అప్ప. నామాట వినబడడంతోనే కవ్వంఆపి మాఅమ్మ వెన్నపూసతెస్తూ "నీఅబ్బాయి నీకు ముద్దు మాఅబ్బాయిమాకు." అంటూమజ్జిగకుండకేసేది. మాఅప్పకొద్దిగా మూతిత్రిప్పేది నవ్వుతోను. అంతా చక్కనవ్వేవాళ్ళము. ఇక తల్లీకూతుళ్ళసరసం. అత్తాకోడళ్ళు గనకయితే ఈమాటలుచాలు పోట్లాటలకు. పిచ్చితల్లులు! మాశ్యామల వాళ్ళుఏమి అల్లరెఱుగరుకదా, మామిడిపండుకు కిష్టిగాడు పోట్లాడితే 'పోనీలే' అని ఊరుకునేవారు. ఎలాపెంచుతున్నారో పిల్లలను, సహజంగా ఆడపిల్ల లుదారస్వభావులు గావును! కాని మళ్ళీ అమ్మాణి అటువంటిదిగాదు. అన్నతోపాటు కజ్జానికి తయారు. "గర్వం అడిచేపిల్లలుపుట్టారు సత్తెమ్మా" అంటూండేది ముసలమ్మ. 'చింతకుపంతకుం చివికిసిగ్గితిత' నన్నట్టు నాకింకవేరే భయమెందుకు, నాకెచ్చట సంతోషము, ఆనందము కలుగుననుకొంటినో అవన్నితిరగేసి చూచితిని. పదువదనములో ఎలావుండేదోగాని యిప్పుడు ప్రణయగాథలు, వింతకథలూ తలనొప్పి. నాకీచిన్నప్పటికథలే ఆనందదాయకములు. తప్పుచేసేదన్నా చేస్తే "మొట్టుమొట్టితే గిద్దెడుమిరియాలురాలాలి"అనేది. ఆనానుడి ఏమిటో అర్థంగాకపోయినా, అభయం ఎప్పుడూ అలాఉంటుంది. రాజభటునిచేతి ఖడ్గమువలె ఆమాటఅలా...ఉయ్యాలలూగుతూనే ఉంటుంది దృష్టిలో. అదే నైతికశాస్త్రపారస్యము నాఉద్దేశ్యంలో.

* * * *

ఆవుపాడికంటె గేదెపాడి ఎక్కువ. మాఅమ్మకు పాడిపిచ్చఎక్కువ. 'కిష్టిగాడి'కి గేదెదూడలతో ఆట యిష్టము. గంగిరెద్దులంటే మరీయిష్టం. గంగిరెద్దులు ఊళ్ళోకొచ్చాయంటే యింక యింటికిరాడు.—కిష్టిగాడు, ఇతరులవలెవాళ్ళు పిలిచినట్టు 'అదెమ్మగారూ' అంటూపిలుస్తాడు. ఆవిడకుగేదెలు మేపడం ఇష్టం. మావాడికి దూడలు పెంచడం.—ఆవిడపని కష్టం. ఉలవలు ఉడకెయ్యాలి, కుడితుంచాలి—మావాడిపని తేలిక. దొంగ చాటున దూడలను ఒదిలేసెయ్యడమే;..."సరేలే ఇవ్వాళ పెరుగు పోసుకుందువుగాని"అని విసుక్కుంటూ వెళ్ళేది ముసలమ్మ.—

'సీతాకల్యాణం' పాట కంఠతావచ్చును మాఅప్పకు. ఆపాటకోసం అరగంటసేపైనా బతిమాలించుకుంటేనేగాని పాడేదిగాదు. అదయినా రాత్రుళ్ళుపాడేదిగాని, పగలుపాడేదికాదు. కుశలాయకం ఎవళ్ళన్నా ఇంటానికి వచ్చినపుడు, వెంకటనరసమ్మగారు చినరామమ్మగారు వచ్చినప్పుడూ పాడేవారు. కాని తెల్లవారు

ఝామున కవ్వముచ్రమోతేగాని పాటలధ్వని ఉండేదికాదు. కాని గుమ్మడుపాట మాఅమ్మ పాడుకుంటూ మజ్జిగ చేసుకునేది. మాఅమ్మకున్నడ పాటలొచ్చును గావును అనుకునేవాణ్ణి.

"గుమ్మడేడే కన్నతల్లీ, గుమ్మడేడమ్మా"

అన్నముక్కలు చెవినిబడితే, ఒక్కొక్కప్పుడు, మాఅప్పలేచి 'కాళింగిమర్దన' పాడేది. ఆచల్ది మాటలు, ఆకృష్ణమూర్తి, ఆయశోదా ఆపాటవింటుంటే చక్కని నిద్రపట్టేది. ఇప్పు డెంతవిచారి స్త్రీనేమి లాభం, చదివిచదివీ రాళ్ళంటిపద్యాలు నోరునెప్పెట్టింది. ఆపాటలు ఎంతమృదువుగా ఉండేవి చెవులకు!– అసలు,–పాటలు వినాలి కాని చదవకూడదు. ఆచదవటమైనా ఆడవాళ్ళు చదువుతుంటేనే వినాలి. ఆకంఠము మగవాడికి తల్లక్రిందైనారాదు.

*  *  *  *

మామూలుగానే అంతాకూర్చున్నాము పందిట్లో,—మాఅప్ప పడుకుని సగంమెలకువలో వింటోంది గోవిందనామాలు. అమ్మాణి శ్రద్ధతో వింటోంది. అమ్మకూర్చుని కునికిపాట్లుపడుతోంది. శ్యామల గోవింద నామాలు చదువుతోంది. నేనేంచేస్తున్నానో జ్ఞాపకంలేదు. 'కిష్టిగాడు' గంగిరెద్దును తయారుచేస్తున్నాడు. గేద్దూడమీద జంబఖానా దుప్పట్లువేసి తయారుజేసి 'ఎద్దొ' నేర్పుతున్నాడు. శ్యామలా, వాళ్ళకి, కిష్టిగాడి అల్లరిమాద్దామంటేనే ఎక్కువయిష్టము–కాని అమ్మ అడ్డముంది. ఆవిడంటే కిష్టిగాడికి చనువు.

శ్యామల... "అప్పుడమా కౌసల్య, గోవిందారామ"
కిష్టిగాడు... "ఆ దెమ్మగారికీ గోవిందారామ
అప్పుల్లు లేవంట గోవిందా..."

"ఆకతాయివాడు వాడితో ఏమిటె చదవండే" అంది అమ్మ.

అంతకంటే చురుగ్గాఉండాలని కిష్టిగాడు

"పాలకుండలోను గోవిందారామ,
మీగడాలేదంట గోవిందా—"

"తిన్నేడుగావును సన్యాసి" అంది, అమ్మ. సత్తెప్పకోక్యం కలుగజేసికొంది. "వాడెక్కడతిన్నాడు. వేడిపాలమీద మీగడ! ఈ తీరి" అన్నది.

"నల్లపిల్లిమూతి గోవిందారామ
తెల్లనై నాదంట గోవిందా"

అని పక్కునవవ్వాడు కిష్టిగాడు. అంతా అటుచూస్తున్నారు. ఇంకేం ఆటసాగించవచ్చు అనుకున్నాడు. అమ్మాణికి చుఱుచుఱుకోపంవచ్చింది. "చిలిపివెధవ" అని మూతితిప్పుకుంటూ అన్నది. మళ్ళీ పండ్లికిలించి

"అమ్మాణిమొగుడికీ గోవిందారామా
అష్టవంకరలంట గోవిందా" అన్నాడు.

"ఫోనీలే" అని విసుక్కుంది అమ్మాణి జడాడిస్తూను.

"అమ్మల్లార! బాబుల్లార! ఎద్దునుసూడండి,
ఎంకటేశుడండీ, మొక్కి తెపున్నముమీరాకండీ"

అంటూ కుడికాలు, ఎడమకాలు ఎత్తిస్తూ ఆడించాడు. "నీకంతేరాతదే" అంది అప్ప... లోపల సంతోషమే.

"గంగిరెద్దుల అబ్బాయికి కాసీని ఒడ్లేసికంబండే" అంది అమ్మ.

శ్యామల:—ఏంగావాలబ్బాయి?

కిష్టి:—నవ్వుతూ—"డబ్బూ ధాన్యంవద్దండీ
పాతవస్త్రములు వద్దండీ
మజ్జిగదాహం వద్దండీ
మామయ్యకూతురు చాలండీ"

అంతా పక్కున నవ్వారు. సత్తెప్పకూడా నవ్వు ఆపుకోలేకపోయింది.

"గంగిరెద్దులాడికి పిల్లనెవరిస్తార్రా" అంటూ మాఅమ్మకూడా నవ్వింది.

రోజులుక్రమంగా మారిపోతుంటాయి. రోజులతోపాటు బుద్ధులుకూడాను. ఒకసమయాన్ని దుర్లభమనుకొన్న ఆశలు, ఇంకొకసమయమందు చేతికందినట్లుంటాయి. ఒకసమయాన్ని చేతికందినఆశలు అంతరిక్షాన్ని అదృశ్యమవుతాయి. ఇప్పు డేమో ఋషీశ్వరుడను. అప్పుడో పెత్తనమంత నాచేతిమీదే నడిచింది. ఇప్పుడంటే ఎక్కడోదూరాన్ని ఒంటరైయైనానుగాని మునుపు ఆకుల్లో మెదలిన పువ్వునే.

పందిళ్ళక్రిందిరోజులన్నీ పచ్చగానే నడిచాయి. ఎంతోకాలంపట్టలేదు. ఎవరిదారిని వాళ్ళే వెళ్ళిపోయారు. ఎవరత్తారిపూరు ఎక్కడో. ఆసంతోషసాగరం పాయలై చీలిపోయింది. చీలిపోయి తేలిపోయింది. మా అమ్మ, ఎన్నాళ్ళని ఉంటుంది. పాడికుండ కప్పగింతలు చెప్పేసింది. అనేకసార్లువెళ్ళాను వాళ్ళవాళ్ళయిళ్ళకు. ఏమిసౌఖ్యం? అందరుకలిసి ఉన్నంతసౌఖ్యం అప్పుడెక్కడిది? పైగా పుట్టిల్లుఅత్తిల్లుఅని భేదమున్నదిగదా. అమ్మాణి పిల్లలతల్లి అయింది. కిష్టిగాడు, అల్లరి బతిమాలినా చేయడంమానేశాడు. శాశ్వతమీసుఖములనుకొన్న నేను మోసపొయ్యాను. ఎవరెక్కడో-ఏవెక్కడో, ఆచిన్ననాటిసంగతులే నాకాధారం...ఆకిష్టిగాడిప్పుడు, ఆలోచనాపరుడు, దీర్ఘాలోచన,—నవ్వు నేనవ్వడు.

నాకు తప్పిందిగాదు సత్తెప్పగారి యింటికివెళ్ళటం ఆపనిమీద. ఏముఖంపెట్టుకువెళ్ళను. మాయింట్లో పందిరెగిరిపోయి యెన్నిరోజులయిందో, పాలకుండపగిలిపోయి ఎన్నిరోజులయిందో. మాసత్తెప్ప అడుగెట్టి ఎన్నిరోజులయిందో—మాటమంతిచెప్పి "అన్నయ్యకూతుర్ని సుందరాన్ని కిష్టిగాడికి—" అని ఊరుకున్నాను. చిక్కముఖమేసుకు ఊరుకుంది. "అమ్మతోనే పుట్టిల్లు అయ్యతోనే-" మాట్లాడదామంటే గొంతుకరాలేదు. "నేనొకవ్యర్థుడనైనాను." అని చిన్నపిల్లాడిలాగ కంటనీరుపెట్టేను.

* * * *

ఆనందమంతా అమ్మవల్ల అప్పవల్ల అనుభవించిన నామనసు చివుక్కుమన్నది. ఇంక ఉండలేకపోయాను నలుగురిలోనూ; ఒకఋషినైతే మంచిదనుకున్నాను. మనస్సునిగ్రహించడం సామాన్యమా...ఎవరిని మఱచిపోగలను? ఏది మఱచిపోగలను? కన్నుతెఱచిన దుఃఖము. కలుసాచిన కలదళము—మానినైతే మంచిదనుకున్నాను. మనస్సులో ఆరోజులు తలచుకుంటూ, ఈమిగిలినరోజులు గడుపుదామనుకుంటున్నాను. కిష్టిగాణ్ణి చూద్దామా? అమ్మాణ్ణిచూద్దామా, శ్యామలను చూద్దామా? అమ్మనుకలుసుకుందామా? పందిట్లో అల్లాగే నిద్రపోదునో?

## శ్మశాన వైరాగ్యము

శ్రీమతి పట్టిసపు సీతమ్మ గారు

బ్రతికెడి రెండురోజులను బాములనెన్నొ సహించి తిండికై
సతతము పొట్టచేతనిడి సత్యమువీడి పరిభ్రమించి యే
కతముననో రహస్యముగ కాలముఁ ద్రోయుచునుండి యింతలో
మృతి కెరయాచునుండు తనువేల సృజించితివో పరాత్పరా!
ఉసురులఁబాయువెన్క క్షణముండఁగఁజాలని పాడుబొంద ము
న్నసమములై సభోగములనంది జరీముసువ్రుల్ ధరించి లే
దు సమమటంచు వినాసములదువ్వుచు క్రిందునుమీదుగానక
న్మసలిన దేకదా ఇయిపుడు ప్రుగ్గిన వెన్కను కన్నవారికే
విసమయిపోయె నిట్టితనువేల సృజించితివో పరాత్పరా!
పదములఁబొడుకొంచు తెలిపట్టులపాన్పులపై పరుండి లో
ముదమునఁ బ్రేయసింగదిసి మోహసముద్రమునందు మున్గి సం
పదగలదంచు నీల్గి తృణమైనను సర్థులకీక యెప్పుడో
పదపదమంచు మృత్యుపరివారము జుట్టునువట్టి యీడ్వఁగా
బెదరిసశించు నీతనువు భీకరరూపమదేల దైవమా!
మనసగుచున్నఁ బల్కుడుసుమా! అటుకన్నులు మూతవడ్డ వె
న్కను తనభార్యపిల్లలు ననాథుల మమ్ముల వీడిపోవ నీ
కనువగునా యటంచు నలకట్టువయింబడి యేడ్చుచుండినన్
వినదు చలింప దిట్టితనువేల సృజించితివో పరాత్పరా!
పుట్టిననాటనుండి తలపున్ వలపున్విడనాడలేని యీ
మట్టిశరీరమం దసువు మాయముకాగనె కాటిలోపలన్
పుట్టెడుపుల్లలందునిచి బుగ్గియొనర్చుటకక్కరౌను యిం
కెట్టులనమ్మ నీతనువులేల సృజించితివో పరాత్పరా!
ఎమ్ములపంజరమ్ము సృజియించియు ముందుగదానిలోన జీ
వమ్మను శారికన్నిలిపి పల్కులనేర్పలరంగఁ జేయుచున్
ఇమ్ముగనాటపాటలను నేర్పియు నేమిరెఱుంగనట్లు నే
మమ్ముగగూరుచుండ దవమానుషరీతిని యొక్కచో రహ
స్యమ్ముగ మిత్తిపిల్లి పడిచంపెడుఁ గానవదేమి దైవమా!
పటుతరయత్నముల్ సలిపి పాపపుచింతలలో మునింగి యు
త్కటమగుఘోరకార్యమునకై యొడిఁగట్టియు మానునాళ్లము

చ్ఛటకయి పొంగిపొర్లగిలి చచ్చెడిదాక పెనంగులాడు నీ
కుటిలశరీరమింత సమకూర్చెదు వేటికి మాయదైవమా!
ఇదియొక శాశ్వతంబనుచు నెంచి సృజించితొ? లేక సృష్టినే
ర్పొదవు నటంచుఁ జేసితివొ? పూజ్యత గల్గు నటంచొ నర్చితో?
సదమలమైన నాయెడఁద సంశయపంకిలగర్హమయ్యె బు
ద్బుదములమాడ్కి నున్న తనువుల్ సృజియింపఁగ నేల దైవమా!

## హింస

శ్రీమతి కల్వాల పార్వతి గారు

పచ్చనిగడ్డింత నచ్చినజలమింత తల్లిపాలునుగొంత తనకుగలుగ
గ్రుడ్డులోఁగనరాక గూటిలోఁజనలేక మాతమేతలె సుంతప్రీతి సేయ
ఆకుబురదపుట్టు కాపాచిపొట్ట కల్లాడు జీవనమె కాపాడుచుండ
భూనభోంతరజలంబుల సుఖించు సాధుజీవులఁబట్టి చావఁగొట్టి
పొట్టలోఁబెట్టికొంటివో బోయ! నీదు కటికిగుండెలనీరింత కంటె లేదు
ఆత్మవత్సర్వభూతానియన్న మాట చెవులబడలేద! యీతుచ్ఛజీవమేల?
మాయాదికర్త సమ్మతిలోకమునకిచ్చు స్వాతంత్ర్యలక్ష్మి నివాళియదిగో
మాబుద్ధముని రేపుమాపు లహింసయన్ శ్యామధాన్యము మేపు ప్రేమయదిగో
మాజైనగురువులు మాటికి జీవామృతము ద్రావు కరుణార్ద్రతత్త్వమదిగో
మాదయాహృదయముల మానసమున నుబ్బు శీతలమధురిమాశ్స్నెయదిగో
తలఁగిపోవుచుండెఁ దలద్రిప్పుకొనలేక కటికిచేతికలుకు కత్తినఁజమ
పాపిగుండెలేల పక్కనవసులవో మేమెయనుచు మేకపిల్లతోడ.

## అబ్జము

యం. వేంకటరావుగారు

ప్రణయసూత్రమునకుగ్రుచ్చి పాటఁబాడి
కవికుమారుఁడు కబ్బంపుఁగన్నెయురుత
మాలగావైచుటకు నెంతొ మనసుపడును
అబ్జమా! నీయపూర్వమహత్వమేమొ!
జీవనప్రదమమ్మునకు లక్ష్మియనఁజెల్లు
గృహిణిలేమిఁ గళంకమౌ గృహమువోలె
నబ్జమా! నీవు లేనిజలాశయమ్ము
నిఖిలశోభాకళంకమౌ నిక్కవమ్ము.
అతులమోహంపుటమృతమయుంబ నీవు
కానిచోఁ జదలదివిజాంగనలు పాడు

హృద్యమై శ్రోత్రపుటములకింపొసంగు
గానమెట్లబ్బె షట్పదగాయకునకు?
మెల్లమెల్లఁగవీచు తెమ్మెరలఁగూడి
తరలుచున్న లేయలలమొత్తములనఁజమఁ
దీవ్రతరమగునట్టి మౌనవ్రతమ్ము
తాల్చియొందున కీయుగ్రతపమొనర్తు?
మ్రోఁగు వీచీనినాదంపుశ్రుతిని గలసి
భ్రమరములు దివ్యగీతాలు పఠనసేయ
నాజలాశయరంగమధ్యమున నిలిచి
నృత్యమొనరించెదవు బిసినీలతాంగి!

# ప్రేమ

శ్రీమతి వై. వీరమ్మగారు

ప్రేమయనెడి యుత్కృష్టాంశము ప్రపంచము నేలుచున్నది. ప్రేమయొక్క మహత్తరస్వభావమిట్టిదని చెప్పుట కెవ్వనితరము? లోకములో ప్రేమ సర్వోత్కృష్టమైనది. సర్వజనహృదయకమలనివాసి. లోకమంతయు ప్రేమపూరితమైయున్నది. కాని యిదియన్నియెడల నొక్కటిగా లేదు. పితృలకు సంతానముపైగల ప్రేమ వేరు. అన్నదమ్ములకు అక్కచెల్లెండ్రకుగల యన్యోన్యప్రేమ వేరు. అధికారికి సేవకునియందున్న ప్రేమ వేరు. మార్గదర్శకులగు దంపతుల ప్రేమ వేరు. వస్తువొక్కటేయైనను స్థానములనుబట్టి మార్పుచెందుచున్నది. ఇప్పుడు మనము చర్చింపతలంచినది దంపతుల ప్రేమనుగురించి.

ఇక్కాలమున పెక్కండ్రు నిర్మల ప్రేమకు మోహమునకుంగల భేదభావముం దెలియజాలక ప్రేమను మోహముగా మార్చుచున్నారు. మోహము, కామము దగ్గరబంధువులు. మోహమునకు, కామమునకు కడలేదు. వీటినియాశ్రయించుకొన్న వారికి కష్టములకేమియు కొరతలేదు. ఇది యాశాపాశమువలె కామాంధులను తమ పాశముచే బంధించి యీడ్చుకపోయిపోయి కష్టాంబుధిమధ్య బారవైచును. ఇంతకుపూర్వము మోహడోలికలదూగులాడుచున్న కామాంధులు కన్నులు దెరచి తమచింతాసాగరమునకు కారణం బేదియో యప్పుడు దెలుసుకొందురు. కష్టములువచ్చినప్పుడుగదా కన్నులు గనబడుట. అప్పుడు వారు మొదటనుండియు పోషింపుచున్నది నిర్మలమైన ప్రేమా? లేక మోసమా; మోసమునకు మూలాధారమేది? మోహముయనియు, మోహాంధులమగుటచే నిట్టియిడుములపాలైతిమని తప్పక తెలిసికొందురు. నిర్మలమైన ప్రేమమార్గదర్శకులగు వధూవరులమధ్య శుక్లపక్షశీతభానునింబోలి దినదినప్రవర్ధమానముగాంచును. మధ్య యెన్నియంతరాయములువచ్చినను ఈ ప్రేమలత పెరుగుచు నేయుండును. దీనికి చంచలస్వభావము లేదు. మోహమట్లు గాదు. తొలుత యున్నతదశనొంది పిమ్మట బహుళపక్షచంద్రునింబోలె క్షీణించిపోవును. నీటిపైబుడగకు దీనికి భేదమేమాత్రము లేదు. కామము కష్టములతో గూడుకొనియున్నది. దీనివలనగలుగు చెరుపుల నెవ్వరు చెప్పగలరు? స్వర్గాధిపతియగు ఇంద్రుడు శపింపబడెను. అతనిపై మోహంబుగలిన మహాఋషిపత్నియగు అహల్య శిలయగునట్లు శపింపబడినది. తారాశశాంకులు పాపఫలమనుభవించిరి. మోహాంధులు తత్ఫలంబు అనుభవింపక తప్పించుకొన్న వారొక్కరున్నూ లేరు. కావున ఇట్టివారల ప్రేమ నిర్మల ప్రేమయగునా? కామాంధుల కది ప్రథమమున ప్రేమగా నే కన్పించును. పిమ్మట రాను రాను తద్వ్యతిరేకముగా పరిణమించును. మోహము కామాంధులకు బాహ్యమునకుమాత్రము ప్రేమవలె గాన్పించును. కాని యదార్థముగా నాంతరంగికముగా నది మోహము.

ప్రేమకు, కామానురాగమునకు నింకొక భేదాగలదు. సతి, పతి గౌరవపరిపూర్ణ, వేరొకవ్యక్తియందు చిత్తము ప్రసరింపనోపదు. సత్యభామకు శ్రీకృష్ణునితో సమానగౌరవతుల్యుడు లేనట్లు సతికి పతితుల్యుడు జగతిలేడు. మొట్టమొదట యెచ్చట ప్రసరించినదో, దేనినాకర్షించినదో, దేనిచేనాకర్షింపబడినదో, దానినుండి యానిర్మల ప్రేమ మరలదు. ఎన్నికష్టములువచ్చినను అవ్యక్తిని వీడదు. నలదమయంతుల ప్రేమ యిట్టిది. సీతారాముల ప్రేమ యిట్టిది. రాణీసంయుక్త, పృథ్వీరాజుల ప్రేమయిట్టిది. సుమతికి తనపతిపై ప్రేమ యిట్టిది. చూచితిరా! ఎన్నియవాంతరములువచ్చినను వారి ప్రేమకు అణుమాత్రమైనను చలనముకలిగినదేమో? ఎన్నికష్టములువచ్చినను వారి ప్రేమను విడదీయగలిగెనా? లేదు. ఎందువలన? ఆ ప్రేమ నిర్మలమగుటచేత. వారు ప్రేమబద్ధులైనారుకాని, మోహబద్ధులుకాలేదు. కామానురాగము పరముఖాపేక్ష. ఇతరులు తనపై వలపుగొనకున్న యిది యుద్దీప్తినొందజాలదు. కావున ఇది కష్టసమ్మిశ్రమము. దీనికి లోకమే తార్కాణము.

ప్రేమనుగురించి కొంతమందియభిప్రాయము చక్కనిముఖము, కన్నులు, చెవులుగల్గి తాత, తండ్రులు సంపాదించిన ధనమేమైనయున్నచో దానిని హెచ్చించి, రంగురంగుల దుస్తులనుధరించి, డాబుసరిగా బజారులలోతిరుగువారే ప్రేమింపబడుదురని. వేషభాషలన్నియు బాహ్యసంబంధమైనవి. ఇవియంతయు వ్యామోహమునకు మూలసూత్రము. మోసముగలచోట నిర్మలమైనప్రేమ నిండునున్నా. నిర్మలమగుప్రేమగూడ వ్యామోహమువలన వికృతాకారము నొందుచున్నది. కావున ఇప్పుడు మోహమునకు ప్రేమకుగల తారతమ్యము, మోహమువలనగలుగు అనర్థములను కొంతవరకు నిరూపించితిమి. ఇంకను నిర్మలప్రేమస్వభావము కొంతవరకు విలకింతుము. ప్రేమ యదృశ్యమైనది. అయినను లోకములోని మహత్తరమైనశక్తులన్నిటికి ప్రేమయెదుట నిలువనీడరైనను లేదు. ప్రేమ లోకము నేలుచున్నది. ప్రేమలేనిచోట శాంతిలేదు. ప్రేమయొక్క నిర్వచనము గూర్చి యొకకవి యిట్లుచెప్పియున్నాడు. "ఎంతో అందముగలదానివనియు గాదు, యుత్తమవంశమునందు బుట్టినదానివనియుగాదు, ఎంతో ధనికురాలవనియుగాదు, విద్యాసంపన్నురాలవనియుగాదు, ఊరకే ప్రేమకొరకు నిన్నుప్రేమించితిని."

కొందరు ధనమునుగూర్చి కోటీశ్వరుని ప్రేమింతురు. వానిని కడుభక్తివినయవిధేయతగా సేవింతురు. ఇదియంతయు వానివ్యక్తికి సంబంధించినదిగాదు. వానిధనమునకు సంబంధించినది. కాని వానిధనమునకు హానికలిగినవాడే యువియన్నియు వానినుండితొలగిపోవును. కావున ఇచ్చట ఇదిగూడ నిర్మలప్రేమగాదు. నిర్మలప్రేమస్వభావము సుఖములనిచ్చునాడు కూడియుండుటయు, కష్టములనిచ్చునాడు వీడిపోవుటయుగాదు. ప్రేమకు పాత్రుడగునతడు కడుహీనస్థితియందున్నను వానిప్రియురాలు వానిని ప్రేమింపవలయును.

ఈక్రిందికథ ప్రేమయొక్క నిర్మలస్వభావమును బయలుపరచుచున్నది. ఒకపట్టణమందొకబీదకాపువాడుండెను. ఇతనికి కుంటిది, వికృతాకారముగల యొకభార్యయుండెను. ఇతను కడుబీదవాడగుటచే, పట్టణసమీపమునయున్న యడవికిజని యందు కట్టెలుగొట్టుకొనివచ్చి విక్రయించి, దానివల్ల జీవనము చేయుచుండెను. వీరుచూచుటకు పైకెంత వికృతాకారులో వీరిహృదయములంత నిష్కళంకమైనవి. మల్లెపువ్వంటిమనస్సుగలవారగుటచేత, వీరు ఒకరినొకరు గాఢముగా ప్రేమించుచుండిరి. వీరికాపురము చాలగుట్టుగాజరుగుచుండెనట. లోకములోనిశాంతియంతయు, జగతియందలియానందమంతయు నీదంపతులచెంత కాపురము చేయుచుండెను.

ఇందుకు కారణమేమోయని పట్టణములోనిపౌరులందరు తహతహపడుచుండిరి. ఇదియంతయుజూచి, యాపట్టణపురాజు యాదంపతులనిర్మలప్రేమను పరీక్షింపదలంచి యొక్కనాడు యాబీదవానినిబిలిపించి "ఓయీ, నీవీ సుందరియగువేశ్యను, యీరూకలసంచినిదీసికొని ఈవికృతరూపిణియు, కుంటిదియగు నీభార్యను వదలివేయుమని" చెప్ప అందులకాబీదవాడు, "ఓయయ్యా! తమరు ప్రభువులు. మీరిట్లుచెప్పతగునా? అమాయకురాలగు నాభార్యనువదలి, మాయలమారి యీవెలయాలినిజేకొమ్మనుట యిదెక్కటిన్యాయము? నాభార్యవలన నేను సమస్తసుఖములనుబడయుచుంటిని. కాపురములో కష్టములెట్టివో యెరుగను. కావున నాకీవేశ్యయక్కరలేదు. మీధనముయక్కరలేదని యాకాపువాడుచెప్పెను. మరియొకనాడు భర్త యూరిలేనిసమయమున యాకాపువానిభార్యనుబిలిపించి "నీవు కుంటిదానవు. కట్టెలమ్ముకుజీవించువానికి భార్యవగుటకెట్లు సమ్మతించితివి? ఇట్టినీచవృత్తితో జీవనము చేయువానితో కాపురముచేయుట మంచిదికాదు. కావున వానిని వదలిపెట్టి యీధనమునుగొనిపొమ్మని" రాజు చెప్పగా, "నాభర్తయు నేనును సంతోషముగాజీవించుచుంటిమి. నాభర్తవల్ల సమస్తసుఖములనుబొందుచుంటిని. మాయిరువురిలోన ఎవరిని ఎవరువదలినను దుఃఖముతప్ప శాంతియుండదని" యా పేదరాలుబలుక రాజుసంతోషించి యాబీదదంపతులకు ధనమిచ్చి యాదరించెను.

కావున నిర్మలప్రేమ స్వభావమును, దానిలాభములను మాచదువరులు గ్రహింతురుగాక.

# శారద లేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు.—

నెచ్చెలీ! నాజాగునకు నీవు క్షమింతువు, నీయాలస్యమునకు నేను హర్షింతును. మన కొండొరులపై గల ప్రగాఢప్రేమసౌహార్దము లొకరిలోపము నొకరికి తెలియనీయకపోవచ్చును. ఒకరి మందమతితనము ఒకరికి హితకరముగానే యుండవచ్చును. కాని యితరుల కది యింపుగానుండునా? దొంగలుబడ్డ ఆఱునెలలకు కుక్కలుమొఱిగెనన్న సామ్యముగా ఎప్పుడో కార్తికమాసములోజరిగిన మహిళాసభ సందర్భమున మేముగావించిన అమరావతీయాత్రను గూర్చి నీవిప్పుడు ప్రశ్నించుటయు నేను చెప్పుటయు నగుబాటుగాక మఱేమి? అయితే నీవలెనే నాయాలస్యమునకు మాగృహలక్ష్మీపాఠకులుగూడ బాగుగా నలవాటుపడినవారగుటచే నేను జవాబువ్రాయుటకు శంకింపకున్నాను. మఱియు ప్రాతదైనమాత్రమున బంగారమునకెట్లు విలువతగ్గదో అదేవిధమున మాఅమరావతీప్రయాణసమాచారము కాలముగడచినను వినదగినదేయగుట—వివరింపదగినదేయగుట నీమాటత్రోసివేయక తెలియబఱచుచున్నాను; వినుము.

అయిదవాంధ్రరాష్ట్రీయమహిళాసభ ఆసాయంత్రముతోసరి. రాత్రికి అధ్యక్షురాలి యొక్కయు, ప్రతినిధులయొక్కయు గౌరవార్థము ఆహ్వానసంఘమువారి ప్రత్యేకపు బువ్వము బంతి. అంతవఱకు మహాసభకుదావలమై మహిళామణుల గంభీరోపన్యాసములచే ప్రతిధ్వనించిన ఆటౌనుహైస్కూలు మేడమీది పెద్దసావడి అంతలో భోజనశాలయైపోయినది. ఆంధ్రజననీకంఠసీమ నలంకరించుటకై ఆహ్వానసంఘమువారు కూర్చిన విదుషీమణిహారముగాని అవి భోజనపుపంక్తులుగావు. ఆపంక్తులలో వెల్లివిరిసిన ఉత్సాహము ఆనందము, ఆమణిహారములోని తళతళలుగాని భక్ష్యభోజ్యములగడబిడలుగావు. వానిని కన్నులారగాంచుటచే నెట్టిసంతోషముగల్గెనో అది అనుభవైకవేద్యముగాని వివరింపదగినదికాదు. తినుట కంటెకనుటకు, కనుటకంటెవినుటకు నేను ముందంటె నేను ముందని పోటీలుపడి తనిసినవి శ్రవణేంద్రియనేత్రేంద్రియములు. నీరసముల కక్కడతావులేదు. భోజ్యములారసమయములు! పాటలా రసమయములు! భాషణంబులా రసమయములు! కలకంఠకంఠనినదమునుతిరస్కరించు మనోజ్ఞమంజులమధురస్వరంబున నొక్కడ జాతీయగీతములు, నేఱొక్కడ భరతమాతృగేయము, ఇంకొక్కడ భావగీతములు! మఱియింకొక్కడ సంస్కృతశ్లోకములు! అహో! ఏవివాహపువేడుక కందఱువిదుషీమణుల సమాగమము సంభవించును? ఏవిందునందట్టి మనోజ్ఞమధురగేయములు వీనులవిందుసేయును? నిజముగా నేత్రపర్వము! కర్ణపేయము! హృదయాహ్లాదకర మాదృశ్యము. సరి. సరి. మీఅమరావతీయాత్రకును ఆహ్వానసంఘము వారి విందునకును నేమి సంబంధము? విందుజ్ఞప్తికివచ్చుటచే విషయము మఱచిపోయినదా

యేమి శారద యని నవ్వుచున్నావా? కల్పలతా! పొరబాటుపడకు. విందునకు పూర్వాపర సంభాషణలలోను, విందుగుడుచుచున్నప్పుడును నిశ్చయమైనది మాఅమరావతీయాత్ర. కాన నిది పీర్లపండుగకును గోకులాష్టమికినిమునిగాదు. సంబంధసమాచారమే, తెల్లవారితే ఆగుంటూరిలో వోట్లపండుగ. కాన ఆరాత్రి మేము మాబసకువచ్చుటకు ఒక ఒంటెద్దుబండివాని నడుగగా ఆఅణాలు బాడుగీయుడనెను. నిన్నను, మొన్నను బేడకు అణాన్నరకు మేముమేమని అడ్డఅడ్డములువచ్చితిరే నేడేల యీగిరాకీ అని అడుగగా రేపు యీ ఊరిలో మ్యునిసిపల్ యెలెక్షనండీ అనెను. వోట్ల ఆరాటపోరాటములు ప్రసాదించిన శ్వేతసీమ వారు మోటారుబండ్లనుగూడ అనుగ్రహించియే యున్నారుగదా. ఆవడిదుడుకుల కవియే తగునుగాని మీబక్కెద్దుబండ్లెందుకని మేమంటిమి. అవునండీ అవన్నీ ఆపనిమీద తిరుగుతుంటే మాకీనాడే పావలాడబ్బులు పెచ్చొచ్చేది అన్నాడు. అవును నిజమే. ఈసీమమోటుబండ్లు నాటుబండ్లవాండ్లకూటిలో నెట్లుదుమ్ముపోసినదీ మనముచూచుచున్న విషయమగుటచేత ఆబండివాడడిగిన బాడుగయిచ్చి బసకువెళ్ళితిమి. కాని ఊరిలోనిబస్సులు, కారులు, జట్కాలు అన్నిటిని అభ్యర్థులు కంట్రాక్టు తీసికొనినచో అమరావతీప్రయాణ మెట్లుసాగునా యని మనసులో ఆందోళనగానేయుండెను.

రేయిగడచినది. వేగుబోకలేచి ప్రాతఃకృత్యములు నిర్వర్తించుకొని సత్వరమే సభాప్రదేశమునకరుదెంచితిమి. అప్పటికప్పుడే ఆహ్వానసంఘమువారు తయారుచేయించియుంచిన కాఫీ, ఉప్మా, యిడ్లీ మున్నగు ఉదయకాలపుఅల్పాహారములు ప్రతినిధులకొఱకు యెదురుజూచుచుండెను. ఇష్టమైనవారు వానిని స్వీకరించినవెనుక యెల్లరము ఆమేడవసారాలోజేరి దొరకునో దొరకదో అనుకొనుచు బస్సుకొఱకు నిరీక్షించుచుంటిమి. కాని సభారంభము నుండి తుదివఱకును రక్షకభటులను నిజమైనరక్షకభటులనుగా జేసికొని వారి పరిపూర్ణసహాయమును బడసిన ఆహ్వానసంఘమువారికి ప్రతినిధుల కొఱకబస్సును సమకూర్చుటకు యెక్కువశ్రమ కలుగలేదు. ఆపోలీసుభటులు యెక్కడికివెళ్ళిరో యెట్లుతెచ్చిరో తెలియలేదు. దాదాపు 7 గంటలకొఱకబస్సునుతెచ్చిరి. బస్సులోయెక్కినది యిరువదియిద్దరమని జ్ఞాపకము. గుంటూరునగరసరిహద్దులనుదాటినవెనుక చిన్నపెద్దరాతిబండలు తప్ప బాటకిరుదెసల చూడదగినవేమియు కన్పింపమిచే మాదృష్టులుబాటనుండి మాసహయాత్రికులతో భాషించుదెసకుమరలెను. మేమెట్లు వివిధప్రాంతములకు జెందినవారమో అటులనే మాప్రసంగములు గూడ వివిధములుగానుండెను. నేను మధ్యచెక్కపై గూర్చుంటిని. నాకు వెనుకనున్న చెక్కపై వచ్చేసభను బళ్లారి కాహ్వానించిన డాక్టరు లక్ష్మీదేవిగారు కూర్చుండిరి. కాన అచ్చటివారి మాటలన్నియు రాబోవుసభకు సంబంధించినవిగనేయుండెను. ఏమండోయి ఈమారు మీబళ్ళారివచ్చి మీపులుసు ఒంగదీస్తాము సిద్ధంగాఉండండని ఒకరు, వస్తాము గాని వస్తే మాకేమివిశేషాలు చూపిస్తారని మఱొకరు, ఆ, యేమివెళ్ళుతామోయేమో,

అంతదూరమని యెంచకొరు, దూరమైతేనేమి నేను నెలరోజులు సభకలదనగానే వచ్చి మీకు సర్వవిధముల సహాయముజేస్తామని వేలకొలది ఈవిధముగా తలయొకవిధముగా పలుకుచుండ మీరుచెప్పినంతఅధికముగావచ్చిన మాకెంతసంతోషమనీ, దూరమంటారేమిటి నేను రావడము లేదా? అనీ, మాబళ్ళారిసభకు వచ్చినవారికి మండిగలతో భోజనముపెట్టి హంపీ శిథిలము చూపిస్తామనీ, మాప్రాంతపుస్త్రీలలో బొత్తిగా చలనములేదుగాబట్టి మీరుముందుగావచ్చి తోడ్పడితే మరీసంతోషమనీ, లక్ష్మీదేవిగారు వారికి వేర్వేరుగా ప్రత్యుత్తరములొసగు చుండిరి.

ఇక మాబల్లమీద రాజమండ్రివారగు భాస్కరమ్మగారు మున్నగువారు గూర్చుం డుటచే మాసంభాషణలు వారికత్యంతప్రీతికరములగు సాంఘికములుగానుండెను. వితంతు వివాహము, శారదాచట్టము, వైధవ్యబాధలు మున్నగువిషయములెన్నియో ప్రస్తావనలోకి వచ్చెను. "భర్త మరణానంతరము పదియవనాడు మనసంఘములో స్త్రీకిజరిగే శిక్ష మహా దారుణమైనదండీ, భర్తపోయిన నాటికంటె అనాడు ఆస్త్రీయు ఆమెబంధువర్గముగూడ మహా ఘోరముగా విలపింతురు. వినుటకు కనుటకు దుస్సహమైనస్థితి అది"యని భాస్కరమ్మగారు మిక్కిలివిచారకరముగా బల్కిరి. అవునవును దీనిలో ఏకొంచెముశిక్షతగ్గినను మన స్త్రీలే వారి నాక్షేపింతురు, ఉదాసీనపఱతురు. శిరోముండనమువఱకు జరిగినగాని వారిఆక్షేపణలకు గురికాకుండనుండరు అనుచు కొలదిదినములక్రిందట మాగ్రామములో శీలవతియగు నొక యున్నతోద్యోగిభార్య శిరోజములుతీయించుకొననిమాత్రమున ఆమెకుకలిగిన అవమాన మును ఆమెపడినమాటలను నేను వివరించితిని. అవును భర్తచనిపోయిన తరువాత ఆస్త్రీ ఎంత పూజ్యురాలైనను యెందుకుకొరగాకుండపోవుచున్నదని అన్నపూర్ణమ్మగారనిరి. ఈవిధ ముగా ప్రారంభమైన మాసంభాషణలు క్రమముగా కడచినదినము సాంఘికసభలో జరిగిన చర్చలు తీర్మానములు మున్నగు వానిలోనికి దిగిపోయెను. మాప్రసంగములిట్లుండ మాకు ముందుప్రక్క బల్లమీదగూర్చుండిన శ్యామలాంబగారు నిరంతరప్రచారకార్యక్రమము నందు వారి జిహ్వాగ్రంబుపై తాండవించెడి జాతీయగీతములు సన్నసన్నగాపాడుచుండిరి. మఱి కొంద ఱిట్టిప్రసంగపు గొడవలలోబడక బాటకిరుప్రక్కల కలయచూచుచు అన్నీకొండరాళ్లే! ఎక్కడనూ పచ్చనిపొలమే కన్పడదేమి అనుకొనుచుండిరి. మే మిట్లు వివిధప్రసంగములలో మునిగియుండ అయిదాఱుమైళ్ళుగడచి నిడుముక్కల యనుగ్రామము సమీపించునప్పటికి తపతప బడబడ టాప్ టీప్ బుఱ్ఱుబుఱ్ఱు, మని నానాధ్వనులుచేసి మాబస్ బుస్సునఆగిపోయి నది. నడపుటకు మరలుత్రిప్పిన మొఱ్ఱోమని కూతలుపెట్టును గాని ముందుకుసాగదు. ఇక చేయవలసినదేమి? అందరము బిలబిలమని బండిదిగి రోడ్డుకుప్రక్కగా నున్న చింతచెట్టు క్రిందికిచేరితిమి. బండికిముందున్న రెండుచక్రములూడబెరికి సారథి బండిమరమ్మతు కుపక్ర మించెను. మధ్యేమార్గమున బండిచెడినచో ప్రయాణికులు పడేపాట్లు ఇప్పుడు మోటారు

బండ్లలో ప్రయాణముచేయువారి కెల్లరకువేద్యమే. అది గ్రామసమీపముగాని నిర్జనప్రదేశమైనచో మేమును అట్టిపాట్లకు లోనుగావలసివచ్చెడిదేమో, కాని యెత్తునుంచి పడినను పూలపాన్పుపై బడినట్లు మోటారుచెడినను అది గ్రామపరిసరమగుట విసుగుదలలేకుండ మేము మఱియొక యుత్సాహకరమగు కార్యక్రమమును నడపుటకు వీలయ్యెను. గ్రామములోనికి యేక్రొత్తవారువచ్చినను చుట్టు తండోపతండములుగ మూగుటకలవాటుపడిన గ్రామజనులు నాగరిక వేషభాషలలోనున్న యీవింతవారిని జూచుటకప్పుడే చాలమంది పోగైరి. ప్రచారకార్యక్రమమునందు నారితేరి జనపదములలో సంచరించి జానపదుల కష్టసుఖముల నారయువిధము చక్కనెరిగియున్న ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు మాకంటెముందుగా వారిచెంతజేరి మీరేకులస్థులు? మీవృత్తియేమి? మీయూళ్ళో ముఖ్యమగు పంటయేమి? మీకు రాటములున్నవా? మీయూరిలో పండెడిప్రత్తి నేమిచేసెదరు? మీగుడ్డలనూలు సీమనూలేనా? వ్యవసాయపుపనులు లేనప్పుడు మీరేమిచేసెదరు? మీకు కూలి ధాన్యరూపకమా? ధనరూపకమా? అని ప్రశ్నలువేయదొడంగిరి. ఇంతలో మేముగూడ ఆమెనుకలిసికొని ఆమె వేయుప్రశ్నలను వారిచ్చెడిజబాబులను వినుచు మాకుదోచినవి మేముగూడ అడుగుచు, మీరుయెవరు? ఏవూరుమీది? ఎందుకొచ్చారు? ఎక్కడికివెళ్ళుచున్నారు? అని యెడతెగక గ్రామీణులువేయు ప్రశ్నాపరంపరలకు ప్రత్యుత్తరములొసంగుచు నిలువబడితిమి. ఇంతలో డాక్టరు లక్ష్మీదేవిగారువచ్చి ఆబండి యిప్పుడు బాగుపడునట్లులేదు. అదిబాగగులోపల నొక్కమారు గ్రామముచుట్టివత్తము రండని యెల్లరప్రోత్సహించిరి. సరేయనసరేయని అందఱము బయలుదేరితిమి. రాజాలనివారును, రానిష్టములేనివారును యేమువ్వురు నలుగురో దిగబడిరి. మాటలలో అరితేరినవోళ్ళు, పాటలలో అరితేరినకంఠములుగల విదుషీమండలి మూగనోముతో గ్రామసంచారముచేసిన నేమిసొబగు? రాటము, మద్యనిషేధము, అస్పృశ్యతానివారణము మున్నగు విషయములనుగూర్చి ప్రబోధగీతములారంభమైనవి. గ్రామసందర్శనము నగరసంకీర్తనగా మాఱిపోయినది. కొలదినిమిషములలో గ్రామము చుట్టివచ్చితిమి. మాకోలాహలముచూచి దాదాపునూరుమంది జానపదులు పిన్నలు పెద్దలుగూడ వెంటవచ్చిరి. మరల చెట్టుక్రింద చేరితిమి. ఆచెట్టుక్రిందదించియున్న రెండెడ్లబండి ఉపన్యాసవేదికైనది. పాటలలో సత్తిరాజు శ్యామలాంబగారు కట్టతెగినయేఱు. చెట్టునీడకువచ్చినను ఆమెయింకను పాడుచునేయుండెను. అంతపాటలెందుకు? నాల్గుమాటలు చెప్పండన్నారా గ్రామస్థులు. కల్లుసారాయిలు విసర్జించి సుఖించుడని హితముగజెప్పినారు లక్ష్మీనరసమ్మగారు. పరిశుభ్రతనేర్చుకొనుడని హెచ్చరించినారు భాస్కరమ్మగారు. ఈఉపన్యాసము లిట్లుసాగుచుండగా ఒక వృద్ధురాలు నావద్దకువచ్చి అమ్మా! మీరిట్లావస్తే మీమగోరికి అన్నమెట్లాగని మెల్లగాఅడిగింది. నాకు పక్కుననవ్వువచ్చినది. అంతనేను నవ్వుచునే నామిత్రురాండ్రనుచూచి ఇదిగో అమ్మాయిలూ, మీఉపన్యాసములకేమిగాని యీఅవ్వ ప్రశ్నకుత్తరమీయుడంటిని.






## చిన్ని చెల్లాయి

శ్రీమతి బొడ్డు సీతామహాలక్ష్మీ గారు




కఱ్ఱగుఱ్ఱమ్ముత్రోసి 'కదలవే'యనికొట్టు
పేడబొమ్మకు మాటలాడనేర్పు
పీటపై బొమ్మలుపెట్టి యాటలనాడు
చెంబులలోనీళ్లు చేర్చిపోయు
తల్లిదాపగడాలదండతో నుబుసాడు
తిరుగుబొంగ్రముగాంచి మురిసిపోవు
ఖాదిజండాబూని 'గాంధికిజే'యను
గాలిపటంబుతో కేళిదేలు
గిలకపంచునుగైకొని కులుకుచుండు
చందనపుబొమ్మముద్దాడి చంకజేర్చు
చెంబునకుత్రాడుగట్టి నీరంబుచేదు
చిన్నిచెల్లాయి సావిత్రిచేయుపనుల
గన్నవారికి కడుపుచెక్కలగుగాదె!






# నిజమైన ప్రేమ

కనకదండి గోపాలకృష్ణశాస్త్రి గారు

తల్లి వాకిట్లో జడఅల్లుకుంటూ బిడ్డమాట మరచిపోయి తదేకధ్యానంగా కూర్చుంది అద్దంకేసిచూస్తూను.

మూడేళ్ల చిట్టి—వాడిపోకుండా నీళ్లబిందెలోవేసి ఉంచిన గులాబిపూలను రెండుచేతులతోనూ రెండూపుచ్చుకుని తల్లిముందర నిలబడి "అమ్మా! ఇవిగోనే" అని తల్లికేసి చూపించింది చిరునవ్వుమొగంతో.

తల్లి ఆపూలు నలిగిపోతాయని భయంతో "నీకొద్దమ్మా! ఆపూలు ఇల్లా ఇయ్యి" అంది.

చిట్టి తప్పటడుగులతో వెనక్కి వెడుతూ "నాకో? నాకో?" అని మొగం మీదికి వ్రేలాడుతూన్న చిన్నిజడలో పెట్టుకుంటోంది.

తల్లి "నీకునే పెడతానురా!" అంది.

చిట్టి "నాకో? నాకో?" అంటూజరిగిపోతోంది.

తల్లికి లేస్తేజడవదులైపోతుందనిభయంచేత లేవకుండానే కోపంతో "నలిపివేశావంటే కొట్టేస్తానుసుమీ! ఇల్లాతే"అంది.

బిడ్డ నవ్వుతూ తల్లికేసి చూపిస్తూ రెండుపువ్వులూ నలిపివేసేసి క్రింద పారేసింది.

తల్లి జడవొదిలేసి కోపంతోవచ్చి చిట్టిని రెండుచరుపులుచరిచి వెళ్లిపోయింది.

చిట్టి ఏడుస్తూ క్రిందదొర్లిపోయింది.

తల్లి జడవేసుకుని లోపలికివెళ్లుతూంటే చిట్టిలేచి కళ్లుతుడుచుకుంటూ దద్దురుచూపిస్తూ "ఆయే"అని అశ్రులుజార్చి తల్లి రెండుకాళ్ళూ గట్టిగాపట్టుకొని "ఏమన్నా పెట్టవే" అంది.

తల్లిహృదయం నీరైపోయింది. దద్దురుమీద చమురుతూ జలజలారాలుతూన్న అశ్రువులచేత చిట్టిశిరస్సును కొన్నిక్షణాలు తడిపివేసి ఎత్తుకునిముద్దాడింది.

చిట్టి అదిచూచి "అమ్మా! ఎందుకే అల్లా?" అని బిక్కమొగంతో తల్లి కంఠాన్ని పెనవేసుకుపోయింది.

వారును నాతోటివారునవ్వి అవ్వా! ఇంట్లో మగవారికి అన్నము యేర్పాటులేకుండనే వచ్చెదమా? కొందఱిండ్లలో అత్తయో, ఆడుబిడ్డయో, తల్లియో యెవరో పెద్దవారుందురు, కొందఱికి వంటవారుందురు అని సమాధానమిచ్చిరి. నాకుతెలవక అడిగాఅమ్మా! తప్పుబట్టకోకండి అని ఆఅమ్మఅనెను. తప్పేమిలేదు, ఇది అందఱికీతోచేసందేహామే, అని నేనంటిని. అయితే మీరు మీటింగుకొచ్చామంటిరే, ఏమిచెప్పుకున్నారని మఱియొకస్త్రీ అడిగెను. స్త్రీలకుచదువు, ఆస్తి, హక్కులుకావాలెనని తీర్మానించారని నేనంటిని. "అయితే అవి వస్తవీ? ఎప్పుడూ?" ఇంతలో మాబండీకి జనముజీవము వచ్చినట్లుగా మోటారుహారను ప్రమోగించినాడు డ్రైవరు. మేమిట్లు సంభాషణలు, సంకీర్తనలు, ఉపన్యాసములు చేయుచు, కాలక్షేపము చేయుచుండి తానుమాత్రము వీనితో పాల్గొనక మోటారుబండివద్దనే ఉండి బండివానిని తొందరించుచున్న పద్మాసనమ్మగారు బండిబాగైనది రండిరండని చేయూచి పిలిచిరి. సభకు మంగళము చెప్పకుండనేవచ్చి అందఱము బండిలోపడితిమి. ఇంతటినుండి అమరావతిచేరువఱకు మాసంభాషణలు చాలవఱకు మేము నిడుముక్కలలో జరిపిన కార్యక్రమమునుగూర్చియు, జానపదులనుగూర్చియు నై యుండెను. మేమిట్లు పరస్పరసల్లాపసౌఖ్యానందరసనిమగ్నులమైయుండ అదిగో అమరావతియని రెవరో. దానితో సుషుప్తి జాగ్రతికి వచ్చినట్లులైనది మాకు.

అమరావతీనగరప్రాచీనవైభవము చాటుటకు ఆరాజవీథియొక్కటిచాలును. పది బండ్లయిన నొక్కమాఱుగా నొక్కవంక్తిగా నొకదానినొకటి యొరసికొనకయె పోవజాలినంత విశాలముగానున్నదారాచబాట. ఆవీథిగుండ మాబస్సు వేగముగా దేవాలయమువద్దకేగి ఆగినది. అచ్చట మేమందఱము దిగి మావస్తువస్త్రాదులు తీసికొని దేవాలయమునంటి పాఱుచున్న కృష్ణవేణీమహానదిలో స్నానముచేయుటకు వెళ్ళితిమి. నాడు కార్తికసోమవారము, కాన ఆమహాపర్వదినమున మహానదిలో స్నానము, అమరేశ్వరుని సందర్శనములభించుటచే సనాతనధర్మవాసనహృదయములనుండి తొలగనివారికి అమరావతీయాత్ర సార్థకమైనదనిపించెను. అప్పటికి ఉదయమునేవించిన కాఫీ, ఇడ్లీ, ఉప్మాదులు నిశ్శేషముగా నఱిగియుండుటచే పఱగడుపుతో నుంటిమని భావించినచో కార్తికసోమవారమహాపుణ్యదినంబున మేమచ్చటగావించిన స్నాన, దాన, స్వామిసందర్శనాదులకు లభింపవలసినపుణ్యము పూర్తిగనేలభించెనని చెప్పనగును. కృష్ణలో నీరేలనో బురదగానుండెను. కాన స్నానముచేయుటకు కొందఱువెనుదీసిరి. కాని కార్తికసోమవారపుణ్యదినమున అప్రయత్నముగా లభ్యమైన కృష్ణవేణీసలిలావగాహనమును వ్యర్థముగా బోగొట్టుకొననేలనని కొందఱుమాత్రము ఒకబ్రాహ్మణుని పిలిచి సంకల్పము చెప్పించుకొని స్నానముచేసివచ్చితిమి. స్నానముచేయకుండిన వారప్పటికప్పుడే అమరేశ్వరాలయమునకు దారితీసిరి. కొలదినిముసములలో మేమును వారినిగలిసికొంటిమి. అమరేశ్వరాలయ మొకయున్నతప్రదేశమున గట్టబడియున్నది. స్వామిని

దర్శింపనెంచువారు బెజవాడస్టేషనువద్దనున్న బ్రిడ్జీకున్నట్లు ఇరుప్రక్కలనున్న మెట్ల నెక్కిపోవలయును. దేవాలయమునకు విశాలావరణయు, ఉన్నతప్రాకారమునుగలదు. దేవాలయముగూడ పెద్దదే. కాని సాధారణముగా ప్రాచీనదేవాలయములయందుండెడి శిల్పనైపుణి దీనియందంతగా కానరాదు. దేవాలయనిర్మాణపైఖరియు ప్రత్యేకముగనేయున్నట్లు దోచినది. బహుశా ప్రప్రథమమున నిది యొక బౌద్ధకట్టడముగానుండి వేదమతప్రాబల్యమున శివాలయముగా మార్చబడినదేమో తెలియదు. చారిత్రకపరిశోధకులే యీవిషయమును నిరూపింపవలసినవారు. మనకెందు కీప్రసక్తి?

అమరేశ్వరునిలింగము దాదాపు ఆఱుఅడుగులపొడవుగనున్నది. అర్చకులు క్రిందనిలువబడి స్వామికి అభిషేకాదులుచేయుటకు సాధ్యముకాదు. కావున స్వామికి ప్రక్కగానున్న మెట్లపైనుండి పైకివెళ్ళి అర్చకులు స్వామినర్చింతురు. స్వామి కభిషేకముచేయుటకది సుసమయమే. అయినను అవకాశములేనందున కొబ్బరికాయ, పండు, తాంబూలములుమాత్రము సమర్పించి కర్పూరహారతి చేయించి రుద్రపాదములు శిరసుననిడికొని స్వామికి భక్తిపురస్సరముగా ప్రణమిల్లి వీడ్కొని దేవాలయబహిరంతరములనెల్ల పరిశీలించిచూచి మెట్లుదిగి క్రిందికివచ్చితిమి. అమరేశ్వరునిప్రాకారమున కీవల చుట్టును చిన్నచిన్నగుళ్ళు చిల్లరదేవుళ్ళు చాలయుండెను. వానినిగూడ చూడవలయునను కుతూహలముతో కొన్నిటితలుపులను తీసి చూడ కిచకిచమని క్రిందినుండి యెలుకలును పైనుండి గబ్బిలములును నొక్కమాఱుగా నెదుర్కొనెను. ఓహో! ఇచ్చటి అర్చకులువీరా? మానవపూజాపురస్కారములు మీకునిషేధమా? దేవతలారా! అని వారికి దూరమునుండియే ఒక్కనమస్కారముచేసి చల్లగా ఈవలకు వచ్చితిమి. ఆచిన్నదేవాలయములకు సమీపముననే పడవలరేవు, కాన కొన్ని పడవలు తీరముననిలిచి సరుకులు యెగుమతి దిగుమతులు చేసికొనుచుండెను. వాని నించుక పరిశీలించి ఇది వర్తకస్థానముగాబోలు పొగబండ్లధికముగానున్న ఇక్కాలమునగూడ ఇచట యింత వర్తకము సాగుచున్నదే, పూర్వకాలమున దీని వైభవమెంతగానుండెనో అనుకొనుచు మా అమరావతీయాత్రకు ప్రధానకారణమైన ప్రాచీనబౌద్ధశిల్పముల దర్శించుటకు ఉత్సాహముతో బయలుదేరితిమి. అప్పటికి దాదాపు పదిరెండుగంటలయ్యెను. క్రింద కాళ్లుకాలుచుండెను. అయినను మామనంబుల ప్రగాఢమైయున్న ఆప్రాచీనశిల్పములజూచువేడుక ఆసహస్రకిరణుడు పెట్టెడిశ్రమను గమనింపనీయకుండెను. ఆబౌద్ధచిహ్నములుగల ప్రదేశము నచ్చటివారు దీపాలదిన్నె యందురు.

ఉత్సాహములో నురుకులుపెట్టుటేగాని యేమున్నదక్కడ? నిన్నటివా? మొన్నటివా? రెండువేలసంవత్సరములకు పూర్వపుకట్టడములవి! వానిలో వచ్చిన విదేశీయాత్రికులెల్లరు జ్ఞాపకచిహ్నములుగా తీసికొనిపోయినవిపోగా, ఇంపైనవస్తువులెల్ల ఇంగ్లండుచేర్చుటకు దీక్షపూనిన ఇంగ్లీషువారు లండనుమ్యూజియమునకు చేర్చినవిచేర్చగా, హతశేషము చెన్నపురి

వస్తుప్రదర్శనశాల నలంకరింపగా, మనప్రాచీనులశిల్పనైపుణి తలచి చింతించి కన్నుతుడుచు కొనుటకు పడియున్నవి కొన్ని చెక్కలు! ముక్కలు! అయినను బంగారువన్నె తెలిసి కొనుట కొకసలుసంతబంగారమైనను చాలినట్లులనే ఆకాలపు పనితనము తెలిసికొనుట కేదిన్ని శిల్పశకలమైనను చాలునుగదా.

స్తూపముగలప్రదేశమంతయు వలయాకారమగు అతివిశాలప్రదేశముగనుండి యెన్ని వేల జనమైనను కూర్చుండుట కనుకూలముగనున్నది. అతిప్రాచీనకాలముననే భారతీయులు గొప్పసభారంగముల నిర్మింపగల నైపుణిగలవారని యీప్రదేశము తిలకించిన వారికెల్లరకు స్ఫురించును. దీపాలదిన్నెలో అడుగుపెట్టగనే మొట్టమొదట నెట్టయెదుటగాన్పించునది ఒక గజమువెత్తును సుమారు మూడుగజముల వెడల్పునుగల యొకగుండ్రనిఅరుగు. అచటి శిల్పనైపుణి నరయుట కాతిన్నె చుట్టును గారతోబిగింపబడియున్న మంచిపనితనముగల పాషాణశకలములే ఆధారము. ఆకాలపు స్త్రీపురుషాదులయు, ఖగమృగాదులయు, వృక్షలతాదులయు చిత్రములు పెక్కులాశకలములయందు గాన్పించును. అవియైన మోటుగా పెద్దవిగాలేవు. అతిసున్నితముగా రెండుమూడంగుళముల చతురములలోనే ఆచిత్రము లిమిడియున్నవి. అవి యన్నియు అర్థములేని బొమ్మలుగావు. ప్రతిబొమ్మయు బుద్ధునిచరిత్రమునకు సంబంధించినదే. చారిత్రకపరిశోధకులు వానికథలు వివరింపగలరు. బౌద్ధులచరిత్రము నెఱుగని నేను వానిని వివరించుట సాహసము. ఒక డొకపెట్టెను తలపై నిడుకొని తెచ్చుచుండుటయు, వానికిరుప్రక్కలు కొందఱుజేరి భక్తితో నాపేటికకు వింజామరలు వేయుటయు పెక్కుచోట్లకంటిమి. బుద్ధనిర్వాణానంతరము ఆయన నఖాస్థికకేశములను ఆయనశిష్యులు పలుతావులకుగొనివచ్చి వానిపై గొప్పగొప్ప స్తూపములను నిర్మించినట్లు మనమప్పుడప్పుడు చరిత్రలలో చదువుచున్నాముగదా. బహుశా ఆపేటికయందున్న వట్టిపవిత్రచిహ్నములై యుండునేమో తెలియదు. బుద్ధభగవానుడు, బోధివృక్షము, రాజులు, రాణులు, సింహాసనములు, పరివారజనములు ఇట్టివెన్నియో కనుపించినవి. కల్పలతా! ఆశిల్పుల హస్తనైపుణియెట్టిదో! ఆకఠిన పాషాణములు యెట్లు వారి సిద్ధహస్తములలో మృదులపదార్థముచందముననై యట్టి సున్నితములగు చిత్రముల నిర్మించుటకు సాధ్యమాయెనో అత్యంతాశ్చర్యకరము. అయ్యారే! వానిని చూచినవారెవరైన నాగరికత భారతీయులకు పాశ్చాత్యులుపెట్టిన భిక్షమనజాలుదురా? అచ్చట పూర్వము గొప్పచైత్యములు, స్తూపములు, రాజమందిరములు నుండియుండవచ్చును. ఇప్పుడక్కడ యొక్క కట్టడమైనలేదు. వర్తులాకారముననున్న ఆప్రదేశము చుట్టును ఉన్నతములగు మట్టిదిబ్బలుమాత్రము కనుపించును.

అరడుగులపొడవుగల బౌద్ధసన్యాసుల రాతివిగ్రహములు కొన్ని మొగములు సాఫుగా చెక్కివేయబడియు, కాళ్లు నఱికివేయబడియు అచ్చటచ్చట పడియున్నవి. భూమిలో పాతి నిలువబెట్టబడిన విగ్రహములకుగూడ యీవిధముగనే మొగములు ముక్కులు విఱుగగొట్ట

బడియున్నవి. ఒకరాతితో మల్చిన స్తంభములను ఆ స్తంభముల క్రిందవేసెడి మంచిపనితనము గల చక్రములవంటి రాతిదిమ్మలను పెక్కులుగాంచితిమి. ఆప్రదేశమునకు మధ్యనున్న చెట్టు క్రిందనిలువబడి ఆపనితనముగల చక్రములను పలుకలుతీర్చిన స్తంభములను మేము పరికించు చుండగా శ్రీమతి దామెర్ల కమలరత్నమ్మగారు మావెంటవచ్చిన నలుగురైదుగురు పిల్లల నాచెట్టుక్రింద నొకరాతిపై గూర్చుండబెట్టి చేతికెమెరాతో నొకఫొటోతీసికొనిరి. మేమట ఛాయాగ్రహణమును విలోకించుచుండ మాలో కొందఱు చుఱుకైనవారు వడివడిగా నొక దిబ్బ కెగబ్రాకుచుండిరి. ఆదిబ్బమీద తారుబూసిన బద్దలతో నలుచదరపుదొడ్డియొకటి కనుపించుటచే ఆదొడ్డియందింతకంటె మేలిచెక్కడము లేమిగలవోయని మేమును ఆమెట్ట నెక్కితిమి. ఆదొడ్డిచుట్టును ప్రదక్షిణించితిమి. కాని కాళ్ళుత్రిప్పటమేదప్ప దానిలో మేమిది వఱకు చూచినవానికంటె భిన్నమైనవిలేవు. అక్కడగూడ బౌద్ధపరివ్రాజక విగ్రహములు స్తంభములు, పట్టెలు మున్నగునవియే కాన్పించెను. అంతటితో మాసందర్శనము ముగిసెను. తిరుగుముఖము పెట్టితిమి. అచ్చటనున్న శిల్పచిహ్నములలోనెల్ల నాతిన్నెయందమర్చినవే చూడదగినవి. ఆశిల్పములు నిర్మింపబడి యెన్నిశతాబ్దములాయెనో, ఎన్నినిర్భరనిదాఘ తీవ్రాతపములు! ఎన్నిప్రావృట్కాల "చండదిగ్వేదండతుండనిభాఖండవారిధారలు" ఆశిల్ప ముల రాపాడెనో! అయినను నలుపెక్కక, వన్నెచెడక, నిన్నమొన్నమలిచినట్లున్న ఆశిల్ప ములనైపుణిమాత్రము అక్కజముగొల్పును. కల్పలతా! ఎన్నిమాఱులమరావతికివెళ్ళవల యునని యత్నించినను నెప్పటికప్పు డేవియో యసందర్భములవలన ఆటంకముకలుగుచుండెను. కాని నాడట్టి విఘ్నములేకలుగకున్నచో నిప్పు డిట్టిసోదరీమణులతో అమరావతికేగెడుభాగ్య మొదవకుండెడిది గదా? కావున ఒకప్పుడు విఘ్నములుగూడ మనమంచికే యనువాక్యము సత్యమేయనిపించును.

ముఖ్యముగా నీయాత్రను మొట్టమొదట తలపెట్టి సోదరీమణులనెల్లర ప్రోత్సహించి తీసికొనివెళ్ళినవారు శ్రీమతి దామెర్ల కమలరత్నమ్మగారు, భాస్కరమ్మగారు మున్నగు రాజమండ్రి సోదరీమణులు. వారు మాకృతజ్ఞత కెంతయుపాత్రులు. —ఇట్లు, శారద.

## నవనాగరకము

శ్రీమతి తూతిక కమలాంబగారు

సీ. సదమలాయువుఁగూర్చు చల్దియన్నముమాని
పసలేనియుప్మాల మెసవువారు
ఆరోగ్యమునొసంగు నావుపాలనుమాని
కొంకక కాఫీలు గ్రోలువారు
తనవునిండారు ఖద్దరువస్త్రములమాని
మల్లుబట్టల నుల్లసిల్లువారు
కులవివక్షతఁదెల్పు తిలకంబులనుమాని
రిక్తముఖాల వర్తించువారు
ముందుక్రాపులతో నెప్పుడున్ మురియువారు
నావివరుసలు వలదంచుపలుకువారు
నెచటచూచినలెక్కకు నెక్కుడై
చరించుచుండిరి నవనాగరికులునేఁడు.

# శ్రీకృష్ణార్జునుల పరాజయము

శ్రీమతి జరుగుమిల్లి రామాబాయమ్మగారు

కురుయుద్ధంబైనపిదప ధర్మరాజు బంధునాశనమునకు మిగులవగచి తనపాపమున కంతులేదనియు, రాజ్యమొల్లననియు వ్యాసునితో చెప్ప, వ్యాసమహాముని అశ్వమేధము చేసినచో పాపపరిహారంబగునని నుడివెను. ఆప్రకారము అశ్వమేధము చేయుటకు ముందుగా మఖాశ్వమును విచ్చలవిడిగా ఒక్కసంవత్సరము దేశములవెంబడి తిరుగనంపిరి. ఆఅశ్వము నెవ్వరైనబట్టినచో వారితో యుద్ధమునసల్పి అశ్వమును తెచ్చుకొనుటకు శ్రీకృష్ణార్జునులు చతురంగబలముతో అశ్వముపోవుత్రోవ నేబోయిరి. రత్నపురంబున మయూరధ్వజుండనురాజు అశ్వమేధము చేయదలంచి అశ్వమువెంట తన సుతుడగు తామ్రధ్వజుని చతురంగబలముతో నంపెను. తామ్రధ్వజుడు ధర్మరాజు అశ్వమునుజూచి ఆఅశ్వమును తమతండ్రికిచ్చిన ఇంకొక అశ్వమేధము చేయునని ఆఅశ్వమునుబట్టెను. శ్రీకృష్ణార్జునులు అధికముగా పోరాడియు గెలువజాలరైరి. తామ్రధ్వజుండు వారినిఓడించి గుఱ్ఱమును తీసుకొనిపోయి తండ్రికిసమర్పించెను. అర్జునుడు తిరిగి యుద్ధముచేసి అశ్వమును తెచ్చెదనన శ్రీకృష్ణుండు చిరునవ్వునవ్వి వీరుభగవద్భక్తులు వీరినిజయించుట దుర్లభము వీరిని సామోపాయముననే గెలువవలయును కావలయునేని వీరిభక్తి చూపించెద ననిచెప్పి తానువృద్ధబ్రాహ్మణరూపంబునను, దనకూర్మిసఖుండైన యర్జునుని బ్రహ్మచారునిగనుజేసి శిష్యునిగవెంటగొని రత్నపురంబుచేరి యజ్ఞశాలమధ్యంబున దీక్షాపరుండును, పత్నీసమేతుడై సామంతరాజులందరుకొలువ దర్భాసనముపైకూర్చున్న మయూరధ్వజునిగాంచి ముందుగ నేదీవించిరి. ఆమయూరధ్వజుండు లేచినిలచి వీరిని సత్కరించి 'మహాత్మా! నేను నమస్కరింపకుండగనే దీవించితిరేల'? యన "రాజా! మేమొక కోరికపైవచ్చితిమి. కార్యార్థులముగాన ముందుగనే దీవించితిమి" అనగనేరాజు "విప్రవర్యా! అభ్యాగతస్స్వయం విష్ణుః యనబడునుగాన నీవు సాక్షాత్ జనార్దనుండవని తలంచెద. ఏదియైననసరే వేడుము. దేహవంచనయు, మనోవంచనయు, ద్రవ్యవంచనయు లేకుండా నొసగెద"ననిన విని ఆబ్రాహ్మణోత్తముడు 'మాది ధర్మపురము. నన్ను కృష్ణశర్మయందురు: ఇతండు నాశిష్యుండు. నాకుమారుని వివాహనిమిత్తము నీపురోహితునికూతురు సుశీలయనుకన్యయున్నదని అడుగదలచి నేను, శిష్యుడు, నాసుతుడు వచ్చుచుండ త్రోవలో భీకరకాననమున ఒకసింహము నాసుతుని కుత్తుక పట్టుకొనెను. నేనాసింగంబును విడిపింపనేరక శ్రీనృసింహా, శ్రీనృసింహాయని నూటయెనిమిదిమారులు జపించితినిగాని ఏమియుప్రయోజనము లేదయ్యె. ఆసింగము మనుష్యభాషతో, తన్నుజయింప నెవ్వరితరంబుగాదనియు. ఇంటికి తరలుడనియు బలుక మృగరాజమా! నాశరీరంబుగొని, నాసుతునివిడువమని నేనువేడ, నేముదుష్టజంతువులము, అల్పాయుష్కులనుతప్ప, నీవంటిదీర్ఘాయుష్కులను తినజాలమని ఆసింహంబుబలుక, ఓయీపంచాననా! నేచేసిన సుకృతంబులన్నియునిచ్చెద నాకొడుకునివ్వమని నేనన, నీవలననాకేమియు ప్రయోజనంబులేదు. మయూరధ్వజునివలన మాకు వలయుకార్యముగలదనిచెప్పినది. రాజా! ఆకార్యము నీవంగీకరించెదవేని తెల్పెదనని ఆవృద్ధబ్రాహ్మడు నుడువ మయూరధ్వజు డాబ్రాహ్మణునితోనిట్లనెను. 'ఆసింహంబు సాక్షాత్ నృసింహదేవుండు గాని సామాన్యసింహంబుగాదు. నారాజ్యములో దుష్టజంతువులు సహితము, పరులను బాధింపనివే, అయినను నీవడిగినదానిని తప్పకయిచ్చెద. నామాటనమ్ముము, నీవుత్వరగా కోరుమ'న 'మనుబోంట్లయర్థులు, మిముబోంట్ల దాతలనడుగుటకు సంశయములేదు. కానతెల్పెదవినుడు. ఆసింహంబు నీశరీరము సగమిచ్చిన నాసుతునిచ్చెదనన, నేను ఆసింహంబువంక జూచి అందరిని రక్షించుమహారాజులదేహంబుగోసి ఇమ్మనుట మావంటివిప్రులకు తగునాయన యది నన్ను హేళనచేసి మయూరధ్వజుని సామా

ద్యునిగా తలంపకుము. దీనజనరక్షకుండును, సత్యసంధుండును, ఉత్తమోత్తముండును, ఉదారుండునగు నారాజు నీవడిగినతత్క్షణము నీకోరిక ఫలింపఁజేయును. అదియటులనుండనిమ్ము. నీవు శరీరమిచ్చెదనంటివి. ముసలితనముచే వాడి తపంబున శోషించి, ఉపవాసంబున కృశించిన, బలహీనంబగు నీదేహం బేల? నాకు. ఆరాజు సకలరసంబుల తృప్తిచెంది సర్వసుఖములుపొంది నవనీతపుముద్దవలె నానోటికింపైయుండునని చెప్పి ఆసింహంబే నన్ను బొమ్మనె'నని ఆబ్రాహ్మణుండు తెలుప, మయూరధ్వజుండామాటలను విని క్షణమేనియు ఆలసింపక, ఆబ్రాహ్మణకుమారుని బ్రతికించుటకు తనశరీరమిచ్చెదఁదలచి, మంత్రులతోను, హితులతోను బంధువులతోను, ఇట్లనెను: 'రాజులకు రణమున గోబ్రాహ్మణులనిమిత్తము ప్రాణంబులిడుటయే ధర్మంబు. శిబిప్రముఖులు పరార్థముగా తమశరీరములనిచ్చిరి గాన మీరెవ్వరు నన్ను అభ్యంతర పెట్టవలద'ని, వారలకారాజు చెప్పి, తనపుత్రుని, రాజ్యాభిషిక్తునిగా ప్రతిష్ఠించి, తానుస్నానముచేసి, అనేకదానంబులు చేసి, తనదేహంబు నొసగుటవలన శ్రీకృష్ణభగవానుడు ప్రీతుండవుగాక, అని ఆవిప్రునకు తనఅర్ధశరీరమును ధారపోసెను. ధారపోసి, యజ్ఞవేదికాస్థలంబున దర్భాసనము వేసుకొని గూర్చుండి ముకుందచరణారవిందములు హృదయంబు నస్థిరముగనిల్పి, అతండే రంపము తనశిరముననిడికొనిన పతివ్రతామణియు, బరమసాధ్వియునైన యతనిభార్యకుముద్వతీదేవి అతిత్వరితంబుగావచ్చి "పురుషుని అర్ధశరీరంబు భార్యయని వేదవచనముకలదు. కావున నాశరీరమునిచ్చెద'ననిన ఆకపటబ్రాహ్మణుడు, పురుషుని ఎడమభాగము భార్యది. ఆసింహము కుడిభాగమే తెమ్మన్నదన, ఆరాజుకుమారుండగు తామ్రకేతుండు 'బ్రాహ్మణోత్తమా! తనఆత్మయే పుత్రుండైపుట్టునని వేదవచనంబులే ప్రమాణము, గాన మాతండ్రికిబదులు నాశరీరమిచ్చెదను. ఋణవిముక్తుడ, నయ్యెద'నన ఆమాయాభూసురుండు 'ఆసింహంబు చెప్పినమాట వినుడు. భార్యయు, సుతుండును కోసి ఇచ్చిన కుడిభాగమే తెమ్మన్నది, ఆసింహముమాట సత్యముకానివ్వ'డన, అప్పుడారాజు అధికానందముతో ఆబ్రాహ్మణుడు చెప్పినటుల నేకానిమ్మని వారలకు తెల్పిన, భార్యయు సుతుండును, చెరియొకప్రక్కనిలబడి, దేవతలుమెచ్చ, భూజను లాహాకారములుచేయ కరకురంపమును, తలపైనిడి, రఘుపతీ! శ్రీమన్నారాయణా! హరీ! హరీ! శ్రీకృష్ణా! పురుషోత్తమా! యని కోయనెడ కన్నులుచెదర రక్తము కాలువలైపారెను. రాజుఎడమకంట నీరుగ్రమ్ముటయు ఆబ్రాహ్మణుడుగాంచి మిగుల కోపముతో కండ్లనిప్పుకణములురాల క్రచ్చేలనుగొట్టి లేచి ఇటునటుగంతులువైచుచు "అపుత్రకతవలన నూర్ధ్వలోకంబులు లేకపోయిననంబోవనిమ్ము, ఏడ్చుచు నొసగినదానంబు నేనొల్లనని శిష్యునితో పోబోవుచుండగా, ఆరాచపత్ని భర్తశిరస్సు అటులచేపట్టి అయ్యో నిష్కారణముగా కోయించి లేనికోపము తెచ్చుకొని పోవుచున్నాడని భర్తతో అనగా ఆరాజు ఆబ్రాహ్మణునిపిలచి, మహాత్మా! దక్షిణభాగముసద్వినియోగమగుచున్నది. ఆభాగ్యము నాకలేదేయని రెండవభాగము ఏడ్చినది. అంతియేకాని నేను ఏడ్చుచుండుటలేదు, ఏడ్చిన రెండుకనులనీరునచ్చును, నాయెడదయచేసి నీభాగంబుగొనిపొమ్మన అర్జునునితోగూడ శ్రీకృష్ణుడు ప్రత్యక్షమైనిలచి, ఆరాజును కౌగలించుకొని రాజోత్తమా! నీధైర్యస్థైర్యసాహసౌదార్యంబులకు మెచ్చితి. నీసుతుడు సతియునొంటి యాగాశ్వములను రెంటినిగొని రెండుయాగంబులు నీవేచేయుము. నేనేకర్తను, కర్మనుఅయి నిర్వహించెదను. నీసుతుడు యుద్ధమున బాహుబలముచే మమ్ముగెలచె. నీవు దేహంబునొసగి మమ్ముజయించితివని శ్రీకృష్ణుడు ఆరాజుశరీరమును నిమురుటవలన ఆరాజుగాయంబుమానెను. ఆరాజుసంతసంబున నద్దేవునిచరణపద్మములకు సాష్టాంగనమస్కృతులు చేసి, ప్రస్తుతించెను. సమస్తవస్తువులామాధవునకర్పించి పూజించి, కౌగలించి, బంధువులతోను, కృష్ణార్జునులతోను, ఆరాజు యజ్ఞశాలనుండి, తనపురంబునకరిగెను. అర్జునునకు మయూరధ్వజుని భక్తిదెలుపునుద్దేశముతో కృష్ణుడు, అర్జునివెంటనిడుకొని, సేనాసమేతుడై, ఆరాజు ఆహ్వానంబంగీకరించి మూడుదినంబు లారాజు ఆతిథ్యమునుగుడిచి, సంతృప్తులై ఇంటికిమరలిరి.




— గస్ చిప్ —

ఒకవీసె మైదాపిండి తీసికొనవలెను. ఆపిండి ఒక కళాయి పళ్ళెములోవేసి అందులో ఒకఅణాకాను ఎత్తుగల సోడాను కలుపవలెను. దానిలో మూడు గిద్దలపెరుగు తగుమాత్రము నీళ్ళు వేసి (కావలసినయెడల కొంచెము మిఠాయిరంగు కలుపుకొనవచ్చును.) ఉండ కట్టకుండ మెత్తగా పిసికి ముద్దచేయవలెను. ఆముద్ద మీద ఒకతడిగుడ్డపఱచి ఉంచివేయవలెను. దానిని 5 లేక 6 గంటలసేపు అట్టేపెట్టవలెను. 5, 6 గంటలు నానిన తరువాత నిమ్మకాయంతముద్దలు చేయవలెను. కళాయిపాత్రలో నెయ్యిపోసి మరగనిచ్చి దింపివేయవలెను. నెయ్యిచల్లారిన తరువాత పైచెప్పిన ముద్దలు దానిలోవేసి తిరిగి పొయ్యిమీద పెట్టవలెను. (మరుగుచున్న నేతిలో ముద్దలువేసినయెడల విడిపోవును) లేత పంచదార లేతపాకము పట్టియుంచుకొనవలెను. నేతిలో ఉండలు బాగుగావేగిన తరువాత పంచదార పాకములో వేయవలెను. పాకములో నానినతరువాత ఉండలు తినుటకు రుచిగానుండును.

—యశోదాబాయి.

— మామిడిపండ్ల హల్వా —

15 అంటుమామిడిపండ్లను తెచ్చి చల్లనినీళ్ళలో వేసి రెండుమూడు గంటలయిన వెనుక వాటి చెక్కుతీసి చిన్నముక్కలుగాకోసి ఒకపళ్ళెములో ఉంచవలెను. ఒక శేరుగోధుమపిండి ముప్పావుశేరు నేతిలో వేచుకొని దానినికూడ వేరుగా నుంచవలెను. 20 తులముల కిస్మిసుపండ్లు, 10 తులముల బాదముపప్పు, 10 తులముల పిస్తాపప్పు, పావుశేరు నానబోసి ఆర్చిన తర్వాత నేతిలోవేసిన శనగపప్పుపొడి, 2 తులముల యాలకులపొడి పైనచెప్పబడిన వేచిన గోధుమపిండిలో వేసి కలుపవలయును. అర్ధశేరుపాలు పొయ్యిమీద పెట్టి అవి ఉడుకుచుండగా ఒక అరపావునెయ్యి ధారగా అందు విడుచుచూ మామిడిపండ్లముక్కలను వేయవలయును. ఇట్లు ఇవిఅన్నియు పక్వమగుచుండు సమయమున 20 తులముల కండచక్కెరపొడివేసి బాగ కలుపవలెను. ఇట్లు కలపబడిన దానిలో పావుశేరు పెసరపిండి వేయవలెను. పావుశేరు నెయ్యివేసిదింపి వేఱొకపాత్రలో అర్ధశేరు చక్కెర పాకము పలుచగ రానిచ్చి పైనచెప్పబడిన సిద్ధమయినహల్వాను పాకములో వేయవలెను. కొంచము నెయ్యివేసి పైనచెప్పిన మామిడిముక్కల పాకమునుకలిపి ముద్దగాఅయిన వెంటనే క్రిందకుదింపి బాదముపప్పుతునకలువేసి కలయబెట్టవలయును. ఇది శరీరమునకు మిగుల ఆరోగ్యకరమైనది. సమధాతువుచేయును. శిరోవాతముల పోగొట్టును. పుష్టినిచ్చును. 15, 20 రోజులవఱకు చెడకుండ ఉండును. గాలి తగులనిచోట ఉంచవలెను. బాలురకు శరీరపుష్టిచేసి బుద్ధిని వికసింపజేయును. వేసవికి అనుకూలమైన పాకము.

—కోక పంకజమ్మ.

— అరటికాయపొడి —

అరటికాయలు సన్ననిముక్కలుగా తరిగి కొద్ది నెయ్యిగాని, నూనెగాని బాణలియందువుంచి, పై వ్రాసిన ముక్కలుపోసి మెత్తగా వాడునంతవరకూ వాడ్చవలయును. ఆముక్కలకు దిట్టముగా మిరపకాయలు, శనగపప్పు, మినపపప్పు, ఇంగువ, కొంచము ధనియాలుచేర్చి నెయ్యిగాని, నూనెగానివేసి పక్వముగా వేయించి దించుకొనవలయును. ఈ పప్పుల పొడిని ఉప్పును మితముగాచేర్చి దంచి యీముక్కలను పొడిలోవేసి కొంచం దంచవలయును. పులుపు

యిష్టమైనవారు కొంచెం చింతపండుగాని లేక నిమ్మ పులుసునుగాని చేర్చుకొనవచ్చును. ఈ అరటికాయ పొడి భోజనములో భుజించవచ్చును లేదా దోసె, ఇడ్లీ మొదలగువానికికూడా ఉపయోగించవచ్చును. బహురుచికరముగా నుండును. ఉర్లగడ్డనుకూడా పై విధముననే పొడి చేయవచ్చును.

—యన్. జ్ఞానప్రసూనాంబ.

## — పచ్చళ్లు —

పచ్చివంకాయలు ముక్కలుగాతరిగి తగినట్లు ఉప్పుచేర్చి తొక్కుకుండలో బెట్టి మరునాడు విత్తులు దీసిన చింతపండు, పండుమిరపకాయలు, కొంచెము పసుపుచేర్చి తొక్కి మరల కుండలో బెట్టుకొని యుపయోగించుకొనవలయును. లేతకాయలైనయెడల పథ్యకరము పైరగోంగూర వేయించి ఉప్పుచేర్చి త్రొక్కి పిమ్మట పండుమిరపకాయలు, కొంచెము పసుపుచేర్చి త్రొక్కి యూరబెట్టవలయును. ఇది సంవత్సరము మించినది పథ్యకారి. దీనిని నూనెతో బెట్టుటయు కలదు. ఉసిరికాయలుదంచి లోపలగింజలను తీసి వైచి తగినంత ఉప్పుజేర్చి మరలత్రొక్కి ఊరబెట్టవలయును. పచ్చిమిరపకాయలుజేర్చి యూరబెట్టవచ్చును. దీనినే నల్లపచ్చడియని వాడుచున్నారు. దీనినినూరి మరల తాలింపుబెట్టి భక్షించిన పైత్యముల నణచును. జీర్ణశక్తికలిగించి నోటి అరుచిబాపును. మిగులపథ్యకరము. సన్నగాతరిగిన ధనియాలాకు (కొత్తిమెర) తు 2, మిరపకాయలు తు ½, ఆవాలు తు ½, మినపపప్పు తు 2, జీలకఱ్ఱ తు 1, యీ వన్నీ మంచినూనెలో వేరువేరుగా వేయించి అంతాకలుపుకొని చింతపండు తు 1½, ఉప్పు తు 1. యివిజేర్చి పచ్చడిగా నూరవలయును. పెసలువేయించి రోటిలో వైచి ఉప్పు నిమ్మపులుసుతోనూరి యింగువజేర్చి తాలింపుబెట్టవలయును. ఇది చాలారుచిగా నుండును. పథ్యకరము. మంచి రేగుఫలములు వేయించిన మిరపకాయలు ఉప్పు యివినూరి తాలింపుబెట్టి భక్షింపవలయును. పథ్యకరము, అరుచిబాపును. చిన్నదోసకాయలు సెగలోమ్రగ్గనిచ్చి లోపలవిత్తులు దీసివైచి రోటిలోవైచి వేయించిన మిరపకాయలు కొంచెము ప్రాతచింతపండుచేర్చి నూరిన పథ్యకరము. ప్రతిపచ్చడిలో కరివేపాకుగాని కొత్తిమెరగాని వేయవచ్చును.

—వై. వేంకటరావు.

## — వంకాయ ఖుర్మా —

లేతవంకాయలుక్రమముగా కడిగి పెద్దపెద్దముక్కలుగాతరిగి నీళ్లలోవేయవలెను. అల్లం, కొబ్బరి, ధనియాలు, గసగసాలు, జీడిపప్పు, వెల్లుల్లి, జీలకఱ్ఱ వీటిని వేరువేరుగా నీళ్లతో ముద్దలుగనూరవలెను. వంకాయ ముక్కలను వేరేపాత్రలోనికి నీళ్లులేకుండగా తీసుకొనవలెను. నూరిన మసాలాముద్దలున్నూ, ఉప్పు, మిరపపొడి, పచ్చిమిరపకాయముక్కలు, పుల్లని పెరుగువేసి యీవంకాయముక్కలు బాగా కలియపెట్టియుంచవలెను. కళాయిపాత్రలో నెయ్యి వేసి బాగాకాగినతరువాత ఏలక్కాయలు, లవంగాలు, దాల్చినచెక్క నేతిలోవేసి బాగావేగినపిమ్మట ఉల్లిపాయముక్కలు తరిగివేయవలెను. ఇవిబాగావేగినమీదట మసాలాముద్దలు కలిపియుంచిన వంకాయ ముక్కలువేయవలెను. పైనమూతపెట్టి చిన్నమంట మీదను ఉడుకనియ్యవలెను. వంకాయముక్క బాగా వుడికినతరువాతను కొత్తిమిరి తరిగివేసి క్రిందకుదించుకొని ఉపయోగించవలెను.

—గైనేడి లక్ష్మీనరసమ్మ.

## — బాదమహల్వా —

నమ్మకమైనటువంటి రెండుశేర్ల పాలను తెచ్చి దానిలో రొనిమిదితులములనీళ్లుపోసి కాగపెట్టవలయును. కాగినపాలలో ముప్పావుశేరు గోధుమరవ్వను వేసి బాగుగాకలిపి, వేడినీళ్లలోవేసి పొట్టుతీసిన రొనిమిదితులముల బాదమపప్పును, అయిదుతులముల యాలకులపొడి ఆపాలలోకలుపవలెను. ఒకశేరున్నరకలకండను పాకముగాజేసిదించుకొని అందులో మూడుతులములపన్నీరు రొనిమిదితులములనెయ్యినీవేసి బాగుగా కలిపి పొయిమీదనున్నపాలలోపోసి కలుపవలెను. పిమ్మట రెండుమూడునిముషములుంచి దించినయెడల గడ్డకట్టును. గడ్డకట్టినపిదప భుజింపవలయును.

—పాకలరత్నమాల.

---

ఈశీర్షికకు పనికివచ్చువిషయములను విరివిగా సేకరించిపంప పాకకళాకుశలలగు స్త్రీలను గోరెదము.

—సంపాదకుడు.

కీర్తన

శ్రీమతి చోడవరపు రంగనాయకమ్మగారు

(శ్రీ రామచంద్ర నీ నామస్వరూపము అను మాదిరి)

మురళీధరా ముద్దు మురహరిగోపాల ముదమునసీలీలలెన్నదగా
వరపుత్రికలముద్దు పలుకులవలెవీని మురయుదువంచు తలంచెదగా ము॥
వనరుహానయనా! నిను వర్ణనచేయుటకు వనజసంభవునకేముకాదుగదా
వనితనుపాండిత్యరహితనుగాన నావలనితప్పుల నెన్నవలదయ్యగా ము॥
కారాగృహామందున్న దేవకిగర్భమున మామకంసునిజంపపుట్టితివీ
ప్రేమ నందయశోదల పెంపుడుబిడ్డవై కోరి గోకులమందు పెరిగితివీ ము॥
పాలిచ్చిచంపంగ పనిబూనివచ్చిన పడతిరక్కసిజంపిప్రబలితివీ
పలుగాకిశకటాసురాదివత్సాసురుల పలువురయసువులుబాపితివీ ము॥
ముద్దుగుల్కెడుచెవుల మద్దికాయలుగదల ముద్దులాయశోదకిచ్చితివీ
ఒద్దికతో వెన్న ముద్దలుదిని గొల్లముద్దియలతో పద్దులాడితివీ ము॥
శిఖపింఛమల్లాడ చిరుగజ్జెలనుమ్రోయ చిన్నిపాపలగూడియాడితివీ
కరకంకణధ్వనుల్ గాగ కోలనుగొని కదుపులనేర్పునగాచితివీ ము॥
మోహానమురళిని మ్రోయించిజగముల మోహాబ్ధినోలాలాడించితివీ
మోహనకారనిను మోహించివచ్చినస్త్రీలకు హితబోధచేసితివీ ము॥
మద్దులగూర్చిన ముద్దులకృష్ణ! నాప్రార్థనమాలింపవేలానయ్యా
పద్దునాతోసేకువద్దయ్యగోపాల వచ్చిదర్శనమియావేలానయ్యా ము॥
ఆసక్తిపడివేడ అగుపడవదియేమి అక్రూరుడేసేకుఅమరించేనా
హాకృష్ణాయనివేడఅట్టెవలువలొసంగ అల్లద్రౌపతిలంచమందిచ్చెనా ము॥
పగ్గంబులనుదాల్చి పార్థసారథివౌట భక్తులపై ప్రేమచేతగదా
పాపిష్టివ్యాధులపడలేకనిన్వేడ పల్కవునీకపఖ్యాతిగదా ము॥
నందునియురమందు చిందులుద్రొక్కు అరవిందసమపదయుగళరావేలరా
వందనమిడెగొనరా మందరగిరిధరా ఇందీవరాక్ష సందేహమేలా ము॥
కందర్పశతకోటిసుందరసుకుమార ఎందెందువెదకినకన్పడవు
మందురాలిని నాపాంపాంధత పోద్రావికందుడవగుచునాముందాడవు ము॥
కరిమొరలిడగానె పరుగునసీవేగి సరగునమకరినితరిగితిగా సరసీరుహాక్ష నే
మరివేడవినవాది వరగర్వమో చెపుడో ఎరుగముగా ము॥
రాధాలోలాఇంతరాపుచేయగమేల రావయ్యరాజాగోపాలబాలా
రంగనాయకినేల రక్షకులికనెవరు రాక్షససంహార! జాలమేలా ము॥




డాక్టర్ యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యమ్.

సౌందర్యమునకు కనుముక్కుతీరు తరువాత త్వగింద్రియమే ప్రధానమైనది. కాంతిగల చర్మము సౌందర్యము నేగాక లోపలి అవయవములన్నియు సుస్థితియందున్నవని సూచించును. లోని ఎముకలు, కండరములు, ఇతర అవయవములు ఆరోగ్యస్థితియందు లేనిచో చర్మమునకు కాంతియుండదు, కండ్లలో కళయుండదు, బుగ్గలపై మిసిమియుండదు. అయితే త్వగింద్రియము అలంకారసంపాదనార్థమే గాదు. దానికి శరీరయంత్రమున ఒక ప్రధానమైన కృత్యముగలదు. ఆకృత్యము కాంతితో కనిపించుట ఒక్కటియే గాదు. ప్రకృతిమాత మానవునకు అనుగ్రహించిన ఆకర్షణసూత్రములలో కాంతియుక్తమైన చర్మము ప్రధానమైనది. ఇందుకుతోడు చర్మము స్పర్శావయవమును, మలవిసర్జనావయవమును. తనస్పర్శజ్ఞానమువలన అది మానవుని వేడినుండి చలినుండి రక్షింపజాలియున్నది. అనేకకారణములచే మానవుడు చర్మమును అతిజాగ్రతగ పరిరక్షించుకొనవలసియున్నది. కాని ప్రాయికముగా అతడట్లు చేయుటలేదనియే చెప్పవలసియున్నది. పలువురు చర్మము విషయమై అశ్రద్ధ వహింతురు. చర్మము దానిపనిని అదిబాగుగా నిర్వర్తించుటకు దానికి పరిశ్రమవలయుననియు, గాలియే దానికి ఆహారమనియు మానవుడు మఱచియున్నాడు. చర్మమునకు తగిన పరిశ్రమ బాగుగా చెమటపట్టించుటయే. పలువురకు దీనికితగిన అవకాశముగాని కాలముగాని ఉండదు. అట్టివారు ఉదయముననే చన్నీటిస్నానముచేసి పిమ్మట చర్మమును పెట్టబుట్టునటుల రాచుకొనవలయును. వేడినీళ్ళలో స్నానముచేయువారు శరీరమును బాగుగాతుడుచుకొని దానికి బాగా గాలితగులునట్లు చేసికొని అనంతరము ముతకతుండుగుడ్డతో శరీరమును రాచుకొనవలయును. ముఖమును తఱుచు కడుగుకొనుచుండవలయు. సాధారణమైన మంచిసబ్బు, నీళ్ళు ఉపయోగింపనగును. కొందరకు ఓటుధాన్యపుపిండియు నీళ్ళును బాగుండును. నానిగ్రక్కుచుండు చర్మమునకు స్పిరిటు, నీళ్ళుమంచివి. కాంతివంతమైన చర్మమునకు లోపలి అవయవముల సుస్థితియే ముఖ్యమని ఎల్లవేళల జ్ఞప్తియందుంచుకొనుము. గాలిలో పరిశ్రమ, మితమైన ఆహారము, ఉదయమున పరగడుపున ఒక గ్లాసెడు మంచినీళ్ళు చర్మకాంతిని మంచికిమార్చి ముఖకళను పెంపొందించును. మొటిమలను పుట్టనీయవు. మలద్వారముల నిర్మలముగ చేయుట; మఱ్ఱి, దానిమ్మ, కొండమల్లె, ఏరుమద్ది వీని కాష్ఠములను దంతధావనముకై యుపయోగించుట; చన్నీళ్ళు లేక యించుకంత వెచ్చనినీటిచే ముఖక్షాలనము చేసికొనుట; అద్దముచూచుకొనుట; వ్యాయామముచేయుట; అభ్యంగనము; స్నానముచేయునపుడు మేనురాచుకొనుట; తైలములతో ముఖలేపనము చేసికొనుట; ప్రాతఃస్నానము; స్నానానంతరము వస్త్రముచే బాగుగతుడుచుకొనుట; నిర్మలమైన నూతనవస్త్రధారణము; గంధలేపనము; చేమంతి మొదలైన పుష్పముల ధారణ; తాంబూలసేవన; ఉచిత

సమయమున నిద్ర; సుఖాసనము; ఆహారమున మామిడిపండురసము, పానకము, పనసపండు, పండిన చిరిసెన గలపప్పు, ఆవువెన్న, అప్పుడేకాచిన ఆవునెయ్యి, నువ్వులనూనె, కుంకుమపువ్వు, చెరుకు విరివిగ చేర్చుకొనుట; స్వర్ణరజితలోహాదిభస్మ సేవన దేహకాంతిని కలుగచేయును. మేను రాచుకొనుటకు ఉసిరికకాయరసము కాని, ముడిపెసలు 1 వడి, శనగలు ½ వడి ఒకటిగవిసరి అందు కస్తూరిపసుపు, భావంచాలు, కచోరములు, కోష్ఠు, వట్టివేరు, తుంగగడ్డలు, పచ్చాకు, దమనకుకాడలు, చందనం వీటి చూర్ణము సువాసన వలయునంత కలిపినపొడిని కాని యుపయోగించునది. వివిధకాలములందు చర్మకాంతిని పెంపొందించుటకు యీక్రింది గంధలేపసేవన మంచిది–అగరుచక్కగంధముతో చేర్చిన కుంకుమపువ్వును శ్రీగంధమును శీతకాలమున, కర్పూరము, కురువేరు వీనితో చేర్చిన శ్రీగంధము ఉష్ణకాలమున, కుంకుమపువ్వు కస్తూరి వీనితో చేరిన శ్రీగంధము వర్షఋతువునమంచిది. కుంకుమపువ్వు, అగరు, పచ్చకర్పూరం, కస్తూరి, శ్రీగంధము యివి 5 చేరిన మహాసుగంధము. కాంతినిచ్చును.

చర్మము విషయమున అవలంబింపవలసిన సూక్ష్మమైన మెలకువలను ఇట్లువివరించి ఈదిగువను క్షుద్ర చర్మరోగముల నిదానము వానిచికిత్సలను పేర్కొని చర్మకాంతిని పెంపొందించు ప్రత్యేకక్రియల నిచ్చుచున్నాను.

## మొటిమల నిదానము

కఫవాతరక్త ప్రకోపంబులచే యౌవనవంతులగు స్త్రీపురుషులకు ముఖమునందు బూరుగముండ్లవలె కఠినంబులైన పొక్కులుగల్గును. ఇయ్యది ముఖదూషిక యని యువానపిడకమనియు ననంబడును. దీనినే మొటిమలందురు.

## మొటిమలకు లేపనము

లొద్దుగచెక్క, ధనియాలువీనిని ఉదకముతో నూరిగాని; గోరోచనము, మిరియములు వీనిని ఉదకముతో నూరిగాని; తెల్లఆవాలు, వస, లొద్దుగచెక్క, సైంధవలవణము వీనిని ఉదకముతో నూరిగాని ముఖమునకు లేపనము చేసిన యౌవనపిటికలునశించును.

పండినమర్రియాకులు, జాజియాకులు, రక్తచందనము, చెంగల్వకోష్ఠు, మ్రానిపసుపు, లొద్దుగచెక్క వీనినినూరి లేపనముచేసిన ముఖమునందలి యౌవనపిటికలు మచ్చలు, నీలికమొదలగునవి నశించును.

లొద్దుగపూవు, కోతిమెరలు, వసనూరి పట్టించిన మొటిమలునశించును.

మర్రిచిగుళ్ళు టెంకాయచిప్పలు వీటినినూరి లేపనము చేయవలయును.

జాజికాయ, చందనము, మిరియాలు వీటినినూరి లేపనము చేయవలయును.

మద్దిపట్టను ఆవుపాలతో నూరి లేపనము చేసినను గారపంటిగుజ్జునుగాని ప్రాతనువ్వులపిండి, గోమూత్రము వీటినిగాని నూరి లేపనము చేసినను మొటిమలు నివృత్తియగును.

చందనతైలలేపనము, పునుగులేపనము హితము.

గజనిమ్మ, నారింజపండ్ల పైతొక్కముఖముపై రుద్దిన మొటిమలుపోవును.

## వ్యంగరోగ నిదానము

క్రోధముచేతను, ఆయాసముచేతను వాతము ప్రకోపమునొంది పిత్తములోగూడి ముఖమునందు వేదనారహితంబై సూక్ష్మంబుగను శ్యామవర్ణంబుగనునుండు పొడనుగల్గించును. ఇయ్యదివ్యంగమనంబడును. దీనినే లోకంబున మంగుఅని వ్యవహరించెదరు. ఇది ముఖమున తప్ప ఇతరతావులయందు జనించిన నీలికయని చెప్పబడును.

## వ్యంగరోగమునకు లేపనము

అర్జునవృక్షముయొక్క పట్టచూర్ణమునగాని, మంజిష్ఠాచూర్ణమునగాని తేనెగలిపి లేపనముచేసిన ముఖమందలి మచ్చలు నశించును.

పసుపును జిల్లేడుపాలతో నూరి లేపనచేసిన చిరకాలంబునుండి ముఖమున జనించియుండు మంగు నశించును.

బర్రెపాలమజ్జిగకి వెన్నదీసి మర్దనముజేసిన స్త్రీలకు ముఖమంగులు హరించి ముఖకాంతిగలుగును.

నేలతాడిగడ్డను తేనెతో నూరి ముఖమునందు లేపనము చేసిన మంగులు హరించును.

పచ్చిపసుపు, రక్తచందనము వీనిని బర్రెపాలతో నూరి లేపనము చేసిన ముఖమునందును, చెక్కిళ్ళయందు నుండు నల్లనిమండలములు శీఘ్రముగహరించును.

మణిశిల, లొద్దుగచెక్క, పచ్చిపసుపు, మ్రానిపసుపు, తెల్లఆవాలు వీటిని సమభాగములుగ నుదకముతో నూరి లేపనముజేసిన ముఖమునందలి నల్లనిమచ్చలు హరించును.

తెల్లదింటెన బూడిదను నవనీతములో కలిపి రాచినమంచిది.

నవనీతముతో చేసిన నెయ్యి, బెల్లము, తేనె, తేగ పండ్లరసము వీటినినూరి లేపనచేసినను వ్యంగములు నశించును.

మేకపాలలో ఉలిమిడిచెక్కనునూరి ముఖమునకు పూసిన వ్యంగములు నశించును.

జాజికాయ కల్కమునుపూసినచో నీలిరోగము, వ్యంగరోగముమున్నగునవి క్షీణించిపోవును.

జీలకర్ర, నల్లజీలకర్ర, నల్లనువ్వులు, ఆవాలు వీటిని సమభాగములుగ గ్రహించి ఆవుపాలతో నూరి లేపనము చేసిన ముఖమునందలి వ్యంగరోగములు నిశ్శేషముగ హరించును.

బూరుగుముండ్లను ఆవుపాలతో చక్కగనూరిగాని, తేళ్ళను మేకపాలతో నూరి యందు తేనెగలిపిగాని లేపనము చేసిన వ్యంగరోగము నిశ్శేషముగ హరించును.

కుంకుమపువ్వు గోరోజనము వీటిని చన్నీరుతో నూరి లేపనము చేసిన మంగునివృత్తియగును.

చెంగల్వకోష్టును 7 దినములవరకు మాదీఫలములో నుంచి పిదప దానిని చక్కగనూరి తేనెతో కలిపి లేపనము చేసిన వ్యంగరోగము నిశ్శేషముగ హరించును.

## ముఖకాంతికి లేపనము

రక్తచందనము, మంజిష్ఠ, లొద్దుగచెక్క, చెంగల్వకోష్టు, ప్రేంకణము, మర్రిచిగుళ్ళు, చిలుపెసగలు వీనిని సమభాగంబులుగ నుదకముతో నూరి లేపనము చేసిన మొటిమలునశించి ముఖమునకు కాంతిగల్గును.

పచ్చిపసుపు, మ్రానిపసుపు, మంజిష్ఠ, నెయ్యి, తెల్లఆవాలు, కావిరాయి వీనిని మేకపాలతో నూరి ముఖమునందు లేపనము చేసిన బాలసూర్యునివంటి కాంతికలుగును.

పాపర, నల్లయాతిపస, పట్టివేరు, నెయ్యి, సర్జరసము, మర్రిచిగుళ్ళు, పసుపు, మ్రానిపసుపు వీనిని మేకపాలతో నూరి లేపనముచేసిన ముఖము పద్మమువలె నుండును.

సాయంకాలమునందు ఆవనూనెతో రుద్దుకొనిన ముఖమునకు స్వచ్ఛమగు కాంతికలుగును.

దిరిసెనపుష్పము, పసుపు, మ్రానిపసుపు, మంజిష్ఠ, కావిరాయి వీటిని గొర్రెపాలతో వండి లేపనచేసిన చంద్రునివంటికాంతికలిగి ప్రకాశించును.

అతిమధురపు కషాయమునందు 4 పలముల తైలము చేర్చి మంజిష్ఠ, రక్తచందనము, కమలము, కేసరి (కుంకుమపువ్వు) వీటినికైచి కల్కము చేసి తైలమును దింపవలయును. ఇయ్యదికనక తైలము. ముఖమునకు కాంతినిచ్చును. నీలిక, వ్యంగము మున్నగు రోగములనన్నింటిని పోగొట్టును.

చేరేడుచిగుళ్ళు, మామిడిచిగుళ్ళు, పసుపు, మ్రానిపసుపు, కొత్తబెల్లము, పెరుగుమీగడ వీటినొకటిగ చేర్చి చక్కగనూరి లేపనము చేసినను, నల్లతుమికి రసమును లేపనము చేసినను ముఖమునకు మంచివర్ణము కలుగును.

## మెలుకవ

లేపనములు రాత్రి చేయరాదు. ఎండినవెంటనే తీసివేయవలయును.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి ధూళిపాళ సీతారామలక్ష్మిగారు

వద్దు, వద్దు
ఏమివద్దు?
నువ్వువద్దు—
ఏమినువ్వు?
పైరునువ్వు—
ఏమిపైరు?
వరిపైరు—
ఏమివరి?
పాలవరి—
ఏమిపాలు?
మేకపాలు—
ఏమిమేక?
కరిమేక—
ఏమికరి?
తోలకరి—

ఏమితోల?
పనసతోల—
ఏమిపనస?
పండుపనస—
ఏమిపండు?
జామిపండు—
ఏమిజామి?
తెల్లజామి—
ఏమితెల్ల?
ముఖముతెల్ల—
ఏమిముఖము?
మొద్దుముఖము—
ఏమిమొద్దు?
తుమ్మమొద్దు—
ఏమితుమ్మ?

అడవితుమ్మ—
ఏమిఅడవి?
చిట్టిఅడవి—
ఏమిచిట్టి?
దొంగచిట్టి—
ఏమిదొంగ?
తోడుదొంగ—
ఏమితోడు?
బాబుతోడు—
ఏమిబాబు?
బుచ్చిబాబు—
ఏమిబుచ్చి?
దోబుచ్చి—

౨. పాటలు

## బాలిక

శ్రీమతి కూచిభొట్ల కామేశ్వరిగారు

రంగురంగులపూలు బంగారుపూలు
ఆడరమ్మనితల్లు లాడిస్తువుండె
వాళ్ల చెల్లెలటమ్మ వచ్చిందిచూడు
గుమగుమాల అత్తరు గుప్పేస్తువుంది
అటుపోయివాళ్లతో ఆడుకుంటాను
ఆపూలలోతీపి అదియేమొగాని
తాగితేనాకళ్లు దాగిలిమూత.

## జోలపాట

శ్రీమతి పాకల రత్నమాలగారు

శ్రీరంగం వెళ్ళేటి చిన్ని వైష్ణవుడా!
ఇక్కడికి శ్రీరంగ మెంతదూరమ్మా?
అదిగదిగో నిమ్మల్లు అకుతోటల్లూ
అదిగోను శ్రీరంగంగాలిగోపురమూ
గాలిగోపురముపై నూరుచిలుకల్లూ
అందులో ఒకచిల్క తానుఅబ్బాయి.
శ్రీరంగంగట్టుక్రింద మొలక మొలచినది
వేదాంతమనియేటి వేరుప్రాకినది
తిరుమంత్రమనియేటి తీగవేసినది
హనుమంతమనియేటి ఆకువేసినది
పుష్పవతిఅనియేటి పూవుపూచినది
పరమాత్మఅనియేటి పండుపండినది
ఆపండు అబ్బాయి చేతికందినది.
ఊరికిఉయ్యెల లమ్మవచ్చినవి
కొనరెకొనకులతల్లి కొనరెఉయ్యాల
చాటకొంగునచేరెడుముత్యాలుపోసి
కొన్నాది శ్రీదేవి బొంగుటుయ్యాల.
లోభివానియింట కోటిధనమేలా?
చంకబిడ్డలేని చక్కదనమేలా?
ఆటమాణిక్యమే పాటమాణిక్యం
నట్టింటఅబ్బాయి రత్నమాణిక్యం.
అబ్బాయిమామల్లు ఎటువంటివారు?
చెవిచెవికి బారడేసికమలాలవారు
అష్టభాగాలవా రంగీలవారు
వేక్కగుర్రాలెక్కి వేటాడువారు.
ఆడంగముద్దమ్మ పాడంగముద్దు
నట్టింట మాపాప నవ్వంగముద్దు.
పందిట్లో అబ్బాయి పారాడినాడు
పాపడిబుద్ధులు పంచదారల్లు.
ఉత్తముని పేరేమి? ఊరిపేరేమి?
సత్యపురుషులగన్న సాధ్వి పేరేమి?
ఉత్తముడు దశరథుడు ఊరుఅయోధ్య
సత్యపురుషులగన్న సాధ్వికౌసల్య.
ఇల్లాళ్ళుముగ్గురే ఈదశరథునకు
పిల్లాళ్ళునలుగురే పేరుగలవాళ్ళు
అయోధ్యలోవారు అందరున్నారు
సయోధ్యలోవారు సరిలేనివారు
సీతామహాదేవి సృష్టిలోపలను
మాతల్లివెలసినది మహనీయురాలు.
కృష్ణమ్మనంటివాడు కొడుకొకడుపుడితే
కష్టాలుకడతేరు కన్నతల్లులకు
జోజోజో నంద! జోజోపరమనంద!
జోలపాడెదనయ్య! నిద్రబోవయ్య!

3. కథలు

## పొంగలి ప్రహసనము

శ్రీమతి యన్. వెంకమ్మగారు

అనగాఅనగా ఒకఊళ్లో ఒకబ్రాహ్మణుడు, ఆయనభార్య ఉండేవాళ్లు. వాళ్ళకు కొన్ని ఎకరాలభూమికలదు. ఒకబఱ్ఱె ఒకదూడా వుండేవి. ఒకనాడు భార్య "ఏమండీ! ఈరోజున చక్కెరపొంగలి చేస్తానండి" అని అన్నది. "సరేనే, పొంగలికి నెయ్యికావలెనుకదా నేను మంచినెయ్యి తెచ్చి ఇస్తాను ఆనెయ్యివేసి చేస్తే ఇంకాబాగుంటుంది" అని ఆయన ఎక్కడికో

వెళ్లి ఘుమఘుమలాడుచున్న వెన్నకాచిననెయ్యి తెచ్చాడు. ఆమె వాళ్ళఇంటిలోవున్న బత్తెం పాలు చిక్కనివిపోసి చక్కెర, ముంతమామిడిపప్పు, ద్రాక్ష, యాలకులు, శెనగపప్పు, పెసలపప్పు, ఈనెయ్యివేసి చాలారుచిగా పొంగలిచేసినది. భార్యభర్తలిద్దరు పొంగలిభోంచేశారు. "ఓసీ! పొంగలి ఎంతరుచిగావున్నదే? ఇంతరుచిగల పొంగలిని నేనెప్పుడు తినలేదు. ఈదినం మొదలు నీపేరుపొంగలి అనిపిలుస్తాను" అన్నాడు. "ఛాల్లెండి! మీనెయ్యివల్లకదా ఇంతరుచిగా వుండేది మిమ్ముల నెయ్యిఅని పిలుస్తాను" అని అన్నది ఆమె. "సరేనే, మనకు బత్తెంవుండటం చుట్టమువచ్చినా పక్కంవచ్చినా మజ్జిగకు పాలకు అన్నిటికీబాగున్నది. దానిపేరు చుట్టం అని పెడదాముఅన్నాడు. "సరేనండి దూడ దయ్యంవలె పీడించుకొని పాలుతాగుతుంది కనుక దానిపేరు దయ్యం అని పెడదా"మన్నది. సరేనని అదేవిధముగా గేదెను దూడను పిలుచుకుంటున్నారు. ఒకరోజున బ్రాహ్మణుడు తన పొలానికివెళ్ళాడు. పొరుగూరిబ్రాహ్మడు ఒక అయన ఇంకోఊరికి ఈపొలముమీదుగా వెళ్ళుచున్నాడు. "మననెయ్యి" ఆబ్రాహ్మణుని చూచి "ఓహో! అవధాన్లుగారు! ఇంతఎండలో ఎక్కడికివెళ్ళుతున్నారు?" అని అడిగాడు. "నేను ఈదగ్గర పల్లెటూరికి వెళుతున్నా"నని అవధాన్లు బదులుచెప్పాడు. "సరెసరె అవూరికి వెళ్ళేసరికి భోజనానికి ఆలశ్యంఅవుతుంది. మనఇంటికి వెళ్లి పొంగలివున్నది భోజనముచేసి కొంచెము విశ్రాంతితీసుకుని సాయంకాలం ఊరికి వెళుదురుగాని"అన్నాడు. సరేనని అవధాన్లు ఆశతో మన నెయ్యి ఇంటికివచ్చాడు. "మననెయ్యి"భార్య అవధాన్లుకు కాళ్లకుసీళ్లు తెచ్చిఇచ్చి క్షేమములు అడిగి"నెయ్యి" వచ్చిందాకావుంటారా ఇప్పుడే భోంచేస్తారా అని అడిగింది. సరేనమ్మా నెయ్యివచ్చినతరువాత తింటాలే అన్నాడు అవధాన్లు. బజారుకు నేతికి వెళ్ళివున్నారేమో పొంగలి సిద్ధముగావున్నది నెయ్యివేసుకుని తినవచ్చును అనుకున్నాడు. ఆమె ఇంటి పనులు చూచుకోపోయినది. అవధాన్లుగారు 12 గంటలనుండి సాయంకాలం నాలుగుగంటల వరకు చూచారు. కడుపులో ఆకలిమండిపోతున్నది. ఇంకానెయ్యిరాలేదే,ఒట్టిపొంగలి అయినా తినకపోతినే అని ఎదురుచూస్తూవున్నాడు. సాయంకాలం అయిదుగంటలకు ఆడుచుపాడుచు "నెయ్యిగారు"వచ్చి"ఓసిఓసి చుట్టాన్నికట్టేసిదయ్యాన్ని విప్పవే"అన్నాడు. మన అవధాన్లుకు పైప్రాణములుపైనేపోయి ఒక్కపరుగున వీధిలోకి పరుగెత్తేడు. వీళ్లు ఆలుమొగడు ఇద్దరుచూచారు. కూడా పిలుస్తూ వెంటపడ్డారు. ముందుఅవధాన్లు వెనకవీళ్ళిద్దరు వీళ్ళవెనుక ఊరిజనము పరుగెత్తుతున్నారు. అవధాన్లు తిరిగిచూడకుండా వెళ్లుతున్నాడు. ఆఖరకు అవధాన్లను పట్టుకున్నారు. గడగడవణకిపోతున్నాడు అవధాన్లు. తర్వాత సంగతేమని తెలుసుకోపోతే చుట్టాన్నికట్టేసి దయ్యాన్ని విడిపించమన్నాడు నాకుభయంవేసి పరుగెత్తుతున్నానుఅని అవధాన్లుచెప్పాడు. మననెయ్యిగారు "కాదండి దానిపేరు పొంగలి నాపేరు నెయ్యి బత్తెంపేరు చుట్టం దూడపేరు దయ్యం అనిచెప్పి అవధాన్లనువూరడించి ఇంటికిపిలుచుకొనివచ్చి తృప్తిగా భోజనంపెట్టి పంపించారు. కథకంచికి మనంఇంటికి.

# ఇందరిలోను ఆ అదృష్టవంతు లెవరో?

శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మి గారు

పూర్వము బందరులో నొకసంపన్న వైశ్యకుటుంబముండెడిదట. వారు తరతరములనుండి సమిష్టి కుటుంబముగ నేకభాండాశనులై యుండిరట. కుటుంబాభివృద్ధియైనకొలది వర్తకమును, వర్తకము అభివృద్ధి కొలది యార్జనయు వృద్ధియై పెక్కు భూముల నార్జించి దివ్యభవనములనుగట్టి వర్థిల్లుచుండిరి. ఇట్లు పెక్కు కుటుంబములతో నిండిన ఆసమిష్టికుటుంబములో కొందరికి పంచుకొనవలెనని సంకల్పముకల్గి రానురాను కార్యాచరణములోనికి దిగినది. కుటుంబయజమాని చేయునది మరియేదియు లేక పంచిపెట్టుటకు నిశ్చయించి పెద్దమనుష్యులయెదుట భూములను, లోగిళ్ళను వాటాలువేసి పాగీగత్తులు వ్రాయించి, సంతకములను చేయించెను. ఆరాత్రి నవకాయపిండివంటలతో నందరు స్త్రీపురుషులుగలసి సమిష్టిగా విందారగించిరి. మరునటినాటి నుండియు ఎవరికాపురము వారిదేగనుక ఆరాత్రి సరససల్లాపములలోనే ఆవిందుజరిగినది. భోజనానంతరము వీథితలుపులు మూయబడినవి. కుటుంబమువారందరును, స్త్రీపురుషులుకలసి పెద్దచావడిలో రత్నకంబళిమీద నాసీనులై సరసగోష్ఠినుండుతరి కుటుంబయజమాని ఆప్రక్క నేయున్న నేలభోషాణమును తెరచి సంచులలో నున్న ధనమంతయు పైకిదీసి రత్నకంబళిపై క్రుమ్మరించెను. మానికతో ఆధనరాశిని కొలచి వాటాలప్రకారము పంచిపెట్టెను. ఎవరివాటావారు గ్రహించి సంతోషించుచుండిరి. అటుపిమ్మట కుటుంబయజమాని కంబళీనలువైపులను ఎవరివాటా ధనమును వారివద్ద సంచులలో పెట్టుకొనియుండిన తనబంధువులతో "మన ముత్తాతలనుండియు, అభివృద్ధిలోనికివచ్చిన మన వ్యాపారము నేడు వృష్టిలోనికి దిగినది. మనకుటుంబమును వ్యాపారమును క్రమక్రమముగా వృద్ధియైనది. ఈఅభివృద్ధికి కారణము మనమందరమును కానేరము. మనలో ఒకరిద్దరు అదృష్టవంతులుండబట్టియే ఈయభివృద్ధికి కారణము. ఆండలి ప్రతిఫలమును సమిష్టిమీద మనమందర మును నేటివరకు అనుభవించుచున్నాము. కాని రేపటినుండి ఇందరిలోను ఆఅదృష్టవంతులెవరో? వారదృష్టము కొలది వారుమాత్రమే క్రమక్రమాభివృద్ధి పొందగలిగెదరు. మిగిలినవారిసంగతి దైవాధీనము. నేటితో నానెత్తిపై బరువు దిగిపోయినది" అనిచెప్పి యూరకొనెను. ఆసభలోనందరును ఒకరిముఖమొకరు చూచుకొనసాగిరి. ప్రతివారును "ఇందరిలో ఆఅదృష్టవంతులెవరో" అని సందేహము పొందసాగిరి. ప్రతివారును తమభావిగతి యెట్లుండునో యని భయపడసాగిరి. వైశ్యులు స్వతహా కార్యవాదులు గనుక తుదకు వారిలో వారు భార్యలతోను, మిగిలినవారిలోనూ గుసగుసలాడుకొని యజమానితో "అన్నా! కుర్రవాళ్ళమాటలు పెట్టుకొని నీవు తొందర పడ్డావు" అని యొకరును "బుల్లినాన్న ముందుఅనకపోతే పెదనాన్నగు నేనంతగా ఒత్తిడిచేస్తానా?" అని మరొకరును ప్రసంగింపసాగిరి. ఇట్లు కొంతప్రసంగమైన తర్వాత అందరును ఏకవాక్యముగా "మామూలుగా సమిష్టిగానే పోనిచ్చుకుందాం" అని స్థిరపరిచిరి. సంచులన్నియు తిరిగి నేలభోషాణములోనికి దింపిరి. మరునాడు మామూలుగా ఎవరికి విధింపబడిన వ్యాపారమును వారు చక్కపెట్టుకొనసాగిరి. సోదరీమణులారా! చూచితిరా? సమిష్టికుటుంబమందలి ప్రభావము. ఈపద్ధతి ప్రపంచమంతటిలోనూ మన హిందువులయందు మాత్రమే యున్నది. దీని ప్రభావమువల్లనే మనదేశము ఒకప్పుడు మహోత్తరమైన స్థితిలోనుండినది. దీనిప్రభావమువలననే ఈనాడుకూడా మనసంఘము ఈస్థితిలోనైనను నిల్చియున్నది. సమిష్టకుటుంబపద్ధతి మానవసంఘమునకు సహజమైనది. ఈసదాచారమును మనపూర్వులు పూర్వమునుండియు కాపాడుచువచ్చిరి. సమిష్టికుటుంబములో ప్రతివ్యక్తియొక్క భారమును అందరిపై మోపబడియుండును. అందువలన ప్రతివానికిని కాలము పోయిగా

జరుగును. కుటుంబములో నందరితో కలసి కీడు మేళ్ళు సమభవించుటలో కూడ నొకవిధమైన ఆధ్యాత్మికశక్తికి ఉపకరణము. "ధర్మాచరణము గృహమునందే ప్రారంభమగును" (Charity begins at home) అను మహత్తరమైన నీతికి సమిష్టికుటుంబమే తావలము. కాని సమిష్టికుటుంబమును జయప్రదముగా జరుపనియెడల నది యొకప్పుడు పెక్కు అనర్థకములకు హేతుభూతమగును. దానిని చక్కగా నెరవేర్చుటకువలయు నేర్పు కుటుంబయజమానులైన స్త్రీపురుషులయందుండవలయును. యజమానిగాని అతనిభార్యగాని తాము పెద్దలమని విర్రవీగకూడదు. ఇతరులకు అన్యాయము చేయకూడదు. అందలి యజమానులు తక్కినవారికందరకు తాము నౌకరులమనియు తాము వారికి సేవజేయుట పరమార్థదాయకమనియు నమ్మి చరించవలెను. సాధారణముగా సమిష్టికుటుంబములో వచ్చెడు అనర్థకములు అందలి స్త్రీలవలననే వచ్చుచుండునని పెద్దలు చెప్పుదురు. సమిష్టికుటుంబములోని పురుషులందరును ఒక్కయింటబుట్టి ఒక్కయింట పెరిగినవారేయగుటచే వారిలోవారికి, ఐకమత్యమును అన్యోన్యసహానమును కుదిరియుండుట సహజమే! కాని ఊరునకొక్కతె చొప్పున చేరిన సమిష్టికుటుంబపు కోడండ్రకు అన్యోన్యసహానముండుట కడుకష్టము. స్త్రీకి పురుషునకంటె ఈసుగుణము మిక్కిలి అగత్యము. కావున మనసోదరీమణులు ఈరహస్యమునుగ్రహించి తాము స్వయముగా ఈసుగుణము నవలంబించి తమపుత్రికలకుగూడ దీని పరమార్థమును బోధింతురుగాకయని ప్రార్థించుచున్నాను.

# నామాలు నాకొంపతీశాయి

శ్రీమతి తూచిభొట్ల గంగమాంబగారు

అనగనగా ఒకవూళ్లో ఒకఆచార్లవారు ఒకసాహెబుగారు వుండేవారు. వాళ్ళిద్దరిమధ్య ఎప్పుడూ పచ్చగడ్డివేస్తే భగ్గుమండేది. ఇట్లాకాలం జరిగినకొద్దీ వాళ్ళపోట్లాటలు పెద్దవుతూవచ్చాయి. సాహెబుగారి గెడ్డంచూస్తే ఆచార్లవారికి కోపం, ఆచార్లగారి నామాలుచూస్తే సాహెబుగారికికోపం. ఎట్లాగు బ్రతికేది యిట్లా? కాని ఒకరినొకరు యేమిచేసుకోలేకుండా వుండేవారు. ఎంతతీసిపోయినా పెద్దవాళ్ళుగా! ఆచార్లగారు సాధించలేక వూరుకునేవాడు సాహెబుగారు యెన్నియిబ్బందులుపెట్టినా. కాని సాహెబుగారు యెట్లాగయినా సాహెబుగారేగా. ఓరోజున కొడుకునిపిలిచి "నీవు బజారుకుపోయి చిన్న ఆచార్లు పోయేటప్పుడు కాపలాకాచి వాడిని యిబ్బంది పెట్టవలసినది" అని చెప్పాడు. తండ్రికికొడుకేగా! సరేఅన్నాడు. అట్లాగే ఆవేళకాపలాకాచి చిన్నఆచార్లుని పట్టుకున్నాడు. యేంచెయ్యటానికి తోచలా అప్పుడు. సరే! చివరకు యేమనుకున్నాడోగాని చిన్నఆచార్లుమీదపడి వాడినామాలన్నీ నాకేశాడు. ఆచార్లువెళ్లి తండ్రితో చెప్పేడు. ఆయనేంచేస్తాడు? ఇట్లాకొన్నాళ్లు గడిచింది. ఆచార్లు యెత్తుకుపైయెత్తు వేయగలడుగాని బలాబలానికి ఆగగలడా? ఇంక ఆలోచించటం మొదలుపెట్టాడు. ఏంతోచిందోగాని కొడుకునిపిలిచి వోకానీసాధికొనుక్కొనిరమ్మన్నాడు. ఆనాటే అరగతీసిపంగనామాలు పెట్టాడు అవాళ్ళ. మామూలుకేమి భంగంలేకుండా ఆరోజునకూడ చిన్నసాహెబుగారు ఆచార్లగారినిపట్టుకొని నామాలునాకేసి నాకేశాడు. తండ్రితో చెప్పుదామని యింటికివెళ్ళేసరికి ఆసంతోషానికికూడ ప్రాప్తిలేకపోయిందిగనుక ఢామనిచచ్చాడు. పెద్దసాహెబుగారి యింటినిండా యింక లబలబలు దిబదిబలు. గొల్లుమన్నారు అందరూ. నిమ్మళంగా సంగతంతా బయటపడింది. పిచ్చెత్తిపోయింది పాపం పెద్దసాహెబుగారికి. ఎవడుతీసుకున్నగోతులో వాడేపడతాడని పెద్దలూరికే అన్నారా! బ్రతికున్నంతకాలము సాహెబుగారు "నామాలునాకొంపతీశాయో" "నా మా లు నా కొం ప తీశాయో" అని యేడ్వటమే. అసలుసంగతి తెలియనివాళ్ళు ఆచార్లగారినామాలకు అంతమహత్తుందా అని అనుకోటం మొదలుపెట్టారు. ఆచార్లగారు కనబడితేచాలు సాహెబుగారు ఆయనకాళ్ళమీదపడి "బాబో! మీనామాలు నాకొంపతీశాయి" అని యేడ్చేవాడు. ఇంతే కథకంచికి మనంయింటికి.

# "ఎన్నడో స్తివే? వరిమెతుకా!"

శ్రీమతి అద్దంకి రామేశ్వరమ్మగారు

అనగా, అనగా ఒకవూళ్ళో ఒక అత్తా, కోడలు, కొడుకు ఉండేవాండ్లు. అత్తగారు కోడల్ని చాలవేధించుచుండేది. కాపురానికొచ్చింది మొదలు పుట్టింటికెన్నడు పంపిందికాదు. కోడలికి వరెన్న మెప్పుడు పెట్టేదికాదు. ఎప్పుడైన జొన్నన్నంపెట్టి తరుచుగా వరిగంజిపోసేది. పొరపాటుననైన ఒకవరిమెతుకు గంజిలో పడనిచ్చేదికాదు. పాపమాకోడలు పట్టి అమాయికురాలు. పెనిమిటితోనైన యెప్పుడు చెప్పిందికాదు తనస్థితి. చాలాకాలం జరిగిపోయింది. తర్వాత ఒకరోజున అత్తగారు ఒకగిన్నెలో గంజపోసి కోడలికిచ్చి యెక్కడికోపోయింది తొందరగా. అత్తగారి పొరపాటుననో లేక తొందరపాటుననో గాని గంజిలో ఒకవరిమెతుకు పడింది. కోడలు గంజిత్రాగుదామని కంచంలోపోయగా అడుగున వరిమెతుకు కనపడ్డాది. పాప మామె సంతోషానికి మేరలేదు. ఎన్నడువరిమెతుకు కనిపించకపోవడంచేత నేడెంతసుదినమో తనకంటికి వరిమెతుకు కనపడ్డదని ఆమెతుకును పీటమీదపెట్టి పసుపు, కుంకుమ, పూలతో "యెన్నడో స్తివే? వరిమెతుకా! నిన్నెన్నడుచూస్తినే? వరిమెతుకా!"అని పూజ చేస్తున్నది. ఉద్యోగానికి వెళ్లిన పెనిమిటి యేదోపుస్తకం మరచిపోయి తీసుకవెళ్లడాని కప్పుడే ఇంటికొచ్చాడు. భార్యచేస్తున్నపూజ చూచాడు. "ఇదంతా ఏమిటి?"అన్నాడు. "నేను కాపురానికొచ్చింది మొదలు నేటివరకు గంజేగాని వరిమెతుకెన్నడు చూచియెరుగను. నేడు కనుపించడంవల్ల నాకుకన్నులపండుగైంది; అందుచేత పూజచేస్తున్నాను"అంది భార్య. "నాతో ఎన్నడు చెప్పేవుకా"దన్నాడు. పాపమామె అమాయకత్వానికి జాలిపడ్డాడు కొంచెంసేపు. "నేటితో నీకష్టం తీరిపోయింద"న్నాడు భర్త. తానువెళ్లి పక్కఇంట్లో తల్లివచ్చిందాకావున్నాడు. తల్లివచ్చింది. పసుపు, కుంకుమ, పూలు చూచింది. ఇదేమిటని కోడల్ని కసరుచుండగా కొడుకొచ్చాడు. "అమ్మా, అమ్మా! ఇవ్వాళ మనఊరి కొకబ్రహ్మరాక్షసొచ్చింది. అది అత్తల్ని కోడండ్లుగాని; కోడండ్లను అత్తలుగాని సరిగ అన్నంపెట్టక కష్టపెట్టినవాండ్లను యీరాత్రికే మ్రింగేస్తుందట. మనయింట్లో అటువంటివేమి జరిగియుండలేదు కదా!" అన్నాడుకొడుకు. తల్లికి గుండెపగిలింది. "నాయనా! నన్నెక్కడైన దాక్కొపెట్టు" అన్నది కొడుకును. "ఎక్కడున్నావస్తుంది. మననూతిదగ్గర వేపచెట్టున్నదికదా! దాని కొమ్మలు నూతిమీదికున్నవి. ఆకొమ్మను రెండుచేతులతో గట్టిగపట్టుకొని నూతిలోకివేళ్లాడితే రాక్షసిభయంవుండ"దన్నాడు కొడుకు. రాక్షసి నిజంగా మ్రింగేస్తుందన్న భయంచేత ఎట్లాగైన చావు తప్పించుకోతలచి సాహసించి తల్లి అట్లాగేచేసింది. ఈలోపల కోడలు పప్పు వరెన్న మొండుకొని చెట్టుకొమ్మను వ్రేలాడుతువున్న అత్తగారెదురుగావచ్చి "పప్పు

ముద్ద, అత్తా! ఆయం"అని నోరూరించింది. అత్తగార్కి కడుపుమండింది. కసిదీర ఒక్కసారి "ఓసి నీయమ్మ కడుపుమాడా"యని రెండుచేతులు కోడలిమీదికి విసిరింది. పాపం, విసరే సరికి గభీమని నూతిలోపడిపోయింది. అప్పటినించి కొడుకు, కోడలు సుఖంగాఉన్నారు. కథ కంచికెళ్లింది. మేమింటికొచ్చాము. కథచెప్పినవాండ్లనోట్లో కుంచెడునరహాలు. "ఊ" కొట్టిన వాండ్లనోట ఊచబియ్యం.

## వంచన

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

పట్నానికి దగ్గరగానే ఓగ్రామంవుండేది. ఆగ్రామానికి జమిందారుఉండేవాడు. పైకి బటారం, లోపలలొటారంఅన్నట్లు, పైకిజమిందారుఅన్న పేరేగాని, లోపల, లోపల, ఆజమిందారు దివాలాతియ్యటం మొదలెట్టాడు. ఈసంగతి ఎవ్వరికీతెలియదు. ఆజమీందారుదగ్గర నమ్మకంగల నౌకరు, దాసీది వుండేవారు. భార్యా కూడావున్నది. కానిపిల్లలులేరు. ఈ జమీందారు తనబీదతనానికిచింతిస్తూ భార్యతో ఒకఉపాయం ఆలోచించేడు. డబ్బువచ్చే మార్గానికోసం వెంటనే బజారులోనించి మూడు రూపాయలుపెట్టి ఓరబ్బరుబొమ్మనుకొని, దాన్ని అచ్చంగా పిల్లాడిలాగ బట్టలువేసి, ఒకశాలువకప్పి అందరూకలిసి ఆపిల్లవాడిని పట్టుకొని, రెండుకార్లలోకూర్చుని అందరూ రవ్వలషాపుకివెళ్లేరు. గొప్పజమిందారు వచ్చాడు. ఎంతవిలువగలసరుకులు కొంటాడోఅని ఆషాపువాళ్ళంతా వారికిమర్యాదచేసి కూర్చోబెట్టారు. జమీందారు దంపతులిద్దరూకలిసి 30 వేలరూపాయల విలువగలనగలు కొనడానికిఏర్చేరు. ఇంతలో ఆజమిందారు అయ్యో యెంతపొరపాటయింది? పెట్టెతీసి, కూడాసొమ్ముతేవటం మరచిపోయాను. అని, నీవువెళ్లి ఇనుపపెట్టెతీసి, సొమ్ముతీసుకురా? అందాక నేను పిల్లాడు, దాసీది, ఇక్కడవుంటాము. నౌకరివాడిని తోడుతీసుకువెళ్లి ఈ నగలన్నీ పెట్టెలోవుంచి వేగంసొమ్ముతీసుకురా అని భార్యతోచెప్పి ఆమెనూ, నౌకరివాడిని కార్ పైనఇంటికిపంపించినాడు. ఇలాఅరగంటగడిచింది. అయ్యో! తాళాలు ఎక్కడున్నాయో చెప్పడంమరచిపోయాను. వెతుక్కుంటారేమో. నేనువెళ్లి రెండునిమిషాల్లో సొమ్ముపట్టుకువస్తాను. అందాక పిల్లాడు, దాసీది ఇక్కడుంటారుఅని ఆషాపువాళ్లతోచెప్పి, మరిఒకకారుమీద జమీందారు వెళ్లిపోయాడు. ఇంతలో దాసీది పిల్లవాడిని అక్కడఉన్న సోఫామీద పండుకోబెట్టి శాలువకప్పి షాపువారితో ఏమండీ! నాకు చాలా దాహంవేస్తోంది, ఫక్కనే సోడాషాపువుంది సోడాత్రాగివస్తాను. ఈపిల్లాడినిచూస్తుండండి, దొర్లిపోతాడు జాగ్రత్తఅనిచెప్పి పైకివెళ్లింది. ఎంతసేపైనా వెళ్లినవాళ్లెవళ్లూరాలేదు. పిల్లవాడు కదలడు, మెదలడూ. వీళ్లకి అనుమానంవేసి సోఫాపైనవున్న పిల్లవాడిని శాలువతీసి చూశారు. వెంటనే నిజంగ్రహించి జరిగిపోయిన గొప్పమోసానికిచింతిస్తూ పోలీసుకి రిపోర్టుచేసి, వాళ్లని, వెతికించేరు. కాని ఎంతవెతకినా వాళ్లఆచోకీ ఏమిన్నీదొరకలేదు. ఇది నిజముగా జరిగిన మోసము.




## ౧ దాగుడుమూతలు

తూరితే, పిల్లి పారితే పిల్లి
పడమటక్కల్లారా! పారిపొండోయి.

ఒకపిల్లకు కన్నులుమూసి మిగిలినపిల్లలను ఈపాట పాడుచు పారిపొండని చెప్పి వారుదాగిన పిమ్మట కన్నులుమూసిన యాపిల్లను వారినిపట్టుకొనుటకు తల్లి యని పేర్కొనబడుపిల్ల వదలిపెట్టును.

— తకుండీ వేంకటశాస్త్రి

## ౨ ప్రశ్నోత్తరములు

చేతులేమిచేశావు?
పిల్లెత్తుకుపోయింది—
పిల్లినేమిచేశావు?
గోలకొండతోలా—
గోలకొండ దేమిచ్చింది?
గుడ్డిగవ్వ—
గుడ్డిగవ్వేంచేశావు?
కుమ్మరవాఁడికిచ్చా—
కుమ్మరవాఁడేమిచ్చాఁడు?
కుండయిచ్చాడు—
కుండేమిచేశావు?
బావిలోవేశా—
బావేమియిచ్చింది?
నీళ్లిచ్చింది—
నీళ్లేమిచేశావు?
కాయచెట్టుకు, పూచెట్టుకుపోసా—
కాయచెట్టు, పూచెట్టు యేమిచ్చింది?
కాయచెట్టుకాయ
పూచెట్టుపూవు యిచ్చింది—
కాయేమిచేశావు?
కాయమాతాత కొట్టుకుతిన్నాడు—
పూవేమిచేశావు?
పూవుమాఅక్కతలలోపెట్టా.

—మరకాని పరాత్పరరావు.

---

బాలక్రీడలవర్ణన, వివరము; వానికిసంబంధించినవాఙ్మయము, పాటలు సేకరించి 'గృహలక్ష్మి'కి అనుగ్రహింపవలసినదిగా ఆంధ్రమహాజనులను వినయపూర్వకముగ ప్రార్థించుచున్నారము. —సంపాదకుడు.

---



## స్త్రీ విద్య: గ్రంథాలయములు :—

"స్త్రీమండలివారి నిమిత్తము కొన్ని ప్రత్యేక గ్రంథాలయములు నెలకొల్పబడవలెను. అందుముఖ్యముగా స్త్రీలకు తమ జీవితములో అక్కరకువచ్చునటువంటియు నీతిదాయకమును, గృహనిర్వాహణా విషయికమును, శిశుపోషణాసంబంధమును, బంధుమిత్రాదుల నాదరించు వ్యవహారమునట్లను, భర్తలకుగాని, తదితరులకుగాని యేదైనను సలహానొసంగుటకు వీలగునట్లును, ఈ మొదలగు విషయములలో స్త్రీలవాభివృద్ధికి తెచ్చు గ్రంథరాజములను సంపాదవలయును. గ్రంథాలయములకేవచ్చి చదువుకొను స్త్రీలకు పుస్తకములు యుచితముగానిచ్చి ప్రోత్సాహపరచుటకు గ్రంథాలయాధికారులు ఎట్టియభ్యంతరమును చూపరాదు. గ్రంథాలయములకు చందాదారులుమాత్రమే రావర్హులను నిబంధనను ప్రథమమున తీసివేయవలెను. మొదటలో వారికి గ్రంథపఠనాభిరుచియందు ప్రవేశము కుదురువరకు చందాపద్ధతుల నంతగా పాటించరాదు. చందాలిచ్చుకొనలేనివారలను పీడించుకతినుటకన్న యివ్వగలిగిన ధనవంతులవద్ద పుచ్చుకొనుటలో తప్పేమియులేదు. ఇది మొదటిపద్ధతి. ఇక రెండవపద్ధతేమన:—గ్రంథాలయములవారు తమయొద్దకువచ్చి చదువుకొనవీలులేనటువంటివారికి పుస్తకములను యింటికి పట్టుకొనివెళ్ళి వారికవి అందజేసి చదివించుట. ఇది యించుమించుగా బలవంతముచేసి చదివించురీతిగా ఉండునుగాని బయటకువెళ్ళి చదువుకొనుట కవకాశము లేనిపట్లను, చదువుమీద అంతగా యిష్టత లేనిచోట్లను, యీమోస్తరుచేసి యుత్సాహము కలుగజేయుటతప్ప అన్యమార్గములేదు. ప్రతినిత్యమును స్త్రీలకక్కరకువచ్చు పుస్తకరాజములనే యొకపెట్టెయందునిచి అదియొక మనిషిచేత ప్రతియింటికిని పంపి పుస్తకములు అందచేయుచుండవలెను. మొదటలో రెండుమూడురోజులు ఆపుస్తకము చదువవలసిన దినములకన్న యెక్కువరోజులు చదివినను కోపగించుకొనక క్రమేపి వారలకు గ్రంథపఠనయందు అభిరుచి జనించుటను బాగుగా గుర్తించినవెంటనే ఆయాపుస్తకపఠనాకాలనిర్ణయముల క్రమక్రమముగా తగ్గించుచుండవలెను. ఎవరికైనను ఏవిషయమందైనను అభిరుచి మొదట కలుగుటే కష్టముగాని అది కలిగినచో దానినివిడచుట దుర్లభముగదా! కనుక మొదటిలో కష్టముగానున్నను అదియొక కష్టముగాభావించుకొనక స్త్రీవిద్యాభివృద్ధి విషయములో ఎక్కువగా కృషి యీరీతిని చేయవలసియుండును. పుస్తకములు నలిపి రద్దుచేయుదురనిగాని పారవేయుదురనిగాని అనుమానముండునుగాన స్వల్పముగా చందాపద్ధతి దీనికియుండవలెను. ఈపద్ధతులతో గ్రంథాలయములవారు కృషిసలిపిన భారతనారీమణుల యౌన్నత్యమున కెక్కుడుతోడ్పడినటుల భావింపవచ్చును. కావున గ్రంథాలయములవారిది గుర్తించి త్వరలో ఆచరణకు తెత్తురుగాకయని వినయముగ ప్రార్థించుచున్నాను."

—కాంచనపల్లి వేంకటరంగారావు.

**ఆరోగ్య భాగ్యము:—**

"పవిత్రవంతమగు మన భారతవర్షమున, రాను రాను ప్రతిగృహమందును ఆరోగ్యభాగ్యము లభించుట యరుదై, ఆబాలగోపాలమును దేనియోయొక వ్యాధిబాధితులుగనుండుటయును, నిరంతరము ఔషధసేవా తత్పరులుగనుండుట మన మెల్లరమును రుజింగిన విషయమే. భారతజాతి యుత్పత్తిదశయందుట ముందుగ పూర్ణారోగ్యవంతులగు యువతీయువకులు కతిపయ వర్షములలో నెదుర్కొని మాతృసేవ చేయుట మిక్కిలి ఆవశ్యకముగ గానవచ్చుచున్నది. ప్రాచీనవైద్యవిధానము ననుసరించి బాల్యమునుండియు అనేకవిధములైన చికిత్సలు మాతలే పూర్వము చేయుచుండెడివారు. ప్రస్తుతసమయమునగూడ తల్లితండ్రులు తమ బిడ్డలను కడుంగడు జాగరూకతతో పెంచి, వారలకు తగు విద్యాబుద్ధులు చెప్పించిననేగాని భావిదేశోద్ధారకులగు వారు ఏమి చేయుటకునుగూడ శక్తిగలవారు కాజాలరు. మన పట్టణములయందలి స్త్రీలను చిన్నిబిడ్డలను ఔషధశాలలకు గొనిపోయి మందులిప్పించుటవాడుకయై, సామాన్యపు (జలుబు) పడిశము, దగ్గు, జ్వరము మొదలగు వ్యాధులకుగూడ నేమి చేయుటకు దెలియక ఇతరులకై దిరుగులాడుచున్నారము. మనము గృహమందు ప్రతిదినము వాడుక చేయు నాహారపదార్థములలో మార్పు చేయుచుండుటచే నొక్కొకవిషయమున లాభకరముగ నుండునని వైద్యశాస్త్రజ్ఞులుగూడ నభిప్రాయపడుచున్నారు. ప్రస్తుతసమయమున దేశమునందలి స్త్రీలను స్వాతంత్ర్యసమరమున బాల్గొనుచుండుటయును, లేనియువతులు ఆంగ్లేయవిద్యావిధానము ననుసరించుటయును మనము చూచుచున్నాముగాని గృహకృత్యములయందు నేర్పువహించి బిడ్డలను, భర్తను యనేకవిధముల గని పెట్టుచు, గృహలక్ష్మివలె రాజిల్లుభాగ్యము కడుంగడు శ్రేష్ఠమని నవీనయువతీమండలిహృదయముల కించుకను స్ఫురించకుండుట మిక్కిలి విచారకరము. యువతులకు విద్యయెట్టి ఆవశ్యకస్థానమందున్నదో, వైద్యశాస్త్రజ్ఞానముగూడ నట్టిస్థానమునందేయున్నదనుట కెట్టిసందేహములేదు. ఏలననగా మానవశరీరము వారివలననే సృష్టింపబడి వృద్ధినందుచున్నది. పవిత్రమగు ఆహారవిహారములవలననే స్త్రీపురుషులు తేజోవంతులు, బలవంతులు, కాంతివంతులును, పూర్ణాయుర్దాయముగలవారునుఅగుచున్నారు. శారీరకశాస్త్రమును బాగుగ నభ్యసించి ఆరోగ్యనియమముల నాచరించుచు, గృహరాజ్యమున పురుషులనుగూడ తన్నియమానుసారవర్తకులుగ నొనర్చుచు, ఉత్తమసంతానోత్పాదనము సేయుట మన భారతయువతీసంఘమునకెంతయు ముఖ్యకర్తవ్యము."

—చిల్లరిగె వేంకటరమణమ్మ.

**పురుషధర్మములు:—**

"నీకు పనిలేనప్పుడు పరులదోషము లెంచుట కొరగాదు. పరులసద్గుణముల నెంచుచుండుము. ఉత్తమపురుషుల చరిత్రలు చదువుచుండుము. నీవు చేతిపనులు నేర్చియుండుము. పొరుగిండ్లకు పనిలేక వెళ్ళకుము. వారికి సమయముగానియప్పుడు నీయందు అలసభావముకలుగును. నీయెదుటవారు సంపదగలవారైన సంతోషింపుము. తెల్లవారగనే లెమ్ము. దంతధావనాదికృత్యముల దీర్చుకొని దేవునితలంచుము. నీకితరులు చేయు కీడును మఱచిపొమ్ము. కుటుంబముపై సమబుద్ధినుంచుము. ఇతరులతో మాటలాడునపుడు అనవసరసంభాషణ చేయక మితముగా నిజమైనమాటలాడుము. మాటలవల్లనే మంచిచెడ్డలు కలుగును. సతిలేనియింట భర్తకు సౌఖ్యమెక్కడిది? ఆ త్రింటివారెంత ధనికులైనను పలుమాఱచ్చటకు పఱుగెత్తకుము. నీసుగుణమే నీసతికి ఖ్యాతినిచ్చును. వెలగలబట్టలు సోకులుపెంచుకొనక మంచినడవడికయే ముఖ్యఅలంకార మనుకొనుము. నీతల్లిదండ్రులు కట్నములకాసించి నీకు వివాహముచేయ నిశ్చయించినప్పుడు ఆసతిపై నీకిష్టములేనియెడల భయముచే తండ్రికి చెప్పకపోయినను తల్లితోనైన చెప్పుము. చెప్పకపోతివేని ఎల్లకాలము పరితపించుచుండెదవు.

నీ కొకమంచికార్యము చేయునపుడు మూఢపురుషులు నిందించినను నిరుత్సాహపరిచినను విడువక చేయు చుండుము. అధికజనులు మెచ్చవలెనను కోరిక యుంచుకొనకుము. ప్రతిమాటకు నవ్వకుము. చిన్నలైనను సేవాపరులయెడ గౌరవము చూపుము. పెద్దఅఱపునమాట్లాడకుము. నీకు దుఃఖమువచ్చినప్పుడు గొల్లునఏడ్వకుము. నిమిషముకంటె అధికము విచారించకుము. ప్రతిన్యాయమును నీతివాక్యములను నీహితులకుపదేశించి వారు మంచివారగునటుల పాటుబడుచుండుము. నిత్యానందపదవికై దరిద్రనారాయణుల కష్టములందు పాల్గొనుచు వారిని సేవించుచుండుము. పురుషులకు ఏకపత్నీధర్మముకంటె మించినధర్మం బెందునులేదు. ఇహ సౌఖ్యమునకు సతినిమించినవారెవరును లేరని భావించవలెను. సతి దుర్మార్గురాలైనయెడల హితవచనములతో సన్మార్గమునకు త్రిప్పవలెను. దుర్మార్గురాలని మనసునందుంచుకొనుటగాని ఇతరులతో చెప్పుటగానికూడదు. సతియొక్క సుగుణములను తలంచుకొని సంతోషించవలెను గాని దుర్గుణముల తలంచుకొని విచారింపకూడదు. తనసతి చిరాయుష్మంతురాలు సూనృతవాదినిగానుండుటకై దేవుని ప్రార్థించుట ఉత్తమపురుషుల ధర్మము. సతి కోరినపనికి మారుచెప్పక వద్దానిని చెల్లించుచుండవలెను. సతిదొంగిలించమనిగాని అనృతమాడమనిగాని దేవుని ప్రార్థింపవలదనిగాని చెప్పినయెడల అపట్టున వినయముతో అది తగనిపనియని ప్రార్థించి మానుకొనవలెను. సతి పడకటింటికి వచ్చునప్పటికి పడక శుభ్రముగనుంచి తాను శుచియై పోకచేసికొని చిరునగవుతో ఎదుర్కొనవలెగాని సంసారబాధలు చెప్పుచు చీట్లపేకకలహములు చెప్పుచు ఎదుర్కొనగూడదు. భార్యచేయుతప్పు కలదైనను తలంచక సతిచే ఇహలోకదైవమని నమ్మికొనియుండవలెను. నీసతి చెడు త్రోవ ద్రొక్కనేని నీతివర్తనమనెడు దివ్వెచే ఆమెను మంచిమార్గమునకు తోడితెమ్ము. నీసతిని నీవెంత ప్రేమించెదవో నీయందంతకంటె నెక్కువగ ప్రేమించుచుండునని నమ్ముము. నీసతి కోపిష్ఠురాలైనయెడల ప్రియవచనములచే ఆమెను చల్లార్పుము. అగ్ని శీతలోదకముచే చల్లారునని యెఱుంగవా?"

—చదలవాడ నాగభూషణరావు చౌదరి.

## స్త్రీ జన్మ:—

"ప్రపంచమున భగవంతునిసృష్టిలో మానవకోటియంతయు రెండుతెగలుగ భావింపబడుచున్నది.- పురుషులు-స్త్రీలు.- అందు మొదటిజాతివారి దుత్తమజన్మ. రెండవతెగవారివిషయము శోచనీయమైనది. కారణమేమనగా ఆడుజన్మఎత్తుటకంటె చచ్చుటమేలని స్త్రీలేచెప్పుసంగతి ఇప్పటికైనను అందరికిని తేటతెల్లముకాకపోలేదు. గడచినజన్మయందు వారెట్టిదుష్కర్మ నాచరించుచుండిరోగాని స్త్రీలై భూమిపైబడినది మొదలు, మఱల మృతులగునంతవరకు కష్టములనే నెక్కుడు పాల్గొందురు. ప్రప్రథమమున నొకాబిడకు ఆడశిశువై నుత్పత్తిఁజెందినవెంటనే యిరుగుపొరుగువారందరు "పుట్టినదమ్మా! ఆడదేపుట్టినది! ప్రాణముతీసారుచున్నది! కట్నాలుకానుకలిచ్చి ఒకఅయ్యచేతిలోపెట్టి, పెట్టిందిమొదలుకొని వారివాశ్రయించి, చిన్నమాటలు, పెద్దమాటలు పడుచుండాలి. ఇప్పుడు దీని కీకానుపు రాకుండావుండి, యీపిల్లపుట్టకుండావున్న నిజముగ ఆడుపిల్ల పుట్టుటపాపమే!" అని ఎవరికిఁ దోచినట్లు వారునిష్ఠురోక్తులను బలుకప్రారంభింతురు. ఆపిల్ల పెరిగి పెద్దదై ఐదారువత్సరముల ప్రాయముగలదైనప్పటినుండి, నగలు నాణెములు నిమిత్తమో, పదిపదకొండేండ్ల యీడు వచ్చినమీదట వరాన్వేషణార్థమైయో, తల్లిదండ్రుల నిద్రాహారములేకుండ నిడుములపాలుఁ జేసినవారగుదురు. వివాహానంతరము వారిజీవనములు బహుకష్టతమమైనవనిఁ జెప్పందగు. దేహమునకు స్వేచ్ఛ, శుభ్రత, మనశ్శాంతి, సుఖము, మొదలగునవి ఉండ నేఉండవని చెప్పవచ్చును. ఇందుకుదాహరణములు ముఖ్యముగ వారికుండు చతుర్విధావస్థలే: రజస్వలావస్థ, బహిష్టావస్థ, గర్భిణ్యావస్థ, ప్రసవావస్థ. బాల్యవివాహములచేనైన నేమి,

మఱియేనివలననైననేమి చిన్నతనములోనే బిడ్డలనుగని, వారిని పోషించుటెట్లుగాక వారకాలమరణముఁజెందుటచే, వారికై చింతిలుచు, మనస్సున కాందోళనలుగలిగి దేహమునకు నిజమైన సుఖమునుబడసెదో కనుగొనలేకున్నారు. దీనికితోడు వారిని వైధవ్యమావరించుట, దానివలన వారికిసంభవించు అమర్యాద, కష్టము, మఱియింతజాలికరము. వైధవ్య మాడువారికి శాపమువంటిది. అదెట్టి పాపమోగాని భర్తచనిపోయినది మొదలు, వారిముఖమైనను చూడదగినదికాదని ఎప్పుడైన వారు తమకు తటస్థించినపుడు "విధవ"యని నీచముగను, కఠినముగ పలుకుదురు. ఇదియేకాదు. వారికింక అగౌరవము, అనాదరణగూడ చేయుదురు. సంఘబహిష్కృతులు గావింతురు. కడుపునకన్నమైనను తిన్నగపెట్టరు. చిన్నతనమునుండి కడుప్రేమతో, శ్రద్ధతో నూనెరాచి పెంచినట్టి శిరోజములను (హిందూమతాచారములనవలంబించియు, కాకులవంటి లోకులకు వెఱచియు) తీయించి ముసుగువేసి మూలకూర్చుండబెట్టుదురు. అదినలకు నోరైనవిత్తలేనివదినలు, మఱదళ్ళు వారింటి నీపనుండు కొనవలెనన్నను, లేకపోయినను రాపాడుచుందురు. అందుకనే యీదురవస్థపడలేక మనపూర్వులు కొందరు "సతి" యను పద్ధతినాచరించి, భర్తచనిపోగానే వానిచితిపై, భార్యగూడపరుండి ప్రాణత్యాగము చేసికొనెడిదట. కాని యిప్పుడీయాచారము, నవీననాగరికతకు ప్రతికూలమని భావింపబడి, తొలగింపబడినది. ఇంతియగాక స్త్రీకిచిన్నతనమున మాతాపితరుల నిర్లక్ష్యము చేతను, కాపురమునకరిగినది మొదలైహికసుఖము కొఱకును "నా మొగుడని, నాపిల్లలని" మురిసిపడి మంచిచెడ్డలవిచక్షణచేసి తనయొక్క జన్మసార్థక్యతనొందలేకుంగనను జ్ఞానముఁబడయు విద్యాగంధములేక మూఢవనితలై, కామక్రోధమదమాత్సర్యములను వాహినులందుమునిగి అంధులగుచుండిరి. ఇట్టివారిదుస్థితి యిప్పటికైనను ప్రజలెవ్వరును ఇంతనాగరికత ప్రబలినను కొంతవఱకైనను "విద్య"యను తారకోపదేశంబు చేయించు కించుక పోగొట్టుటకు తగుయత్నములు చేయకుండుటకుచాల యాశ్చర్యకరముగనున్నదని తోచుచున్నది.

—కంభంపాటి సీతారామయ్య.

పూర్ణసంతతి:—

"ఎవరేని ఆగర్భశ్రీమంతులగుగాక, అన్నదమ్ములు గలిగియుండుగాక—గాని, అక్కచెల్లెండ్రలేమి కలిమినిలేమిగా తోచింప, ఇందు ముఖ్యముగా ఆడపడుచులులేనిఆడంగులకు మరింతబాధ. వారి ముద్దుముచ్చటలంతా మగపిల్లలవలనదీరవు. ఆడుబిడ్డలవలననే దల్లులకు కోర్కెలీడేరును. పురుషులకుగూడ కొన్నిసమయములందు అక్కచెల్లెండ్రలేమిగనృట్టును. కొన్ని పండుగలందును, పర్వములందును 'భగినీహస్తాభోజ్యంగభోజనాదులు' ముఖ్యమని చెప్పబడినవి. ఆసమయములందు సోదరీరహితులకు అభావముగలుగును. ఇదియొక కొఱతయేగదా! స్త్రీలకుగూడ కొన్నివ్రతములయందు 'ఉద్యాపనకు' అన్నగాని, తమ్ముడుగాని యుండితీర్పవలెను. అట్లులేనివారు అభావమున వరుసయినవారిలో నద్దాని తీర్చికొందురు. ఇదిగూడ ఒకలోటు. కనుక 'పూర్ణసంతతి' యనుమాట 'పుత్రులు-పుత్రికలు' గలిగినపుడే సార్థకమగును. 'అపుత్రస్య గతిర్నాస్తి' యను శాస్త్రప్రమాణమునుజూపి, దత్తతస్వీకారమును పురుషసంతతిలేనివారికిజెప్పిరిగాని, స్త్రీసంతతిలేనివారి కటులేలజెప్పలేదు? స్త్రీదత్తత ఎందులకునిషేధనీయము? ఇట్టిఆటంకములు సంఘమునందుండుటచేత, అక్కచెల్లెండ్రులేనివారికి 'అక్కా—చెల్లీ!' యనుపిలుపుభాగ్యమైనను లేకుండెను. ఇక ముమ్ముందు స్త్రీదత్తతగూడ అమలులోనికి రాగలదేమో! పేదలై పొట్టకూటికిలేనపుడుగూడ, ఓరిమిగలిగి, కష్టించి, ఆర్జించి పెద్దలకెంత సౌఖ్యమగును గాని 'సోదరిలేమి'ని పోగొట్ట సాధ్యమగునా? ఏకలింగసంతానప్రాప్తులును, తదేకజాతినిబెరిగినపిల్లలును సహ్యానురాగమాన్యులగుట, సంఘాభిమానరహితులగుట, సంసారసుఖహీనులగుట వింతగాదు. వీరికి పురుషుల మొదల, మొండిగోరులు అన్యోన్యానురాగమునొందియుండుట తెలియకపోవుటయే దీనికికారణము."

—రెడ్డి సత్యవాణిమూర్తి.




## పిల్లనివ్వనందుకు మంత్రప్రయోగము:—

పాట్నా పట్టణమున జరిగిన వృత్తాంతము. కిశన్ సోనారు తనకూతురిని తొలుత జాంగ్లి అనువాని కుమారునకు ఇచ్చుటకు మాటలుజరిపెను. తుదకు పోదారు కొడుకునకు తనకూతునిచ్చుటకు కిశన్ సోనారు నిశ్చయించెను. దీనిమీద జాంగ్లికి కోపమువచ్చెను. కసిబోవక మసిపూసినట్లు కిశన్ సోనారుకు ఆకాశరామన్న ఉత్తరములు వ్రాయుటకు ప్రారంభించెను. "నీయిల్లు నల్లకాడు చేస్తాను. నీకు దయ్యాలుపట్టిస్తాను." ఇత్యాదులు ఆ ఉత్తరములలోని విషయములు. ఇంతతో పోలేదు. "మీయింటిలో ఈపార్శెలు విప్పుటతోడనే నీవు, నీకుటుంబీకులు రోగగ్రస్తులై తీసుకొని చనిపోవుదురు" అను వ్రాతతో ఒకనాడు కిశన్ సోనారుకు ఒక పార్శెలువచ్చెను. దీనితో అతనికి భయము పట్టరానిదయ్యెను. ఆపార్శెలు విప్పకుండగనే తీసికొనిపోయి అతడు పోలీసులకు యిచ్చెను. దయ్యములనిన భయములేని ఆపోలీసులు ఆపార్శెలు విప్పిచూచిరి. అందు మాంసపుముక్క ఒకటియుండెను. దానిని ప్రభుత్వమువారి రసాయనికపరిశోధకునకు పరీక్షార్థము పంపియున్నారు.

## స్వప్న వృత్తాంతము సత్యవృత్తాంతమైనది:—

విశాఖపట్టణమున పురిబండా అప్పలస్వామిగారి గృహమున ఒక ఆశ్చర్యకరమగు వింతజరిగెను. ఆయనసతి శ్రీమతి అప్పలనరసమ్మగారి దేహారోగ్యము కొన్నాళ్లనుండి సరిగాలేకుండెను. ఇట్లుండగా మేనెల 11 వ తేదీరాత్రి సుమారు 1½ గంటల సమయమున ఆమెకు స్వప్నములో ఒకస్త్రీ వ్యక్తికనబడి భయమువలదనియు, అనారోగ్యమునుండి తానుద్ధరింతుననియు తాను 'పేరంటాలు' ననియు, పేరు చంద్రమ్మయనియు తెల్పి కొన్ని అక్షతలు మంచముపైచల్లి చేత కొన్నియొసగి వెడలిపోయెను. వెంటనే ఆమె లేచి గృహములోని వారినెల్ల లేపి పరికింప మంచముపైనను చేతిలోనను ఉజ్వలమగు అక్షతలు ప్రత్యక్షముగ మిగిలియున్నవి. ఆక్షణముననే ఆమె అనారోగ్యమునుండి విముక్తురాలై ఆరోగ్యమును బడసెను. కనబడినవ్యక్తి చీరయును, గుండ్రని కుంకుమతిలకమును ధరించియుండెనట. గృహద్వారములన్నియు ఆసమయమున బంధింపబడియుండెను. ఇట్లుండ మఱునాటిరేయి ఆవ్యక్తి మరల అర్ధరాత్రిస్వప్నమున కనబడి భయమువలదని తెల్పి చేత నొకరూపాయనిడెను. వెంటనే అప్పలనరసమ్మగారు మేల్కొని యింటిలోనివారిని లేపిరి. ఆమె చేత ప్రత్యక్షముగ తెల్లని క్రొత్తరూపాయకలదు. గృహద్వారములన్నియు బంధింపబడియేయుండెను. అక్షతలును రూపాయయును ఇప్పటికినీ అట్లేయున్నవి. అప్పలనరసమ్మగారు ఆరోగ్యముగ నున్నారు. ప్రత్యక్షముగ జరిగిన ఈవిచిత్రసంఘటలమునకు అర్థమేమిటో తెలియదు. చంద్రమ్మ అను పేరంటాలుగుడి గజపతినగరము తాలూకాలోని మరడాముగ్రామములో కలదు. అటనామెను ప్రత్యక్షదేవతగ పలువురు కొలుతురట. —ఆంధ్రపత్రిక.

పదమూడేండ్లుగ అన్నపానములంటని అతివ:—

విశాఖపట్టణమండలమునందలి కొత్తవలస రైల్వేస్టేషనుకు అయిదుమైళ్ళ దూరమునగల గంగుపూడి యను గ్రామమున పాపమ్మఅను ముప్పదిఏండ్ల పద్మశాలికులస్థురాలు నివసించుచుండెను. గతపదమూడేండ్ల నుండియు ఆమె గుప్పెడు మెతుకులుగాని గ్రుక్కెడునీరుగాని ముట్టియెఱుగదు. సుకుమారి. అయినను ఆరోగ్యముగనే యున్నది. ఈపదమూడేండ్లలో ఆమె మూడుసారులు నీళ్ళాడెను. పదమూడేండ్లక్రితము ఆమె ఒకనాడు తనభర్తగారిఊరు గంగుపూడినుండి సమీపమునవున్న తన పుట్టినింటివారిఊరికి మఱికొందరతో కలసి పోవుచుండెను. అప్పుడు సాయంకాలము నాలుగుగంటలు. మార్గమధ్యమున ఆమెపడిపోయెను. తెలివి తప్పెను. స్మృతితెలియని అస్థితిలోనే ఆమెను యింటికిని అక్కడనుండి విశాఖపట్టణము ఆసుపత్రికిని గొని పోయిరి. ఆసుపత్రిలో ఆమెకు తెలివివచ్చెను కాని ఆమె నోరు తెఱచుటగాని మాటలాడుటగాని చేయలే కుండెను. ఆసుపత్రిలో పదునుదినములుంచిరి. అచ్చటిడాక్టరు ఆమెచే నోరు తెరిపించుటకుగాని, మాటలా డించుటకుగాని, నీరు త్రాగించుటకుగాని, అన్నము తినిపించుటకుగాని చేసిన ప్రయత్నములన్నియు వ్యర్థము లయ్యెను. కాని ఆమె శరీరము సుస్థితియందే యుండెను. రోగము ఇట్టిదని నిరూపింపజాలక డాక్టరులు ఆమెను ఆసుపత్రినుండి పంపివైచిరి. రెండుసంవత్సరముల అనంతరము పాపమ్మ ఒకనాడు హఠాత్తుగ నోరు తెఱచెను. మాటలాడుటకు ప్రారంభించెను. మాటలాడుటకు అనువైన ఇప్పుడుకూడ ఆమె ఈవైచిత్రికి ఏమియు కారణము చెప్పజాలకుండెను. అప్పటినుండియు ఆమెమగనితో కాపురము చేయుచుండెను. కుటుంబమునందలి ఇతరవ్యక్తులతో పాటు గృహకార్యముల నిర్వహించుచుండెను. ఆకలిదప్పులుమాత్రము లేవు. అన్నపానీయములు వలదు. ఆస్థితిలో ముగ్గురుబిడ్డలతల్లి యైనది. బలవంతముగ గ్రుక్కెడునీళ్ళు త్రాగినను ఇముడవు. వెక్కిరిబిక్కిరియగును.

—*The Hindu*.

"ఇట్లుండగా ఇట లోకాంతరజీవులతో సంప్రతించుటలుగూర్చి సాధనచేయుచున్న శ్రీ పుష్పా లక్ష్మీ నారాయణగారి విషయమువిని ఆమెను దోడ్కొనివచ్చి విషయగ్రహణమునకై యత్నించుచున్నారు. గరి టెడునీళ్ళు ఆమెగొంతుకలో పోసినచో ఆమె చాలబాధపడిపోవును. నీరు పైకివచ్చివేయును. ఆమెను ఆవహింపజేయగా ఆమెకు ఆవేశముకలిగి తాను సూర్యనారాయణమూర్తిననియు తన్ను పరీక్షించి అవమాన పరచుటకు తీసికొనివచ్చిరాఅనియు భూతమును చూచినట్లు చూచుచున్నారాఅనియు తెల్పెను. అంతట మంత్రప్రయుక్తముగ విప్రుని చేపూజగావించి ప్రసాదము లోపగాఢభక్తితో నొసంగుచున్నందున గ్రహించు చున్నానని ఆవేశములోనే ఆమె దానినిభక్షించెను. తెలివి కలిగినతరువాత ఆమెయేమియు తినలేకుండెను. లక్ష్మీనారాయణగారు సాధారణముగ భూతముల నావేశింపజేసి విషయముల కనుగొనుటకు ఒక యువతిని ఉంచియున్నారు. ఆమెను ఆవహింపజేసి ప్రశ్నింపగా ఆవేశయిట్లు తెల్పెను. నేను సూర్యనారాయణమూర్తిని. 13 వత్సరములనుండి ఆమెను ఆవహించియున్నాను. ఆమె పూర్వజన్మమున క్షత్రియయువతి. నన్ను భక్తితో కొలిచెను. అందులకు ప్రతిఫలముగ ఈజన్మమున నే నామెను ఆవహించితిని. ఆమెకేమియు హానికలిగించుట లేదు. నేనుండగా ఆమెకు ఆకలిదప్పులుండవు. బలహీనతకలుగదు. మీరు మైలగుడ్డలతో ఒసగిన ప్రసాద మును నేనుముట్టను. మీరు ప్రార్థించుటచే భక్తులకోర్కె తీర్చుటకు అవి భుజించితిని అని తెల్పెను. ఈవిష యమును శ్రీవిజయనగరము మహారాజాగారువిని వీక్షించి పరిశీలించుటకు వైద్యులనియోగించిరి. ఆఆంగ్లవైద్య శిఖామణు లిదవిర్థమని యేమియు నిర్ణయించలేకపోయిరి. శ్రీలక్ష్మీనారాయణగారింకను ప్రయత్నములు చేయుచునేయున్నారు. శాస్త్రవిజ్ఞానములకు అతీతమగు నీవింతల సమర్థించుట నూతనపరిశోధకులు జన్మింప వలసియుండును."

—ఆంధ్రపత్రిక.




**కుక్క యొక్క పవిత్ర ప్రేమ :—**

కేపుటవున్ నందలి టేబిలుపర్వతమును ఎక్కుచు ఒకడు అచ్చట కుక్క యొక్క శవముచుట్టు తిరుగుచున్న మఱియొక ఆల్సేషియన్ కుక్కను చూచెను. తిరుగుచున్న కుక్క బక్కచిక్కియుండెను. ఒకపక్షము దినములుగ అది ఆహారమును ముట్టియుండదు. ఆశవముచుట్టును ఈకుక్క ఇన్నిదినములుగ తిరుగుచుండెననియే భావింపవలసియున్నది. ఏమన గానుగచుట్టు ఎద్దునడకవీర్పడునట్లు ఈకుక్క నడకవలన అచ్చట గడ్డిమట్టు కైవారమున నలిగిపోయి ఒకసన్న ఆకారముఏర్పడెను. ఈదృశ్యమునకు మనసుకరిగి ఆబాటసారి ఆకుక్కను ఇంటికికొనివచ్చెను. ఓపట్టున ఆకుక్క రాలేదు. పట్టుబలవంతముమీద కొనిరాబడెను. అదిఇప్పుడు జంతుహింసానివారకసంఘమువారి శరణాలయమున పోషింపబడుచున్నది.

**ఒక బాలుడు కనిపెట్టిన క్రొత్తతాళము :—**

జాగ్రెబ్ నివాసియగు ఇవాన్ సుహాదోల్నిక్ అను పదమూడుసంవత్సరముల విద్యార్థి ఒకక్రొత్తతాళము చేసెను. అది బ్రహ్మకుకూడ భేదింపరానియంతగట్టిది. దానిని ఆబాలునిపేర పేటెంటు చేసియున్నారు. తానుచేసిన ఈతాళమును ఆబాలుడు స్థానికకారాగారాధిపతివద్దకు కొనిపోయి చెఱసాలయందు నిర్బంధమనుభవించుచున్న గజదొంగలిద్దఱుముగ్గురచే దానిని పగులగొట్టింపించ చూచెను. ఆదొంగలు విశేషప్రయత్నము చేసియు దానిని పగులగొట్టలేకపోయిరి. ఆయూరతాళములు బాగుచేయు వృత్తియందున్నవారును ఈవిషయమున కృతకృత్యులు కాకపోయిరి. ఇంతటి గట్టితాళమును చేసిన ఆపిల్లవానిని ప్రజలు బహువిధముల కొనియాడిరి.

**ముందరికాళ్లు లేకుండ బుట్టిన గుఱ్ఱపుపిల్ల :—**

కెనాడాయందలి విన్నిపెగ్ చెంతగల ఫోర్టుగారీలో నొకగుఱ్ఱపుపిల్ల ముందరికాళ్లు లేకుండపుట్టినది. మిగిలిన అవయవములు అన్నియుసరిగానున్నవి. ముందరికాళ్లుండవలసిన తావున ఏవిధమైన ఆనవాలుఅయినలేదు.

**ఆకాశమునుండి దివ్యప్రసాదము పడుట :—**

డర్బానునందలి బ్రిహీడ్ లో మబ్బులేని శుభ్రమైన ఆకాశమునుండి ముద్దముద్దలుగ ప్రసాదమువంటి తెల్లని పదార్థముపడినది. అది అచుట్టుపట్ల చాలస్థలములందు పడెను. మంచుకంటెమిక్కిలి తెల్లగానుండెను. రుచికి

తేనెపట్టెనుండెను. సులభముగా గుండయుగు చుండెను. నాలికమీద పెట్టుకొనుట తడువుగా కరిగిపోవు చుండెను. ఆకాశమునుండిపడిన ఈదివ్యప్రసాదమును కొంతతీసి దాచి ప్రిబేడ్‌లోనివారు దర్బానుకు పరిశోధన నిమిత్తమంపిరి.

ఎలుకబోనులో నాగుపాము:—

కలకత్తాయందలి టాల్లిగంజ్ రోడ్డున నివసించుచున్న బెంగాలీయొకడు తనయింట ఒకనాటి సాయంకాలము ఎలుకబోను ఒగ్గెను. రెండుఎలుకలుపడగా వానినిచంపి తిరిగి అక్కడనే బోనుఒగ్గెను. కొంతసేపటికి బోనుతలుపు మూసుకొనిన చప్పుడయ్యెను. తిరిగి కొన్నిఎలుకలు పడినవనుకొని అతడు అందలి ఎలుకలను చంపునుద్దేశముతో బోనువత్తి రోడ్డుమీదకి గొనిపోవుచుండెను-ఇంతలో అతనిచేయి యేదియోకఱచెను. చూచునుగదా బోనులో నాగుపాము. ఒకగంటయైనను తిరుగక అతడు చనిపోయెను.

ఎలక్ట్రిక్ గడియారము:—

జినీవాలో నొకగడియారపువర్తకుడు ఒకఎలక్ట్రిక్ గడియారమును కనిపెట్టెను. అది యిప్పటి మన తేబుగడియార మంతయుండును. ఈగడియారమునందలి విశేషమేమనగా దీనికి 'కీ' ఇవ్వవక్కరలేదు. ఏడాదికి ఒకసారి లోనితీగెమాత్రము తీసివైచి క్రొత్తది పెట్టుచుండవలయును. ఈగడియారము కాలమును సరిగా చూపుచున్నది.

చేపలకు ఆసుపత్రి:—

అమెరికాయందలి టొరెంటోలో చేపలకొఱకు ఒకఆసుపత్రి కట్టబడినది. చేపలను ఎక్సరేమూలమున పరీక్షచేసి రోగముగలభాగమును ఆపరేటు చేయుటకు అనుకూలము లీ ఆసుపత్రియందు కూర్పబడెను. చేపలను ఆపరేటుచేయునపుడు వానిని తడిపినటువ్వాళ్లయందు పట్టియుంతురు.

కుక్కలు పిల్లవానిని రక్షించినవి:—

బోస్ప్యారెట్‌నందలి ఒక వ్యవసాయదారుని కుమారుని ఒక పెద్దపాము ఎదుర్కొనెను. పిల్లవానిచేత ఎట్టిఆయుధమునులేదు. వానికి అమితభయముజేసెను. ముందుకుగాని వెనుకకుగాని అడుగువేయుటకు కాళ్లాడక అతడు అట్లేనిలచియుండెను. ఇంతలోగా మూడుకుక్కలు పరుగెత్తుకొనివచ్చి పాముతోపోట్లాడి దానిని చంపినవి. కాని కొద్దినిమిషములలోనే ఆమూడుకుక్కలునుచనిపోయినవి. పోట్లాటసమయమున పాముకాట్ల విషమువలన అవి చనిపోయియుండునని నిశ్చయింపబడెను.

ఉల్లిపాయలు, కోడిగుడ్లు పత్రికకు చందా:—

ఓక్లాహామాలో "ఫిష్కింగోజాన్సను కౌంటీకాపిటల్-డెమొక్రాట్" అనుపత్రిక ప్రచురించుచరింపబడుచున్నది. ధనరూపకముగు చందాకేగాక వస్తురూపకముగు చందానుకూడ స్వీకరించుటకు ఈపత్రికాధిపతులు నిర్ణయించిరి. అరతూమెడు బంగాళాదుంపలుగాని, అరతూమెడు బటాణీగింజలుకాని, అరతూమెడు ఉలవలుకాని, ఒకతూమెడు సీమరేగిపండ్లుగాని, ఒకతూమెడు ధాన్యముగాని, ఒకతూమెడు అక్రోటుకాయలుగాని, పదిపౌనుల బెర్మ్యూడా ఉల్లిపాయలుగాని, రెండుపౌనుల వెన్నగాని, మూడుడజనుల క్రొత్తకోడిగుడ్లుగాని, ఒకగాలను రిబ్బన్‌కేను చెఱుకుపాకముగాని ఈ పత్రికకు సాలుచందాగా గైకొనబడును. ప్రపంచమున మఱియెచ్చటను పత్రికలకు ఈమాదిరి చందాఏర్పాటులేదు. ఈసరిక్రొత్తపద్ధతి ఆంధ్రదేశమున యేమైన పనిజరుగునేమో చూడవలసియున్నది. తెలుగువారు సాధారణముగ ధనరూపముగ చందాఇచ్చుటకెలుగక ఎన్నియో పత్రికలను చంపుకొన్నారు. ఈక్రొత్తపద్ధతి వారికేమైన రుచించునేమో!




**శ్రీ గంపా శివకాంతమ్మగారి దేశభాషాభిమానము:—**

స్థానికస్వపరిపాలనమున స్త్రీలు ప్రవేశింపనారంభించి యెన్నియోదినములుకాలేదు. ఈకొద్దిదినములలోనే వారిఈప్రవేశము స్థానికస్వపరిపాలనమును ఉత్తేజముగావించుచున్నది. ఒక్కఉదాహరణముచూపెదము. బరంపురము పురపాలకసంఘవ్యవహారములన్నియు నికమీద తెలుగు, ఒరియాభాషలయందు జరుపవలయునని తీర్మానమును ఆసంఘమున సభ్యురాలైన శ్రీమతి గంపా శివకాంతమ్మగారు గొనివచ్చిరి. అది ఆమోదింపబడినది. దేశభాషాప్రాముఖ్యమును తోడిసభ్యులచేగుర్తింపజేసిన శివకాంతమ్మగారికి మాయభివాదములు. బరంపురముమునిసిపలుసంఘమువారి ఈమంచితీర్మానమును ఇతరమ్యునిసిపలుసంఘములవారును అవలంబించుట దేశహితము. ఆయామ్యునిసిపలుసంఘములందు సభ్యురాండ్రుగనున్న స్త్రీలీవిషయమై శ్రద్ధవహింతురుగాక!

**స్త్రీ శక్తిస్వరూపిణియనుటకిది యొకనిదర్శనము:—**

ఇరువదియైదువత్సరములు. వంటలక్క. కత్తిరింపబడినజుట్టు. క్రాయిడన్ చెంతస్నానమందిరమున ఈఅయివీరసెల్ కన్యకకును సండర్ లాండుకుచెందిన టిల్లీటిన్ మాత్ కన్యకకును బరువుఎత్తుటయందు పోటీగలిగెను. మూడువందలపౌనులగుండు. టిల్లీటిన్ ఎత్తలేకపోయెను. అయివీరసెల్ సునాయాసముగ ఎత్తివైచెను. ఈఘనకార్యమునకు రసెల్ కన్యను ప్రజలు, పత్రికలుప్రశంసించినవి. ఈపోటీవచ్చితా నీమూడువందలపౌనులగుండును ఎత్తివైచువఱకును ఆమెకు తానంతబలవంతురాలనని తెలియదు. స్త్రీ శక్తిస్వరూపిణియనుటకు ఆమె ఈచేతయొకచక్కనినిదర్శనము.

**అనుకరింపదగిన విషయము:—**

ఇంగ్లండునందలి కాక్లైలు వ్యాకరణపాఠశాలకు ఇరువదివత్సరములుగ ప్రధానోపాధ్యాయుడుగపనిచేసినాడు. ఇపుడు విశ్రాంతిగొన్నాడు. సి. యఫ్. సిపేడల్ అని ఆతనినామము. తనవిశ్రాంతిని ఆదర్శముగ వెళ్లబుచ్చుటకు ఆతడు మూడుఎకరములపొలమునుసంపాదించి అందొకకుటీరమునునిర్మించుకొనెను. అందాతడు తనభార్యతో, తనఇద్దరుకొడుకులతో

నివసించుచు ఆమూడుఎకరములనుండివచ్చుఆదాయముతో జీవింపనిశ్చయించినాడు. "ఈ మాకుటీరనిలయమున మాఆహారమును మేమే పండించుకొందుము. కూరగాయలు, పండ్లు మేమేపండించుకొందుము. రొక్కముకొఱకై న నిక్కచ్చితగ్గించుటను నిదర్శనపూర్వకముగ చూపుటకే మేమీపద్ధతి నవలంబించుచున్నాము. కేవలము పరిశ్రమలనమ్ముకుని మనము బ్రతుకజాలము. పరిశ్రామికజీవితము ప్రకృతికి దూరముగనుండకమానదు." అని ఆతడు పలికెను. ఉద్యోగములకొఱకు ఎగబ్రాకి ఆత్మగౌరవమును చంపుకొనెడు మనదేశపు విద్యార్థికు లీప్రధానోపాధ్యాయుని అనుకరింపనగును.

ఎవరెట్ గ్రీన్ కన్యమరణము:—

ఆధునికాంగ్లసారస్వతాకాశమున ప్రకాశవంతములైన నక్షత్రములలో ఎవరెట్ గ్రీన్ కన్యయొకతె. ఇరువదిమూడుసంవత్సరములుగా ఈమె గ్రంథరచనావ్యాసంగమున మునిగియున్నది. ఈమె రచియించినగ్రంథములు అతివిరళములు. పదమూడుసంవత్సరములలో ముప్పదియైదునవలల నీప్రజ్ఞావతి రచియించెను. ఈగ్రంథములన్నియు నీమె సిసిల్ అడెయిర్ అను మారుపేరుతో ప్రచురించెను. A. G. Gardinerగారి Alpha of the Plough అను మారుపేరువలెనే ఈయమమారుపేరును అచిరకాలమున బహిరంగరహస్యమయ్యెను. ఈమె రచియించిన 'గేబ్రియల్ గార్డెన్' అనుగ్రంథము నూటఏబదివేలపుస్తకములుచెల్లినవని తెలియుచున్నది. ఈవిషయ మీమెగ్రంథము లెంతటిప్రజామోదమునుబడసినవో ఊహింపవచ్చును. మనతెనుగున శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహముగారి గయోపాఖ్యానము డెబ్బదియైదువేలప్రతులు అమ్ముడుపోయినవనగా మన మబ్బురపడుచున్నాము. ఇంతకును ఈ గ్రంథకర్త్రి ప్రజాభిప్రాయమునను సరించి గ్రంథరచనముగావింపలేదు. ఆధునికపద్ధతులను ఈమె అతిగ నిరసించినది, నాగరికవేషములపై ఈమె దాడియెత్తినది, స్త్రీలు పాతివ్రత్యమునకు దూరులుకాకూడదని చేయెత్తిచెప్పినది. ఇట్లయ్యు ఈమెగ్రంథములు రచనాప్రాశస్త్యముచే ప్రజాసమ్మతములయ్యెను. ఈయమ ఏప్రియలు తుదివారమున దివంగతురాలైనది. ఈబహుళప్రశస్తగ్రంథకర్త్రిఆత్మకు శాంతికలుగుగాక!

ఇట్టివా రు ఊరికిఒక్కొక్కరుండినచో:—

"నిన్నఉదయమున వంగాగూడెం పంచమపల్లెదరినున్న వల్లకాటిలో నెవరో అప్పుడే పుట్టినశిశువును తెల్లవారకట్లతెచ్చి పారవేసినారు. నక్కలాశిశువు నీడ్చుకొనివచ్చి మాలపల్లెలో పడవేసెను. సుమారు రెండుమాసములక్రిందట ఏలూరుతూర్పువీధిలో నిట్లే నొకశిశువును కని పారవేసిరి. ఒకమాసముక్రిందట వెంకన్న చెఱువుదాపుననున్న శ్మశానవాటికకడ నొకశిశువిట్లే పారవేయబడెను. అప్పుడప్పుడు రహస్యగర్భిణులు, పిల్లలనుగనియు పెంచుటకు వసతిలేక యిట్లు పారవేయుచున్నారు. ఇందులకు రహస్యగర్భమునొసర్చిన పురుషులు, అందు కొడబడినస్త్రీలు, యిట్టి శిశుజీవనమునకువసతిగల్పింపనిప్రజలు గూడ

బౌధ్యులేయని నానమ్మకము. స్త్రీపురుషుల కామమునాపుటకుగాని, ఒక్కసారిగా సంఘమందలి కట్టుబాట్లనుసడలించి యిట్టి రహస్యగర్భజనితులగు శిశువులనుకనినతల్లియే పెంచునట్లును ఆస్త్రీయొక్క కుటుంబీకులావనిని హర్షించునట్లుచేయుటకును కృషిసల్పుట సముద్రములోనిసీటిని పాత్రతోతోడి సముద్రమును నిర్జలమొనర్చునంటిపని. ఇకచేయదగిన కృషియేమనగా నట్టిశిశువులను పోషించుటయే ముఖ్యకర్తవ్యము. ఇట్టిరహస్యగర్భవతులగు స్త్రీలు తాము ప్రసవించినశిశువులను చీకటిచాటున తామెవరో యెరుకపడకుండ నాగృహసమీపమునసున్న నాగడ్డివామిదొడ్లో గడ్డిపరచి అచ్చటపెట్టి ఒకయీాలవేసినయెడల నేనుగాని, నాఅక్కగాని, నాభార్యగాని, నాపిల్లలుగాని అపిల్లలను పెంచి పెద్దవారినిచేసి విడిచిపెట్టెదము. అట్టిస్త్రీలను మాతృసమముగాజూచి మన్నించెదము. ఎవ్వరికిని చెప్పము అని ప్రమాణము చేయుచున్నాము. కావున ఓతల్లులారా! రహస్యముగా గర్భముఅయినను దైవముయెదుట తప్పులేదు. సర్వజ్ఞుడగు భగవంతునకు మీారు గర్భవతులగుట యెఱుగును. కావున మీారు శిశువులనుగనుటయు నెఱుగును. ఆ అఖిలాంతర్యామియెదుట దాపటికము లేదు. తప్పులేదు. తల్లులారా! సంఘము కట్టుబాటులకు వెరచి మీారిట్టి దయాశూన్యమైన ఘాతుకకృత్యమునకు నొడిగట్టుచున్నారు. పశ్చిమఖండమందు కానీనకగర్భజనితులెందరో శిశురక్షణాలయములయందు పెరిగి రాజ్యపదవులనే బొందియున్నారు. మనభారతదేశమందును పూర్వము కానీనకు లనేకులుండిరి. కావున తల్లులారా! మీారు కనినశిశువులను విఱిచి కుండలలోపెట్టక, రక్కసపొదలలో పారవేయక, చెఱువులలో నూతులలో ద్రోయక, శ్మశానములలో నక్కలుపాలుచేయక నాకుటీరమును జేర్చుడు. నేను అట్టిశిశువును దైవకృపచే కాపాడుదును. దయామయులగు ప్రజలును నాయుద్యమమునకుదోడ్పడి శిశుహత్యల మాన్పింపవలయునని సవినయముగా వేడుకొనుచున్నాను” అని శ్రీయుత అత్తెల సూర్యనారాయణగారు ఏలూరునుండి 25-4-32 తేదీని ఆంధ్రపత్రికకు వ్రాసినారు. ఇట్టి శిశుహత్యలు, వానిసమస్యలు ఇదివఱకు గృహలక్ష్మిలో విపులముగచర్చించియున్నారము. ఏలూరుపురమున ఈసమస్యాపరిష్కారమునకు సూర్యనారాయణగారుపూనినది అభినందనీయము. రహస్యరక్షణమునకు వారు ప్రమాణముచేసి చెప్పుచున్నారు కావున దొంగతల్లులు రహస్యభంగభయముకొందనవకాశములేదు. పాశ్చాత్యదేశలందు ఇట్టిశిశువులకు శరణాలయములు, దొంగతల్లులు దొంగతనముగా తమపిల్లలను తెచ్చివిడచుటకు ఈశరణాలయముల వీథివాకిలియందు ఊయెలలును ప్రతిష్ఠాపుననుంచుట (W. L. Rice గారి The Problem of the Unmarried Mother) అను గ్రంథమున విపులముగ వివరింపబడియున్నది. మన పేదదేశమున ఆపద్ధతికి ఇంకను ఆస్కారములేదు. ఊయెలకుబదులు సూర్యనారాయణగారు సూచించినట్లు గడ్డిపఱుపుతోడనే మనము తృప్తిపడవలయును. హిందూదేశమున ఈవికలసమస్యాపరిష్కారమున ఇంతవఱకు మిషనరీలుమాత్రమే కొంతపని చేయుచున్నారు. ప్రజలు

కాని, ప్రభుత్వముకాని ఏమియుచేయుటలేదు. ప్రజాసంఘమీసమస్యను గుర్తించినదనుటకు సూర్యనారాయణగారి ఈఏర్పాటు నిదర్శనముగ చేకొనవచ్చును. ఇట్టివారు ఊరికి ఒకరు చొప్పున నుండినచో ఈవికలసమస్య కొంతవఱకు అందుబాటులోనికి రాగలదు.

**కీ. శే. వేలూరి పూర్ణబ్రహ్మానందశాస్త్రి గారు:—**

రాజమహేంద్రవరపు ధనికులగుపౌరులలోనొకరగు శ్రీ వేలూరి పూర్ణబ్రహ్మానందశాస్త్రిగారు గతమాసము 7-వ తేదీని దివంగతులైరి. లక్షలువిలువచేయు వారిఆస్తిని ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు, వైద్యశాలకు, సత్రమునకు, దేవాలయములకు, పుస్తకభాండాగారమునకు ఇచ్చుచు వారు మరణశాసనమువ్రాసిరి. వీరేశలింగముపంతులుగారితరువాత రాజమహేంద్రవరపౌరులలో నెవరును ప్రజాహితమునకు నింతటిధనమునుధారపోసినవారు లేరనుకొందుము. ధనమునకు ఉత్తమగతి దానమే. శ్రీశాస్త్రిగారిపితృదేవులు ప్లీడరువృత్తిలో రెండుచేతులతోను సంపాదించిరి; తమకొమరునిచే చేతికి ఎముకలేనట్లు దానముచేయింపగలిగిరి. దీనికంతకునుమూలము వారు. తమకుటుంబనామమున కిట్లుస్థిరచిరప్రతిష్ఠనార్జించిన శ్రీ కీ. శే. వేలూరి పూర్ణబ్రహ్మానందశాస్త్రిగారిఆత్మకు శాంతికలుగుగాకయనికోరెదము. తమకొమరునిదానములకు తాము పూటకాపులై శ్రీవారితండ్రిగారు—శ్రీ వేంకటరామయ్యగారు—ప్రజల ఆమోదమునందుదురు.

**తెలుగుదేశము కబళింపబడుచున్నది:—**

ఉత్తరమునుండి ఉత్కళులు తెలుగుదేశమును కబళించుచున్నారు. వంగరాష్ట్రమునుండి ఒక్క-అంగుళముమేర—తమకు సవ్యముగ రావలసినదానిని—సంపాదించుకొనలేని ఉత్కళులు ఆంధ్రదేశమునుండి ఆంధ్రులసంఖ్య విస్తారముగగలభాగములనుకూడ తమరాష్ట్రమున కలుపుకొనుచున్నారు. మననాయకులు మాటలాడరు. మద్రాసుప్రభుత్వమున తెలుగువానికేక వినుపించుకొనువారులేరు. ఇంటిలోను బయటనుగూడ ఆంధ్రునకు ఇసుమంతయైన బలములేదు. కారణమేమి?

**వైశ్యయువతీశరణాలయము: గుంటూరు:—**

గుంటూరు వైశ్యయువతీశరణాలయమునకు భవననిర్మాణమునకై పదివేలరూపాయిలు వసూలుచేయ ప్రయత్నములుసాగుచున్నవి. స్త్రీవిద్యాభిమానులగు ఉదారులెల్ల ఈసదుద్యమమునకుసాయపడి యథాశక్తిని విరాళములిచ్చి ఈసంస్థకు శాశ్వతభవనమును ప్రసాదింతురుగాకయని ప్రార్థింతును.

**శ్రీశారదానికేతనము: గుంటూరు:—**

వేసవిసెలవులయనంతరము గుంటూరునందలి శ్రీశారదానికేతము జూలై 1-వ తేదీని తెఱవబడుననియు, నూతనముగ బాలికలనుచేర్పించగోరువారు జూను 15-వ తేదీలోగా దరఖాస్తులుపంపవలయుననియు నికేతనకార్యదర్శులు తెలుపుచున్నారు.

# డైరి

## ఏప్రియలు

20:—చెన్నపురి వనితామండలికి చెందిన 12 మంది స్త్రీలు తిరువల్లిక్కేణిలో స్వదేశీయూరేగింపుజరిపిరి.

:—ఢిల్లీ. శ్రీస్వామి శ్రద్ధానందుగారిమనుమరాలగు శ్రీమతి సత్యవతీగారికి 18 నెలలు విడిఖైదును, 100 రూపాయలజుర్మానాయును వేయబడెను. కొద్దిశిక్షవేసినచో ఈమెను విడుదలచేయగానే మరల సత్యాగ్రహము చేయునుగాన 18 నెలలశిక్షవేసితినిఅని మేజస్ట్రేటు తెలిపెను.

:—ఢిల్లీ. ఫతీమా బేగముగారికి 6 నెలలువిడిఖైదు 100 రూపాయలు జుల్మానా లేక 6 వారములఖైదు.

:—కాశీ. శ్రీమతి ఉమామాలవ్యాగారికి (పండిత మాలవ్యాగారికోడలు) 3 నెలలు విడిఖైదు, 500 రూపాయలు జుర్మానా లేక మరి 6 వారములఖైదు.

:—డక్కాలో టల్ టోలాకాంగ్రెసు 15-వ నియంత్రి శ్రీమతి హేమనళినీగంగూలీగారు ఎరస్టుచేయబడిరి.

:—బొంబాయి. శ్రీమతి సరోజనీదేవిగారికి బొంబాయిదాటిపోగూడదని నోటీసు జారీచేయబడెను.

:—అలహాబాదులో శ్రీమతి స్వరూపరాణిగారికి లాటిదెబ్బలుతగిలినందుకు నిరసన తెలుపుటకై మునిసిపలు సంఘసభ విరమింపబడెను.

:—దినాజ్ పూరులో ఉత్తరువులను ధిక్కరించినందుకు శ్రీమతి జ్యోత్స్నరాణిగారికి ఒకరోజుఖైదు. రూ. 40 జుర్మానా.

:—13-వ తేదీని మున్షీగంజ్ లో కమర్ఖాలో సభజరిపినందుకు శ్రీమతులు ప్రతిభామాయి, కమలాదేవిగార్లకు చెరి 9 నెలలు, శ్రీమతి కనకప్రభాదేవిగారికి ఒకరోజుశిక్షయును వేయబడెను.

21:—మదరాసు. శ్రీమతి రాజమ్మాళ్, శ్రీమతి గౌతమిఅమ్మాళుగార్లు రటనుబజారులో విదేశవస్త్రముల దుకాణములను పికెటింగు చేయుచుండగా అరెస్టుచేయబడి పోలీసుస్టేషనుకు గొంపోబడి వదలివేయబడిరి.

:—గుంటూరునుండి ఢిల్లీకాంగ్రెసుకు పోయినవారిలో శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారొకరు.

:—బొంబాయిలో మౌలానాషౌకతాలీగారు రాయనుసతియను ఆంగ్లవితంతువును తన అంతరంగికకార్యదర్శినిగా ఉండినదానిని వివాహము చేసికొనిరి.

:—ఢిల్లీలో కాంగ్రెసుసందర్భమున ఎరస్టైనవారిలో శ్రీమతి ఖోర్‌సతి.

:—లాహోరు, అవసరాధికారముల ఆర్డినెన్సు 21 సెక్షన్‌క్రింద శ్రీమతి లాడూరాణిజుట్షీ, ఆవిడ కూతురు మనోమోహిని జుట్షీగార్లపై ఛార్జి, క్రిమినలులాసవరణ చట్టముక్రింద జగత్ నారాయణగారి భార్యమీద ఛార్జి. శ్రీమతులు మీనకచటర్జి, మనోమోహన జుట్షి, పిండీదాసుకూతురు, సత్యవతిగార్లపై పికెటింగు ఆర్డినెన్సుక్రిందచార్జి.

22:—మదరాసు. శ్రీమతులు రాజమ్మాళ్, సరస్వతిగార్లు రటనుబజారులో విదేశవస్త్రముల దుకాణములవద్ద పికెటింగుచేయుచుండగ అరెస్టుచేయబడిరి. రాత్రిపోలీసుకమీషనరు కార్యాలయమువద్ద విడుదలచేయబడిరి.

:—కలకత్తాలో శ్రీమతి దుర్గాబాయిదాసుగుప్తగారికి రెండునెలలశిక్ష.

:—శ్రీమతి ఎ. భాస్కరమ్మగారు కునిరేంజి పబ్లిక్ అసిస్టెంటు ఇనిస్పెక్ట్రెసు ఎలమంచిలిలో శ్రీమతి గొడు జోగమ్మగారిచే నడుపబడుచున్న రాధాకృష్ణసమాజమందిరమును సందర్శించిరి.

23:—బొంబాయి. శ్రీమతి సరోజనీదేవిగారికి ఏడాదివిడిఖైదు ఎ. తరగతి.

:—కెన్నూరు శ్రీమతి సరోజినీఘోషుగారికి 4-వ నియంత్రికి ఒకరోజు కఠినశిక్ష విధింపబడెను. మనోరమాబోసుగారికి 9 నెలలు; ఉషారాణీ, వనలతాదేవిగార్లకు చెరి 6 నెలలు, రు 50 జరిమానా విధింపబడెను. వీరందరి చరాస్తి జరిమానాలకోసం జప్తుచేయబడెను.

24:—బ్రహ్మశ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలుగారు శ్రీమతి బెంగుళూరు నాగరత్నముగారికి 'గానకళావిశారద' అను బిరుదమిచ్చిరి.

:—గుడివాడలో అరెస్టుచేసి కైకలూరు సబుజైలులోనుంచిన స్త్రీలలో పమిడిముక్కలవారగు కోగంటి లక్ష్మమ్మ, గుత్తికొండ రామమ్మగార్లను గన్నవరముసబుజైలులోనుంచిరి.

:—ఢక్కా. హిజ్లీ డిటెన్షను శిబిరమునందున్న సుందరకిశోరబానూగారి తల్లి ఈనెల 16-వ తేదీని చనిపోయెను. అపరక్రియలను చేయుటకు అనుమతినియ్యవలెనని ఆతని తండ్రియును, సోదరుడును చాలసారులు దొరతనమునకు లేఖలను, తంతివార్తలనుపంపిరి. కాని ప్రత్యుత్తరము రానేలేదు.

:—ఢిల్లీలో అరెస్టుఅయిన ఆంధ్రస్త్రీలు శ్రీమతులు ఉన్నవ లక్ష్మీబాయమ్మ, లావు అంకమ్మగార్లు.

25:—సిరాజగంజ్. కీర్తిశేషులైన దినేశచంద్రరాయిజమీందారుగారిసోదరి 60 యేండ్లవృద్ధ శ్రీమతి వినోదబాలాసేన్ గారిని శిక్షాకాలము సమాప్తిగాకముందే పాబ్నా జైలునుండి వదలిరి.

:—భీమవరము గ్రామమువనున్న శ్రీరామపురమునందు శ్రీమతులు గుడిపాటి శకుంతలాదేవి, కొండేపూడి శారదాంబగారు పికెటింగుజరిపిరి.

26:—సింధుహైదరాబాదులో చెరసాలవద్దకు బాలికలను ఊరేగింపుతో తీసికొని పోయినందులకు శ్రీమతి సతీబాయివసేతానగారు అరెస్టుచేయబడిరి.

:—సింధు హైదరాబాదు చెరసాలనుండి 21 సింధీ, గుజరాతీ స్త్రీలు అహమ్మదాబాదు పంపబడిరి.

:—శ్రీమతి సునీతిచౌదరిగారు (స్టీవెన్సుహత్యకేసులో యావజ్జీవశిక్ష విధింపబడినస్త్రీ) మిడ్నపూరు సెంట్రల్ జెయిలులోనున్నది. బి. తరగతినుండి సి. తరగతికి మార్చబడినది. కారణము తెలియదు.

27:—మున్షిగంజ్ చేట్యాయూనియనుబోర్డుకోర్టునద్ద పికెటింగుచేసినందుకు శ్రీమతి మనోరమాడేగారికి 50 రూ. జరిమానా చెల్లింపనిచో 3 నెలల కఠినశిక్ష.

:—మున్షీగంజ్. ఊరేగింపు చేయించినందుకు శ్రీమతి మహాసినీసోమ్‌గారి అరెస్టు. సభలో నుపన్యాసమిచ్చినందుకు శ్రీమతి చయరామ్‌గారి (హైల్ పాశ) అరెస్టు.

:—సూరతు శ్రీమతులు ధనపతిబాయి, దయాభాయిగార్ల అరెస్టు.

:—లాహోరు. యల్. ఆర్. జుట్షి, మన్‌మోహిన్ జుట్షిగారలు (ఏ) తరగతిలో నుంచబడిరి. మరియైదుగురు స్త్రీలకు బి. తరగతి. శ్రీమతి లాడోరాణి జుట్సీగారికి 18 నెలలశిక్ష, 50 రూ. జరిమానా మనమోహనిగారికి 12 నెలలశిక్ష, 15 రూ. జరిమానా శ్రీమతులు పిండిదాను, జగత్ నారాయణ, పేవక ఘాట్జి, సత్యకుమారి, చారాదేవిగార్లకు నాలుగేసినెలలశిక్ష, 15 సిరూపాయిల జరిమానా.

:—వేలూరు సబ్ జయిలులలో రిమాండులోనున్న శ్రీమతులు ముదుంబ వేంకటమ్మ, వెంటపర్తి రామతులశమ్మగార్లలో తులశమ్మగారు సబుమేజస్ట్రేటుగారిచే విడుదల గావింపబడిరి. "మాయిరువురి స్త్రీలను

ఒకసారి అరెస్టుచేసి వన్నువదలి వేంకటమ్మగారి ఒక్కరిమీదనే కేసు పెట్టుట న్యాయమా?" అని తులశమ్మగారు మేజస్ట్రీటు గారితో చెప్పగా ఆయన 'మీరు విడుదల చేయబడిరి. వెళ్ళిపోండని' చెప్పిరి.

28:— గుడివాడ. తిరిపినేని కౌశల్యమ్మ గారికి ఒకసంవత్సరము శిక్ష.

:— బొంబాయి. శ్రీమతి సరోజనీదేవిగారిని ఎరవాడ చెరసాలకు మార్చిరి.

:— లాహోరులో డాక్టరు గోపీచందు గారికిని ఆయనభార్యకును వేయబడిన 200 జుల్మానాను వసూలు చేయుటకుగాను పోలీసువారు గోపీచందుగారి తుపాకిని తీసికొనిపోయిరి.

29:— కలకత్తా. శ్రీమతులు శైనిబాలామైత్రా, వాసంతీదేవిగార్లు మహిళారాష్ట్రీయసంఘసభ్యులు మూడు నెలలు ఖైదు విధింపబడిరి.

:— పెషావరునందలి విఖ్యాతకాంగ్రెసునాయకురాలగు విశోదేవి ఇటీవల పెరోలుమీద వదలబడియుండెను. ఆమె పంజాబునుండి 24 గంటలలో వెళ్ళిపోయి ఆర్డినెన్సులు రద్దగువఱకు రాష్ట్రమున ప్రవేశింపరాదని ఉత్తరువొసంగబడెను. ఆమె నేటి ఫ్రాంటియరు మెయిలులో బయలుదేరివెళ్ళెను.

:— శ్రీమతి జమన్‌లాల్ బజాజ్ సతిగారి జరిమానాకై ఇనుపపెట్టెలను తీసికొనిపోవుచుండగా ప్రభుత్వోద్యోగియులను ఆటంకపెట్టిరను నేరముపై రాజాజమ్మన్‌లాల్ కంపెనీ ఉద్యోగియుల పలుగుర ఎరస్టు చేసిరి.

:— కరాచి. శ్రీమతి సతీబాయి వాస్వానీగారికి 4 నెలలశిక్ష, బి. క్లాసు.

:— నెల్లూరు. శ్రీమతులు పాలకోడేటి శ్యామలాంబ, తంగిరాల సీతారామమ్మ, ఓరుగంటి మహాలక్ష్మమ్మ గార్ల కేసు తిరిగివాయిదా.

30:— ఏలూరు. శ్రీమతి ముడుంబ వేంకటమ్మగారి కేసువిచారణ. ఆరునెలలు కఠినశిక్ష, రూ 200 లు జరిమానా. వేంకటమ్మగారి వాఙ్మూలము: "గతపదివత్సరములనుండియు నేనేకాదు మాకుటుంబములోని వారమందరమును కాంగ్రెసు యుద్యమమునందు పాల్గొనుచున్నాము. ఇపుడుకూడ అదేప్రకారము నేను కాంగ్రెసు యుద్యమమునందు పనిచేయుచున్నాను. మీరుచదివినచార్జిషీటులో కొన్ని నిజములున్నవి, కొన్ని అబద్ధములున్నవి. నేను కాంగ్రెసు ననుసరించి చేయుచున్న పనులను నామతము ప్రకారము నేరములుకావు. మీరు నేరములని తోచినచో మీయిష్టమువచ్చినంతశిక్ష నాకు విధింపవచ్చును."

## మే

1:—

2:— నరసాపురముతాలూకాభివృద్ధిసంఘముయొక్క 31-వ వార్షికోత్సవము తూర్పుగోదావరిజిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిల్ యొక్క అధ్యక్షురాలగు శ్రీమతి కోటా కృష్ణవేణమ్మగారి యాజమాన్యమున జరిగెను.

:— నూరి జైలులోనున్న రాజకీయఖైదీలయందు స్త్రీలు ఇందుమతీదేవిగారు (చిటగాంగు ఆయుధముల దోపిడికేసు ముద్దాయి అనంతసింగుగారి సోదరి,) విమలప్రతిభదేవి, సుశీలదాసుగుప్తగారు ఏవోకొన్ని యిబ్బందులవలన నిరశనవ్రతము బూనిరి. వారి బంధువులను రమ్మని తంతివార్తపంపిరి.

:— నెల్లూరులో శ్రీమతి పాలకోడేటి శ్యామలాంబ, శ్రీమతి తంగిరాల సీతారామమ్మ గార్లకు 17 (1) క్రిమినల్ లా క్రింద 6 నెలలు విడిఖైదు, 500 రూ. జరిమానా లేక ఒకమాసము హెచ్చుఖైదు. ఆర్డినెన్సు క్రింద ఆరునెలలు విడిఖైదు, 117 ఐ. పి. సి క్రింద ఆరునెలలు విడిఖైదు. శిక్షలన్నియు ఏకకాలమున అనుభవింపదగినవి. ఇరువురకును బి. తరగతి. శ్రీమతి సీతారామమ్మగారితో నా మొబాలిక రెండేండ్లది

ఉం డెను. శ్రీరంగనాథస్వామిఉత్సవసమయమున బహిష్కారణకరపత్రములు పంచిపెట్టినందులకై శ్రీమతి ఓరుగంటి మహాలక్ష్మమ్మగారికి 17 (1) క్రిమినల్ లా క్రింద 6 నెలలు విడిఖైదు, 100 రూపాయిలు జరిమానా లేక అధికముగా ఒకమాసముఖైదు, ఆర్డినెన్సు క్రింద 6 నెలలు విడిఖైదు. 117 ఐ. పి. సి క్రింద ఒకఏడు విడిఖైదు. బి. తరగతి.

:— బెజవాడ. ముదునూరుగ్రామములో అరెస్టుకాబడిన మెల్లి వరలక్ష్మీకాంతమ్మగారికేసు విచారణ. ఆరు నెలల విడిఖైదు.

3:— బొంబాయి. హిందూస్థాన్ సేవాదళము మహిళాశాఖలో ప్రాముఖ్యమువహించిన శ్రీమతి సోఫియా సోంజీగారీదినము పాండుహార్బరురోడ్డులో అరెస్టు చేయబడిరి, ఈవిడనుతొలుదొల్త అవసరాధికారముల ఆర్డినెన్సుక్రింద అరెస్టుచేసి, కొన్నాళ్లుజైలులోనుంచి వదలిపెట్టి, బొంబాయినగరములో ప్రవేశింపరాదని నిషేధించిరి. సోంజీగారు ఇప్పటివరకు బంద్రాలోనుండి ఈదినము బొంబాయి ప్రవేశించి అరెస్టయిరి.

:— గుడివాడ. సబుమేజస్ట్రీటుగారిచే విచారణకాబడి ఆరుమాసములు కఠినఖైదు నూరురూపాయిలు జరిమానా వేయబడి రాయవెల్లూరు సెంట్రల్ జైలుకు తీసుకపోబడినవారు 1. పొలదుగు వరలక్ష్మమ్మ గుడివాడ 2. చిక్కాలినేని మహాలక్ష్మమ్మ, కపిలేశ్వరపురం 3. నాదెళ్ళ మహాలక్ష్మమ్మ, ముదునూరు 4. తుమ్మల సత్యవతమ్మ, ముదునూరు :—6 నెలలశిక్ష, జరిమానా రెండువందలు. గుడివాడ జాయింటు మేజస్ట్రీటుకోర్టులో విచారణకాబడి శిక్షపొందినవారు 1.(గొల్వేపల్లి)పోతామహాలక్ష్మమ్మ,(వల్లభనేని రామబ్రహ్మగారి భార్య) 2. గోనుగుంట్ల సుబ్రమణ్యంగారి భార్య వెంకటవరసమ్మ, గుడివాడ. 3. ఆరెకపూడి మాణిక్యమ్మ, 4. ఆరెకపూడి నాగభూషణంగారి భార్య ఉమామణి, 5. ఆరెకపూడి మహాలక్ష్మమ్మ, 6. కోనేరు భారతమ్మ. (అంగలూరు) 7. ఘంటా మల్లికాంబ, 9 నెలల బాలునితో సహా (తమిరిశ) 8. కన్నెకంటి నాగరత్నమ్మ, (తమిరిశ) 9. చెరుకూరి సౌభాగ్యమ్మ, (గొల్వేపల్లి) వీరందరికి ఒక సంవత్సరం కఠినశిక్ష, 10. ఆరెకపూడి సుగుణమణి 14 సంవత్సరముల యీడుగల బాలికకు రెండుసంవత్సరములు కఠినశిక్ష.

4:— నాగపురము. గాంధిదినోత్సవము. శ్రీమతి కాల్కారుగారు (హింగంఘాటు) మరాఠీ సంఘప్రస్తుత డిక్టేటరు మరినల్గురు స్త్రీలు అరెస్టు.

:— బొంబాయి. కుమారి సోఫియాసోంజిగారికి శిక్ష. బి. తరగతి ఆమె విచారణయందు పాల్గొనలేదు. తనపని కాంగ్రెసు వాలంటీరు అనిమాత్రము తెలిపెను.

:— బెజవాడ. యువతీజనప్రార్థనాసమాజము 18-వవార్షికోత్సవము. శ్రీమతి జ్ఞానాంబగారి యధ్యక్షతను ముగిసెను.

:— కలకత్తా. శ్రీమతి సువాసినీదేవి (పాయకవరం) గారికి ఆరువారముల శిక్ష.

:— మున్షిగంజిలో శ్రీమతి చాయాదేవి (పాయకవరా) గారికి 9 నెలలు శిక్ష. పాయకపొరాడిక్టేటరు శ్రీమతి సురబాలాగారి అరెస్టు. శ్రీమతి సురబాలాచక్రవర్తిగారికిని మరిరెండుగురు స్త్రీలకును జుల్మానా.

:— నాగపూరు. అయిదుగురు స్త్రీలను అరెస్టుచేసి సేతబల్డి పోలీసు స్టేషనులో నుంచిరి. వారిలో నొక వడ్రంగిస్త్రీ అచటనే ఆకస్మికముగా ప్రసవించెను. ఆడపిల్లపుట్టెను. తల్లిని పిల్లనువెంటనే చేరువనున్న మెటర్నిటీహోముకు తీసుకొనివెళ్ళిరి. వారచట కులాసాగానున్నారు.

5:—లాహోరు. పంజాబుశాసనసభయందు జ్యోతిప్రసాదుగారిప్రశ్నకు ప్రత్యుత్తరముగ సర్ హెన్రీక్రేకు గారు ఇట్లుదెలిపిరి: "ఈరాష్ట్రమునందు జనవరిమొదలునుండి శాసనోల్లంఘనమునకై శిక్షింపబడిన సంఖ్య 88. వీరిలో 6 గురు ఏ క్లాసుకు, 31 మంది బి క్లాసుకు, 51 మంది సి తరగతికిచెందియుండిరి. 6 గురికి కఠినఖైదు.

:—మదరాసు. శ్రీమతి సరస్వతమ్మ, వేఱొకస్త్రీయు సాయంకాలము చీనాబజారులో బహిష్కరణకర పత్రములు పంచుచుండగ అరెస్టుచేయబడిరి. కమీషనరు కార్యాలయమునకు గొంపోబడిరి. మరియిరువురుస్త్రీలు రటనుబజారులో పికెటింగుచేయుచుండగ అరెస్టుచేయబడిరి. రాత్రి అందరు విడుదల చేయబడిరి.

:—ఢిల్లీలో శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి విడుదల.

:—బొంబాయి. శ్రీమతులు రత్నాబెను, మణిబెనుగార్ల అరెస్టు.

6:—శ్రీయుత మద్దుల గిరిరావుగారిభార్య రామాయమ్మగారు వేలూరు సెంట్రల్ జెయిలునందు ప్రసవించిరి. ఆడశిశువు కలిగెను.

7:—

8:—ఏలూరు. మామూలుప్రకారము యుదయమునగూడ జాతీయగీతములను పాడుచు ప్రభాతభేరీలుపుర వీథులందు తిరుగుచుండగా పసుమర్తి పురుషోత్తముగారి యింటిసమీపమున వారు పోలీసువారిచే నాటంకపరుపబడిరి. సర్కిల్ ఇన్ స్పెక్టరుగారు కొందరు పోలీసుకనిస్టేబిల్సు అచటికేగిరి. శ్రీమతులు జవ్వాజి రాజరత్నమ్మ, (జవ్వాజి అప్పారావుగుప్తగారిభార్య) మద్దుల దమయంతి (పసుమర్తి పురుషోత్తముగారిపుత్రిక) కంది నాగరత్నమ్మ, చుండూరి రత్తమ్మ, మాజేటి మాణిక్యాంబ, (మాజేటి నారాయణరావుగారి భార్య) యీఅయిదుగురును అరెస్టుచేయబడి పోలీసుస్టేషనుకు గొంపోబడి అచ్చట లాకపులోనుంచబడిరి. వీరితోబాటు తిరుగుచున్న పసుమర్తి పురుషోత్తముగారిపుత్రిక కంభంపాటి స్వరాజ్యలక్ష్మి బాలికలనికాబోలు విడిచిపెట్టబడిరి. మొదటిపిల్లకు 12 ఏండ్లు రెండవపిల్లకు 7 ఏండ్లు వయసుగలదు. పైస్త్రీలు అందరును గౌరవమగు వైశ్యకుటుంబములకు చెందియున్నవారు. అరెస్టు యుదయము సుమారు 5-30 గంటలకు జరిగినది. పసుమర్తి పురుషోత్తముగారు, అరెస్టుకాబడిన అయిదుగురు స్త్రీలకును ఉదయము ఫలహారమును, మధ్యాహ్నము భోజనమును పంపిరి. స్త్రీలు లాకపులో ఉత్సాహముగనున్నారు. అరెస్టుకాబడిన మొదటిముగ్గురుస్త్రీలును ఇదివరకొకసారి అరెస్టుకాబడి యిచట సబుజయిలులో పదునైదుదినములుంచబడి విడుదలచేయబడిరి.

:—కాకినాడ. ఆంధ్రబాలవితంతుశరణాలయములో ఒక స్త్రీపునర్వివాహము జరిగినది. ఇది 43 వ వివాహము. కన్య శరణాలయపు అభిమానపుత్రిక వెంకటసుబ్బమ్మ; వరుడు విశాఖపట్టణము కాపురస్థుడు, మునిసిపల్ స్కూలు హెడ్ మాష్టరు, నిష్టల సూర్యనారాయణమూర్తిగారు.

:—శ్రీమతి ముడుంబ వేంకటమ్మగారు ఏలూరు సబ్ జయిలునుండి వేలూరు సెంట్రలుజయిలుకు పంపబడిరి. ఈమెతో ఈమె కడపటికుమారుడు రెండుసంవత్సరములు ఆరుమాసములఈడుగలవానిని జైలుకుపంపుటకు అధికారులు నిరాకరించిరి.

9:—నెల్లూరుజెయిలునుండి శ్రీమతులు తంగిరాల సీతారామమ్మ, పాలకోడేటి శ్యామలాంబ, ఓరుగంటి మహాలక్ష్మమ్మగార్లు వేలూరు సెంట్రలుజయిలుకు మార్చబడిరి.

:—రణపూరు. కథియవాడులో ప్రజాహితజీవియు, ఢొలెరాసత్యాగ్రహసమితినాయకురాలునగు శ్రీమతి దేవీబెన్ పట్టాణిగారికి ఆరునెలలు కఠినశిక్ష.

10:—మదరాసు. నుంగంబాకములో కొల్లంగోడు రాజాగారిసతి కళ్యాణివాసుదేవరాజాగారు మరణించిరి. చనిపోవునరికి ఈమెకు 36 సంవత్సరములు. ఈమె పూర్వతిరువాన్కూరు ప్రధానన్యాయమూర్తి రామన్ మీననుగారి కుమార్తె. సర్ శంకరన్ నాయరుగారిమనుమరాలు. ఈమెకు ఫ్రెంచి, సంస్కృతి, అంగ్లభాషలయందు చక్కని ప్రవేశముగలదు.

:—విశాఖపట్టణములో తాటికొండ చినవెంకటరమణగారి కుమారునకు (16 ఏండ్లు) కర్నాటకపు వెంకటరమణయ్యగారికుమార్తె పార్వతమ్మకును (11 ఏండ్లు) శారదాచట్టమునకు వ్యతిరేకముగా వివాహము. కేసుచేయబడెను. వెంకటరమణ, వేంకటరమణయ్య, పురోహితుడు చిక్కవల్లి కామేశ్వరరావుగార్లకు చెరి 50 రూపాయిలు లేక 15 రోజులు విడిఖైదు విధింపబడెను.

11:—రేపల్లె. మే 1 తేదీన శ్రీమతులు యలవర్తి శేషమ్మగారి నాయకత్వమున తుమ్మల తులశమ్మ, యార్లగడ్డ రత్తమ్మ, యనమదల రత్తమ్మ, పట్టిసూటి రాధాకృష్ణమ్మ, కొల్లి రాఘవమ్మ, కాజ లక్ష్మమ్మగార్లు పోటుమెర్క గ్రామములో బైలుదేరి కైతేపల్లి, చోడాయపాలెం, బొబ్బర్లంక, మోర్తోలు, చాట్రగడ్డ గ్రామములలో బహిష్కారకరపత్రములు పంచుచూ 8 వ తేదీన తూర్పుపాలెం గ్రామములో యుండగా రేపల్లె పోలీసువారు అరెస్టుచేసి సబుజైలులో ఉంచినారు. కాజ లక్ష్మమ్మగారినిమాత్రం రేపల్లెలో మధ్యాహ్నం 2 గంటలుకు వదలివేసినారు. మిగిలిన ఆరుగురు స్త్రీ వాలంటీర్లను సి. యల్. ఎ. 17 (1) సెక్షన్ క్రింద కేసుపెట్టి సబుమేజస్ట్రేటుగారు విచారణచేసి ఒక్కొక్కరికి ఆరుమాసములు కఠినశిక్ష విధించి సి. క్లాసు నొసంగిరి.

:—రంగూను. మిసు రే ఊసంగు ఎం. ఏ., బి. లిటు (ఆక్సుఫర్డు)గారు బర్మారౌండు టేబిలుసభలోని ఏకైకస్త్రీసభ్యురాలు. యూ. సాబావు ఎం. ఎ. ఐ. సి. ఎస్ గారిని వివాహమాడెను. ఈమె కే. కే.యూ మేఊంగు బర్మాప్రభుత్వము హోముమెంబరు కుమార్తె. సాబాబులో ఈమెకు పరిచయము రంగూను కాలేజిలో ప్రారంభమై యూనివర్సిటిలో పెంపొంది యిట్లు ఫలించెను.

12:—మదరాసు. ఆంధ్రపత్రికఉపసంపాదకులలో నొకరగు గుంటూరుజిల్లాకాపురస్థులునైన శ్రీ వోగేటి వేంకటసుబ్బయ్యశాస్త్రి బి. ఏగారు శ్రీమతి పి. వెంకటసుబ్బమ్మఅను వితంతువును మాంబళము త్యాగరాయనగరమున విధవావివాహసహాయకసభయాజమాన్యమున పరిణయమైరి. వధువు మైలాపూరు నేషనల్ బాలికాపాఠశాలయందు నాల్గవఫారములో చదువుచున్నది.

:—తిరువాన్కూరు. జూనియరు మహారాణీగారు బొంబాయిరేవులో 'విక్టోరియా' అను స్టీమరెక్కి యూరోపుఖండమున పర్యటనముచేయుటకై వెడలిరి.

:—మదరాసు. రటనుబజారులో శ్రీమతులు సరస్వతిపాండురంగం, గోదామృతం, త్యాయనాయకి, మాణిక్యమ్మగార్లు పికెటింగుచేయుచుండగా అరెస్టుచేయుట. పిమ్మటవదలివేయుట.

:—నెల్లూరు. ఇసకా చంచయ్యనాయుడుగారు పంచమస్త్రీయగు బొడ్డు లక్ష్మిదేవమ్మగారిని వర్ణాంతర వివాహము గావించుకొనిరి.

13:—అహమ్మదాబాదు. కుమారి వినోదినీలకంఠంగారు మునిసిపలు బాలికలహైస్కూలు ప్రధానోపాధ్యాయినియు, గుజరాతురాష్ట్రీయ 18-వ నియంత్రియు మరినల్గురుస్త్రీలు షోలాపూరు దినోత్సవము జరిపినందున అరెస్టుచేయబడిరి.

:—బెలగాము. సర్దారు వల్లభాయి పటేలుగారి కొమార్తె శ్రీమతి మనీబెన్ పటేలుగారు శిక్ష పూర్తికాక మునుపే విడుదలచేయబడిరి.

14:—అహమ్మదాబాదు. హోలీపూర్ణిమదినసందర్భమున యూరేగింపుజరుపుటకు ప్రయత్నించినందుల కరెస్టుగావింపబడిన నలుగురి స్త్రీలకు చెరి 25 రు. జరిమానా లేక 6 వారముల కఠినకైదు.

15:—బాలసోర. విద్యాధరిదేవి, ఇందుమతీదేవి, సోనాదేవి, మరియిరువురు స్త్రీవలంటీరులు పికెటింగుచేసినందుకు రూ. 50 జరిమానా, ఇవ్వనిచో ఒకనెల కఠినశిక్ష పొందిరి.

16:—లాహోరు. రంగమహాలునుండి బయలుదేరి అనేకవేలమందిగల స్త్రీపురుషులు ఉత్సవముతో అనర్కాలి బజారువరకు రాగా ఆటంకపఱచి సీతాదేవి (ప్రిన్సిపాలు ఛబిలుదాసుభార్య), రాంప్యారి (లాలరామచంద్రునిసతి)గార్లను అరెస్టుచేసిరి.

:—అలహాబాదు. జిల్లామేజస్ట్రీటుగారు జయినయువకపత్రికను ప్రచురించుచున్న శ్రీమతి లక్ష్మీదేవిగారిని వేయి రూపాయిలు ధరావతుకోరిరి.

:—శ్రీమతులు ఎక్కల పున్నమ్మ, కోగంటి లక్ష్మమ్మగార్లను కంకిపాడు పోలీసువారు అరెస్టుచేసి గన్నవరం సబ్‌జైలులోనుంచిరి.

17:—మదరాసు, చైనాబజారునందు శ్రీమతులు కోదామృతమ్మాళ్, సరస్వతమ్మాళ్, మాణిక్యంఅమ్మాళ్ కరపత్రములను పంచిపెట్టినందుకు అరెస్టుచేసి పోలీసుస్టేషనుకు తీసుకొనివెళ్ళి రాత్రి 9 గంటలకు వదలివేసిరి.

:—కాలికటు. శామ్యూలు వారూను గారిసతికి 18 నెలల కఠినశిక్ష.

18:—నెల్లూరులో శ్రీమతి పొణకా కనకమ్మగారి అరెస్టు.

:—మలఖానగరు. యూనియనుకోర్టును పికెటుచేసినందుకు శ్రీమతులు కమలాదేవి, సరయూబాలాదేవిగార్లకు 6 నెలల కఠినశిక్ష.

:—మార్చి 11-వ తారీఖున కాశీదశాశ్వమేధఘాటాలో కాంగ్రెసువాదులగు స్త్రీలను పోలీసులు కష్టపెట్టిరని కేసుచేయబడెను. మేజిస్ట్రేటు విచారణలో పోలీసులు దోషులని నిర్ణయింపబడెను. కాని కాశీజిల్లామేజిస్ట్రేటగు ఎస్. గరెన్ గారు 5 గురు ముద్దాయిలును నిర్దోషులని తీర్పుచెప్పి విడుదలచేసెను.

:—లక్నో. శిక్షాకాలము పూర్తియగుటచే కాంగ్రెసుప్రముఖురాలు శ్రీమతి సునీతిమైత్రాగారు విడుదలచేయబడిరి.

:—విశాఖపట్టణము. శ్రీమతులు మూల వెంకమాంబ, చేకుమళ్ళ సీతారామమ్మగార్లు విడుదలయైవిచ్చేసిరి.

19:—బొంబాయి. మూడునెలలుశిక్ష ననుభవించినమీదట శ్రీమతి మీరాబెన్ కన్య (మిస్ స్లేడు) ఆర్థరోడ్డు చెరసాలనుండి విడుదలచేయబడిరి. విడుదలకాగానే స్లేడుకన్య గాంధిమహాత్ముని దర్శింపదలచి పూనా వెళ్ళెను. యరవాడచెరసాలలోనున్న మహాత్ముని సందర్శింపవీలులేదని చెరసాలాధికారులు చెప్పిరి.

:—అలహాబాదు. బిరిషుస్త్రీ జఫరాలీసతియైన సావిత్రీదేవిగారు పరారియైయున్న యశపాలున కాశ్రయమిచ్చి దోషియయ్యెనని జూరీ ఏకగ్రీవముగా నిర్ధారించెను. అసిస్టెంటుసెషన్సుజడ్జి ఆవిడకు ఐదేండ్లుకఠినకైదు విధించెను. సావిత్రీదేవి ఆకుపచ్చచీరధరించి కోర్టునకువచ్చెను. శిక్షను శాంతముగా స్వీకరించెను.

:—ఏలూరు. ప్రభాతభేరీలసందర్భమున అరెస్టుకాబడి సబుజైలులోనున్న అయిదుగురు స్త్రీలలోను శ్రీమతి మాకేటి మాణిక్యాంబగారిని విడుదలచేసిరి. తక్కిన నలుగురుస్త్రీలు శ్రీమతులు చుండూరి రత్తమ్మ, మద్దుల దమయంతి, కంది నాగరత్నమ్మ, జవ్వాజి రాజరత్నముగార్లపైని చార్జిషీటుదాఖలు చేయబడెను.

# గ్రంథపరిచయము

**భక్తకథావళి:—**

గ్రంథకర్త్రి శ్రీమతి వర్రా రాజరత్నమ్మగారు. పురాణములనుండియు, ఇతిహాసములనుండియు ఉత్తేజకరములగు కథాంశములను గ్రహించి శ్రీమతిగారిందుకూర్చిరి. కొన్నికథలు అపూర్వములుగనున్నవి. జానకీదేవికథ యిందుకు నిదర్శనము. బాలురును బాలికలును ఉత్సాహముతో నీగ్రంథమును చదువగలరని చెప్పగలము. క్రౌనుసైజు గ్లేజుకాగితములు 90 పుటలు. వెల 0-12-0 అణాలు. వలయువారు వర్రా సత్యనారాయణమూర్తిగారు, తాలూకాబోర్డుఆఫీసు, నూజివీడుఅను చిరునామాకుగాని-వర్రా సీతారామయ్యచౌదరిగారు, గన్నవరము అను చిరునామాకుగాని వ్రాయవచ్చును.

**శాంతివిజయము:—**

చరిత్రవిషయిక నవల. గ్రంథకర్త విద్యార్ణవ, సాహిత్యసరస్వతి బిరుదాంకితులును, ఉరవకొండబోర్డు హైస్కూలు ఆంధ్రపండితులును అగు శ్రీనూతలపాటి పేరరాజుగారు. గ్రంథనామము సూచించునటుల ఇందు అహింసాతత్త్వము బాగుగ ప్రదర్శింపబడినది. కథ రాజపుత్రస్థానమునకు సంబంధించినది. కథకంటె ఇందలి శైలి మమ్ము హెచ్చుగ నాకర్షించినది. ఇట్టిశైలితో రాయలసీమ రంగస్థలముగాగల కొన్నినవలలు పేరరాజుగారు రచియించుచో భాషాపోషకమగునని మాతలంపు. శ్రీవారు చేకొందురు గాక! చక్కని గ్లేజుకాగితములపై ముద్రింపబడి ఈశాంతివిజయము ౧౩౭ పుటలతో నొప్పుచున్నది. వెల 0-14-0 అణాలు. ప్రకాశకులు యం. యస్. శర్మఅండ్ కో, ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు, గుంటూరు.

**ప్రేమసుందరి.—**

ద్వితీయభాగము. శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాలలో చతుర్థపుష్పము. గ్రంథకర్త హనుమనగుత్తి దేవదానము. ఈగ్రంథముయొక్క ప్రథమభాగమును లోగడ మాచదువరుల పరిచయము చేసియున్నాము. ఇపుడు వెలువడిన ఈరెండవభాగము క్రౌనుసైజున 289 పుటలు. రఫ్ కాగితము. వెల 0-8-0 అణాలు. చిరునామా: కల్లూరు అహోబలరావు, మేనేజరు, భారతభవనము, కోలుబజారు, బళ్ళారి.

**ఠాకూర్ దుర్గాదాస్:—**

గ్రంథకర్త యస్. ఆర్ రావుగారు. సుప్రసిద్ధచారిత్రకకథ ఇతివృత్తమగుట ఈగ్రంథమును దీక్షతో చదివితిమి. కాని రచనము ఏమియు బాగుండలేదని వ్రాయుటకు చింతించుచున్నాము. కొన్నికొన్నివాక్యముల నిర్మాణము తలతోకసంబంధములేనివిగానున్నవి. అచ్చుతప్పులు, అంటని అక్షరములు గ్రంథమును మఱింతపాడుచేసినవి. ఇది ఈ గ్రంథమునకు మొదటిభాగము. హిందూదేశచరిత్రలోని ఒకరసవద్ఘట్టమును గానముచేయు ఈ గ్రంథముయొక్క రెండవభాగమైనను రచనాసౌందర్యమునకు, ముద్రణాసౌందర్యమునకు నోచిపుట్టునుగాక! డెమ్మీపీయుకాగితములమీద 152 పుటలుగల ఈప్రథమభాగము వెల రు 1-8-0. వలయువారు సరస్వతీగ్రంథమాల, కాకరపఱ్ఱు అను చిరునామాకు వ్రాయునది.

**ఆంధ్రపత్రిక ఆంగీరససంవత్సరాదిసంచిక:—**

ఎప్పటితీరున ఆంధ్రవిద్వన్మహాజనుల అమూల్యవ్యాసములతో, పెక్కుచిత్రములతో సుందరతరముగనున్నది. వెల దినపత్రికచందాదారులకు 1-0-0, వారపత్రికచందాదారులకు 1-4-0, ఇతరులకు 2-0-0. తపాలఖర్చులు ప్రత్యేకము. ఆంధ్రపత్రికాకార్యాలయము, జార్జిటవును, మదరాసు.

ఈసంచికయందు గౌరవస్థానమలంకరించుచున్న 'ప్రాతఫక్కి పాటలు' మా కార్యాలయమునకువచ్చినపుడు కవరువిప్పుచుపుటలోడనే శ్రీ రామకృష్ణకవుల 'ఆంధ్రకవులఅపరాధములు' జ్ఞప్తికివచ్చినవి. అందలిహాస్యమును ఇందలిహాస్యమును సజాతీయమైనవి. తుదిని అది ఇట నీతిబోధలో తేలిపోయినది. ...

చిన్నచిన్న వాక్యములేకాని ఒక్కొక్క వాక్యమందును లోతుపట్టరానిభావములు. ఆలోచించినకొలదియు అవి మనలను రెక్కలుకట్టుకొని ఎక్కడికో కొనిపోవును. కావుననే అవి 'భావచిత్రము'లైనవి. ...

ఆరాధనసాధనములలో భక్తి ఉత్కృష్టమైనదనియు, పదార్థము ప్రధానముగాదనియు మధిగొండ కోటయ్యశాస్త్రిగారి 'రాధారాధనము' బోధించుచున్నది. సోదరీమణులు ఆలింతురుగాక! ...

శ్రీమతి బి. లలితాంబగారి 'ప్రేమబలి' చచ్చియు పతినివిడువని ఒకస్త్రీపాత్రను సృష్టించినది. అయితే ఆమెఛాయయా? కాదు. దివ్యజ్యోతి. దానిలో పురుషుని తేజము లీనమైనది. ఆత్మ, పరమాత్మల ఐక్యమనగా నిట్టిదా? ... ...

చెల్లెలికి అక్కతో 'ఎడబాటు'. (చనిపోయిన) తల్లిలేనిలోటు చెల్లెలికితీర్చినఅక్క అత్తింటికిపోయినది. ఇంట చిన్నచెల్లెలు, తండ్రి. కాని ఆయింటి చక్కదనము చిక్కిపోయినది.

చెలువుగాతీరుగా విరచించినట్టి
రంగవల్లికలే కానరావు నేడు!
ఆమనోజ్ఞశృంగారమే, ఆక్రమమ్మ
ఆకళరయు, పాసినది యాగృహము నేడు.

అక్కకొఱకు మల్లెతీవియలు జాలిగాజూచుచున్నవి. చెల్లెలు పిలుచుచున్నది. కాని ఆచూపులకు తెల్లతన మేగతి! ఈపిలుపు అరణ్యరోదనమే. ...

మొదట బిగిసికూర్చుండుట. తరువాత సడలి సాగుట. ఇది అల్లుళ్ళనైజగుణము. శ్రీమతి నుసర్ల లక్ష్మీనరసమాంబగారి 'పుట్టింటికిప్రయాణము' అను కథలోని అల్లుడిట్టివాడే. "ఇదిగో, చూడండీ! కోపం వచ్చిందా? తెలివితక్కువచేత చెప్పేను. వెళ్లనులెండి. మీరూ, నేనూ యీసారివెడదాం. మానాన్నతోటి అట్లా చెప్పేస్తాను" అనినతరువాత గూడ గంగను ఆమెభర్త 'ఫూల్' అనగలడా? అనగలిగితే ఆమె వెంట ఎందుకుపోవును? ...

'అంశువు' రెండుభాగములుగ విడదీయనగును. అజ్ఞానతిమిరమనసెట్టిదో వర్ణించుభాగము మొదటిది. ఆతిమిరవిచ్ఛేదనమునకు విజ్ఞానాంశువును ప్రసాదింపచేయుప్రార్థన రెండవది. అది తిమిరమువలె విస్తృతము, ఇది ప్రార్థనయుండవలసినరీతిని క్లుప్తము. ...

శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారి 'పందిరిక్రింద' అనునది ఏకముఖమున లేకున్నను మొదటినుంచి తుదిదాక చదువప్రరికొల్పుచున్నది. తెలుగుకుటుంబజీవనపద్ధతులు, చిన్నపిల్లలఅల్లరి, పల్లెటిజీవనము ఇందు సొబగాజినవి. ...

శిశువులకు సృష్టించుటయేగాని లయము చేయుట తెలియదని దాల్టను చెప్పును. అట్లే 'నిజమైనప్రేమ'లోని చిట్టి మొదటపువ్వులను తలలో పెట్టుకొనదలచినదేగాని నాశనము చేయ దలపెట్టలేదు. నాశనము చేయుతలంపు తల్లినుండియేవచ్చినది. తల్లి దౌష్ట్యము. బిడ్డ ప్రార్థనామృదూక్తులు. నిజమైనప్రేమ జడమీదదికాదు. బిడ్డమీదిదే. ...

---

ఉత్సాహముగలపాఠకులు లేఖాముఖమున జూను 10 లోపున మాకు తెలుపుదురుగాక!

పుష్పచయములోని శ్రీ చదలవాడ నాగభూషణరావు చౌదరిగారి 'పురుషధర్మము' నందలి అభిప్రాయములతో మీరు పూర్తిగ నేకీభవింతురా? ...

శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మిగారు 'ఇందరిలోను ఆఅదృష్టవంతులెవరో?' అనుకథలోదిని సమిష్టికుటుంబములను సమర్థించియున్నారు. ప్రస్తుతసాంఘికపరిస్థితులలో హిందూదేశమున సమిష్టికుటుంబముల పద్ధతి నిలువగలదా? నిలుపుట వాంఛనీయమా? నిలువకపోవుచో కలుగగల నష్టములేవి? ...

'చిన్నచెల్లాయి' అను శ్రీమతి బొడ్డు సీతాలక్ష్మిగారి పద్యవ్యాసవిషయమునగలసారస్యమేమి? ...

శ్రీమతి తూతిక కమలాంబగారు వ్రాసిన 'నవనాగరకము' స్త్రీలనుగూర్చియేనా? ...

గృహలక్ష్మిలో 'గృహోద్యానము' అను క్రొత్తశీర్షికనొకదానిని పెట్టినున్నాము. అది ఎట్లుండవలయును?

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# కేసరిగారి ఔషధములు

### 1. లోధ్ర

స్త్రీలబుతుసంబంధమగు జాడ్యములకు వజ్రాయుధము. మరియు వంధ్యత్వమును పోగొట్టును. ఆరోగ్యము రక్తపుష్టికలుగజేయును.

12 ఔ. రు. 3 0 0   6 ఔ. రు. 1 10 0

### 2. అమృత

రక్తశుద్ధిద్రావకము. నరములబలహీనత, సుఖ జాడ్యములు, ఆకలిలేమి, నిస్సత్తువ మొదలగు వ్యాధులను ఖండించును.

12 ఔ. రు. 3 0 0   6 ఔ. రు. 1 10 0

### 3. అర్క

సర్వవిధములగు జ్వరములను నిర్మూలించును.

6 ఔ. రు. 2 8 0

3 ఔ. రు. 1 8 0   1 ఔ. రు. 0 8 0

### 4. జయద్రావకము: విజయవటి

కలరామందులు   వెల రు. 1 0 0

### 5. చంద్రోదయమకరధ్వజ

పుష్టిని కలిగించుటకు   వెల రు. 5 0 0

### 6. ఆదిత్యలవణము

అజీర్ణసంహారిణి   వెల 6 ఔ. రు. 1 4 0

### 7. మార్తాండలేపము

చర్మరోగములకు   వెల రు. 0 8 0

### 8. కస్తూరివటి

కఫరోగములకు   వెల రు. 2 8 0

### 9. రాజమనోల్లాసిని

పడకటింటిమందు   వెల రు. 1 0 0

### 10. నారాయణతైలము

వాతవ్యాధులకు   6 ఔ. రు. 2 0 0

### 11. భృంగామలకతైలము

మెదడు చల్లబడుటకు   6 ఔ. రు. 1 0 0

### 12. ధాతువృద్ధి చూర్ణము

ఇంద్రియపుష్టికి   డబ్బీ రు. 2 0 0

### 13. మహాగంధకవటి

ఛర్దివ్యాధులకు   40 బిళ్లలు రు. 3 0 0

### 14. తాంబూలరంజని

తాంబూలమాత్రలు   వెల రు. 0 4 0

### 15. మాదీఫలరసాయనము

పైత్యములకు   3 ఔ. రు. 0 12 0

### 16. కఫకేతువటి

దగ్గు, పడిశములకు   24 బిళ్లలు రు. 0 12 0

### 17. మధుమేహవటి

అతిమూత్రవ్యాధికి   40 బిళ్లలు రు. 3 0 0

### 18. శిలాజితురసాయనము

సర్వరోగనివారిణి   తులం రు. 2 0 0

### 19. నీలాంజనము

కంటిజబ్బులకు   డబ్బీ రు. 1 0 0

### 20. సుదర్శనాంజనము

జన్నికలికము   డబ్బీ రు. 2 0 0

### 21. సౌవీరాంజనము

కండ్లకు చలువనిచ్చు సుర్మా   డబ్బీ రు. 1 0 0

### 22. గర్భరక్షక

గర్భిణిస్త్రీలకు   3 ఔ. రు. 2 0 0

### 23. సోమరాజాదిలేపము

బొల్లికి   బుడ్డివెల రు. 2 0 0

### 24. విషవిధ్వంసిని

తేలుమందు   వెల రు. 0 8 0

### 25. వజ్రతైలము

దంతరోగనివారిణి   వెల రు. 0 8 0

### 26. క్షారతైలము

కర్ణరోగనివారిణి   వెల రు. 0 8 0

### 27. అతిసారగజకేసరి

గ్రహణిమందు   24 మాత్రలు వెల రు. 0 12 0

### 28. కుముదవటి

సుఖభేదిమందు   24 మాత్రలు వెల రు. 0 12 0

### 29. సిద్ధామృతచూర్ణము

కాఫీకిబదులు   వెల రు. 0 8 0

### 30. బాలసంజీవినివటి

శిశువులకు   50 మాత్రలు వెల రు. 1 0 0

### 31. మధువిరేచనవటి

భేదిమందు   24 మాత్రలువెల రు. 0 12 0